# విషయ సూచిక

తేది. | పేజి.

# పీ ఠి క

ఈ లోకమునందు జీవించి సంచరించు మనుష్యులు చేయకూడిన భక్తియును మేలును నిండిన కృత్యములలో, మన జ్ఞాన సహోదరులైన మృతిపొందిన వారల ఆత్మలను గురించి పూజ జప ప్రార్థనలు చేయునది అధిక ఘనతవహించిన పుణ్యమగును. ఏలాగంటే, తిరుసభ వేడుదలవల్లను, దివ్యపూజ బలివల్లను, చేసిన దానధర్మమువల్లను చచ్చిన వారలకు ఉపయోగముగానుండునని వేదపారగులకు ప్రకాశ మహిమగానున్న అర్చ్య. అగుస్తీనుస్ అనువారు వచించిరి. అందుచేత పూజ తపసు దానము మొదలగు ధర్మములవల్ల ఆత్మలు ఉత్తరించు స్తలములో అనుభవించు వేదనలు తగ్గిపోను ముగింపుకాను చేయుటకు, జీవించియుండే మనకు శక్యమును అప్పనైయున్నది. ఆలాగు అపోస్తుల కాలమునుండి ఇప్పటి వరకు తిరుసభలో వాసులైన వేదపారగులందరును బోధించుకొని వచ్చునదిగాక, సత్యముతప్పని తిరుసభయొక్క కోరికయునై యున్నది. కాబట్టి మనమును చచ్చినవారలమీాద స్మరణయుంచి వారల వేదన తగ్గునట్టు మన చేతనయినమట్టుకు ప్రయాస పడవలయుననుట నిశ్చయము.

గురువులందరు ప్రతిదినముచేయు దివ్యపూజలో చచ్చిన వారలకొరకు విశేషవిధముగా వేడుకొనేదిగాక [illegible] జపించు జపములన్నిటిలోనును (విశ్వాసులయొక్క ఆత్మలు సర్వేశ్వరుని కృపచేత సమాధానమునందు విశ్రమించుమగాక) యని జపించుకొని వచ్చుచున్నారు. భక్తిగల క్రీస్తువులు సహుస్తులును తమకు సంబంధమైనవారల ఆత్మల నెప్పుడును తలంచు

నదిగాక, ఉత్తరించు సకల ఆత్మలను గురించి సోమవారము లన్నిటియందును కొన్ని జపములను ధర్మములను ఒక్కప్రొద్దు లను చేయుచు వచ్చుచున్నారు. మరియు మే నెల దేవమాత కును, మార్చి నెల అర్చ్య. జోజప్పగారికిని, జూన్ నెల జేసునా థుని దివ్యహృదయమునకును ఒప్పగించి, ఆ నెలలలో వార లకు విశేష వందనారాధనలను సమర్పించి వేసుకొని వచ్చు లాగుననే, నవంబరునెలను ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించి ఈ నెలలోవచ్చు ముప్పది దినములలో ఆత్మలకొరకు వేసుకొని కొన్ని విశేష జపములను సత్క్రియలను చేసుకొని రావ డము తిరుసభలో వాడుకైన సుకృత ధర్మమగును. భక్తి యును శక్తియును నిండిన ఈ శ్రేష్ఠ పుణ్యమును తెనుగు జను లలో వ్యాపింప జేయుటకుగానును, అందుచేత లభించు జ్ఞాన ప్రయోజనములను ఈ దేశస్తులు పొందు లాగునను, "ఉత్తరించు ఆత్మల స్మరణమాసము" అన బడు ఈ చిన్న పుస్తకమును వ్రాసియున్నాము. దీనిలో ఉత్తరించు స్థలము నుగురించి ఎరుగవలసినవానినన్నిటినిచూపించేదిగాక, ఆత్మలకు ఉదవి సహాయముచేయవలసిన విశేష మార్గోపాయములనును వివరించి చూపుదుము. మరియు ఫలముగల కొన్ని జప ములను, ఆయా దినములయందు చేయవలసిన సత్క్రియలను, ఆయా దినము అడుగడుగుకు చెప్పవలసిన సుకృత జపములను ఒకొక తేదికి తగినట్టు క్రమపరచి యున్నాము. క్రీస్తుప్ర లారా! చూపించే క్రమప్రకారము యావత్తు నెరవేర్చితిరేని ఉత్తరించు ఆత్మలకు మహా యూరట కలుగుటయేగాక, మీా కనేక ఆత్మమేలులును శరీర మేలులును శిద్ధించుననుటకు సందేహము లేదు.

ఈ నవంబరు నెల పై చెప్పిన సుకృత పుణ్యములను నెరవేర్చ విధింపబడిన మాసముగా నుండినప్పటికిని వాటిని వేరే దినములందుకూడ ఇష్టమున్నవారలు అనుసరించుకొని రావచ్చును. ఈ నెలయందు అందరుకూడి గుడియందు పొత్తుగా జపించునది ఉత్తమమైనను దానిని వేరే ప్రత్యేకముగా పుస్తకమునకందు చదివి చేయవచ్చును. అయితే కూటములో చేయబడు జపప్రార్థన అధిక ఫలముగనుక, కూడినమట్టుకు ఈ నెలయందు పొత్తు జపము చేయవలసినది. మరిన్ని ఆత్మలనుగురించి నవదినజపములను చేయవలసినదిగానుండినట్టయితే ఈ పుస్తకముయొక్క మొదటిపదిదినములనయినను, లేక 11వ దినమునుండి ఇరువదియవ దినమువరకును, లేక 21వ దినము నుండి ముప్పదియవ దినమువరకు యుండు జపములను ధ్యానములను జపించుకొనవచ్చును.

కడసారి ఉత్తరించు ఆత్మలమీద మీ భక్తి తగ్గక అధికాధికముగా జ్వలించునట్టు అనుగడుగుకు ఈచిన్న పుస్తకమునుండి ఏప్రక్కనయినను కొంచెము చదువుకొనవచ్చును. అదియునుగాక ఈ చిన్న పుస్తకమునుండి మీకేదొక ప్రయోజనము లభించునేని మా యాత్మము ఉత్తరించు స్థలములో నుండునపుడు మాకొరకును వేడుకొనుదురని నమ్ముచున్నాము.



# ఉత్తరించు ఆత్మల స్మరణ మాసము.

---

## మొదటి దినము.

సకలమోక్షవాసులును, ఉత్తరించుస్థల ఆత్మలును, ఈ భూలోకములో గల క్రీస్తుప్రజలును ఒకేసభకు చేరినవారలని చూపించే వర్తమానము.

---

## ప్రసంగము.

సకల లోకములను సృష్టించి రక్షించి లయముచేయ వల్లభముగల దేవుడుగానున్న జేసు క్రీస్తునాథుడు తమకు జ్ఞాన శరీరమైన ఏర్చ్యశిష్ట తిరుసభను కలిగించిరి. ఆ తిరుసభను వారే ఏలినడిపించి అలంకరించి మోక్షపేరింప రాజ్యములో తమతో నేకీభవించియుండు నంతవరకు దానిని చక్కపరచుకొని వచ్చుచున్నారు. స్వామికి శరీరముగాను పత్నిగాను ఉన్న ఆ తిరుసభ ఈ లోకమందు నిలిచియుండు తిరుసభ మాత్రమే కాదు.

యనిన్ని, యుద్ధసభయనిన్ని చెప్పినప్పటికి మూడు సభలు కావు, ఒక సభయే.

ఈ లోకములోగల యుద్ధసభ, తనకు పుణ్యఫలములను మోక్షస్వతంత్రమును నిత్య ప్రతాపమునకు ప్రాప్తిని పొందనదిగాక, పరలోక వాసులను పొగడి స్తుతించి మహిమపరచు, ఉత్తరించుసభలో ఉపద్రవ మనుభవించు వారల నిమిత్తము ప్రార్థించును. వారలకు ఉపకార సహాయము చేయును, వారలను పరమ గృహమునకు చేర్చుకొనును.

ఉత్తరించు సభయోయంటే, తనకు తాను సమేలును చేసుకొనకూడక, తనకు ఉపకారసహాయము చేయు యుద్ధసభకు పలినవారియొక్క అనుగ్రహము తాను ప్రార్థించును. ఒడ్డోలగ సభలో ప్రవేశింప ఆశించి దేవచిత్తమునకు లోనై సిద్ధీకరించబడును. మోక్షమునందు వర్థిలు ఒడ్డోలగసభ, యుద్ధసభ వారలను దయతో చూచి ఎడతెగక పలినవారిని ప్రార్థించి అందుకుకావలసిన దేవవరములను వర్షింపజేయును, యుద్ధము చేయువారిలను ప్రేరేపించి మాయొద్దకు రండని మోక్షానందమును వారలకు చూపించు ఉత్తరించు సభకు సహాయముగా నిప్పునుచల్లార్చు ధర్మములను, పరిహారము చెల్లించు తపకృత్యములను, కట్లను విడజేయు జపములను, సకల వేదనలను అరచేయు దివ్యపూజలను నడిపించచేయును.

కడసారి ఈ సభవారలందరును మోక్షములోకూడి స్వామితో నేకీభవించి మాటలయందును తలంపునందును అణగని సకలమైన పేరింప భాగ్యములను అనుభవించి సర్వేశ్వరుని పొగడి స్నేహించి స్తుతించి పొగుడుదురు, వర్థిలుదురు.

క్రీస్తువులారా, ఈనెల ఆరంభములో సకలమోక్షవాసులయొక్క పండుగ కొనియాడబడుటచేత, మోక్షమును తలంచి అక్కడికి చేరేటందుకు ప్రయాసపడుదుమని గట్టిగా తీర్మానముచేయగలవారలు. అయితే అచటికి సులభముగా చేరునది మహాకష్టముగనుక, నరాసరికి అందరును ఉత్తరించు స్థలమూలముగా కడతేరవలయుననుటకు సందేహము లేదు. అందుచేత ఈనెలయావత్తు ఉత్తరించుస్థల ఆత్మలనుగురించి కొన్ని జపములను ధ్యానములనుచేసి వారలకు ఉపకారసహాయమును తప్పించ ప్రయాసపడుదుముగాక.

సకల మోక్షవాసులకు స్తోత్రముగా 3. జ్యోతిశ్చక్ర 3. ప్రియదత్త...3-త్రీత్వస్తోత్రములను చెప్పుట.

---

# మొదటి తేది.



## చావుకు పిమ్మట మూడుస్థలములు గలవని చూపించే సాధారణవివరము.

## ధ్యానము.



మనుష్యులందరు చనిపోవునది నిశ్చయము. ఒక్కొకడు ఒకసారిమాత్రమే చచ్చిపోవునుగాని రెండుమూడుసారులు చచ్చిపొయ్యేది లేదు. చావుకు పిమ్మట ప్రత్యేకతీర్పు జరుగుట నిశ్చయమైనందున ఈతీర్పుకు తప్పించుకునే విధము ఎరుగము.

పాపాత్ములమీద బహు కనికరముగానున్న పెద్దిరందూసను వారు వారలకు మంచిబుద్ధివచ్చేటట్టు ప్రతిదినము దివ్యపూజ చేసి జపములను జపించి కఠిన తపక్రియలను నడ పించుకొని అదే యుత్తమ పుణ్యమని ఒప్పించేటట్టు వారు చూపించు న్యాయము లేవనిన :-" ఈ పాపాత్ములు నరకములో పడ ఎప్పుడును సిద్ధపడియున్నారుగదా ? ఈ ఆత్మలను చెడగొట్ట పిశాచులు పలువిధ తంత్రోపాయములను శోధన యుద్ధములను చేయుచున్నవని తెలియదా ? ఈ ఆత్మలను రక్షించ సుతుడైన సర్వేశ్వరుడు మోక్షమునుండి దిగి మనుష్యుడై పుట్టి పడరాని పాట్లుపడి శిలువలో కొట్టబడి కఠినమరణముపొంది తమ దివ్యరక్తమంతా చిందినారుగదా ? జేసునాథస్వామి అంతగా ఆశించిన ఆత్మలను చెడ విడచునదే గొప్ప నిర్భాగ్యముగాక దివ్యరక్షకుడు చిందిన వెలలేని దివ్యరక్తఫలములను వ్యర్థముచేయునది దేవద్రోహమని కనుపడడము లేదా ? ఉత్తరించు ఆత్మలోయనగా: వారలు ఉత్తరించుస్థలములో మిగుల కష్టమనుభవించునది నిజమే. అయితే వారల రక్షణ్యము నిశ్చయముగనుక, వారలు నరకమునకు పోదగిన అపాయకరమైన అంతస్తులో నుండడము లేదు. వారలు సర్వేశ్వరునికి ప్రియముగల ఆత్మలుగనుక వారల అప్పుతీరినపోడనే ఎట్లాయినను వారలు మోక్షపేరింపము నొందుటతప్పదు. పాపాత్ములోయనిన, వారలు తమ పాపములను విడువకుండిరేని ఆరని అఘోరనరకమునకు పోవుటతప్పదు. ఇట్లుండగా ఈపాపాత్ములు మనసుతిరుగ ప్రయాసపడునదే ఉత్తరించు ఆత్మల నిమిత్తము చేసుకొనుదానికంటె ఉత్తమపుణ్యము, అని పెద్దిరం దూసను వారు సాధించిచెప్పిరి.

అందుకు ఆశీర్వాదప్పయనే సన్యాసి చెప్పినది. " మీరి పుడు వివరించిన న్యాయముల ప్రకారము పాపాత్ములు మనసు తిరుగునటుల ప్రార్థించునది మంచిపుణ్యముగానుండినను ఉత్త రించు ఆత్మలనిమిత్తము ప్రయాస పడునది అధికమేలని నేను నిశ్చయించుచున్నాను. ఏలాగనగా కష్టపడుచున్న ఇద్దరు బిచ్చ గాండ్లుకలరు. ఒకనికి మంచి సౌఖ్యము బలము కలిగియుండిన ను వాడు ఎక్కువ సోమరితనముచేత ఏపనిచేయుటకును బిచ్చ మెత్తుకొనుటకును యిష్టములేక ఊరిక పడియుండెను. మరి యొకనికి వ్యాధిచేత కాళ్ళుఎండి చేతులువంగక సర్వాంగము లును నొచ్చి మిగుల బాధపడుచున్నాడు. అయితే ఈ యిద్ద రిలో ఎవనికి మనముధర్మముచేయ తగియుండును ? తన తప్పి తము లేక సరిగాపనిచేయ శక్తిలేనివానికి మాత్రమే ధర్మముచే యునది యుత్తమముగదా ? అట్లయితే పాపాత్ములు కావల యునని తమ దుర్బుద్ధివలన చెడిపోవడమేగాక స్వమనసుయుం డినట్టయితే కడతేరవచ్చునే. ఉత్తరించు ఆత్మలోయనగా,తమం తటతాము ఏదొక సహాయముచేసుకొనకూడక కష్టపడుచు న్నారుగదా ? మరియు రాజుకు గొప్పద్రోహముచేసిన వాడొ కడుండెను; మరియొకడు రాజుకుప్రియముగల స్నేహితుడుగా నుండెను. రాజుయొక్క దయపొందుటకు ద్రోహికా స్నేహి తునికా ఎవరికి మనము సహాయముచేయ వలసినది ? ఏదిమం చిది ? స్నేహితునికి సహాయముచేయవలయునని అందరు చెప్పు దురుగదా ? అట్లయితే దుర్మార్గపాపిష్టులకు సహాయముచే యుటదానికంటె, సర్వేశ్వరునికి తగ్గ స్నేహితులైన ఉత్తరించు ఆత్మలకు సహాయముచేయునది యుత్తమమని సందేహపడ స్థలముగలదా? "అని ఆశీర్వాదప్పయనెడు సన్యాసి వివరించిరి.

అయితే పెర్దిరందూస్ సన్యాసి ఈన్యాయములకు ఒప్పకపో యిరి. నాటిదినము రాత్రి వారు నడుజామున లేచి తమ సభ వారుక ప్రకారము దేవసంగీతములనుపాడ గుడికి పోవునప్పుడు ఉత్తరించుస్థల ఆత్మయొకటి దేవచిత్తముచేత వచ్చి తమకు కనుపడుటను చూచిరి. ఈ ఆత్మము మోయలేని ఒక భారమైనమోపును మోసుకొనియున్న విధముగా అలసిసొలసి మిగు లకష్టపడి ఈ సన్యాసుల దగ్గరకు వచ్చి ఈ కఠిన భారమైన మోపును ముందుచెప్పబడిన పెర్దిరందూసు సన్యాసి భుజము మీాద దింపినది. ఈ సన్యాసిగారు దానినిమోయలేక క్రింద పడి అధిక కష్టముచేత ప్రాణ అవస్తగాపడి, ఇదియంతా దేవ చిత్తముచేత సంభవించినదని కనిపట్టి, ఇకమీాదట ఉత్తరించు ఆత్మలకొరకు ఎప్పుడును ప్రయాసపడుదునని ప్రార్థించుకొనిరి. అప్పుడు కనుపడిన ఆత్మము మరుగై పోయినది. వారోయనిన తెల్లవారి ప్రాతఃకాలము దివ్యపూజను ఆత్మలకొరుకు చేసినది గాక, తమజీవిత కాలమంతా తాముచేసిన జప తప దాన ధర్మక్రియలన్నిటిని ఆ యాత్మలకు ఒప్పగించుకొని వచ్చిరి.

ఈ అద్భుతమును వినిన క్రీస్తువులారా, పాపాత్ములు మనసు తిరుగునటుల వేడుకొనునది అల్పపుణ్యమనిన్ని ఉత్తరించు ఆత్మలకొరకు వేడుకొనునది గొప్పపుణ్యమనిన్ని మీారు తలంచవద్దు. అయితే ఆలాగు వారలకొరకు ప్రయాసపడునది మేలును విధియును దేవచిత్తమునై యుండినను, ఉత్తరించు ఆత్మలను ఒకనాటికిని మరువక వారల కష్టమునుతగ్గించ ప్రయా సపడునది గొప్ప ధర్మమును ప్రయోజనముగల విధిన్ని, సర్వే శ్వరునికి ప్రియమైన సత్కృత్యమనిన్ని ఎరుగగలవారలు.

మృతిపొందిన విస్వాసుల ఆత్మసమిత్తము జేసుక్రీస్తు

నాధుని అయిదు గాయములను తలంచి 5 జ్యో. 5 ప్రియ 5 త్రీత్వస్తోత్రములను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము ఎలుగెత్తి పిలుచు చున్నాను. అనేమంత్రమును చెప్పుట.

* నిత్యపితా, జేసుక్రీస్తునాధుని వెలలేని తిరురక్త ఫలము లనుచూచి ఉత్తరించు ఆత్మలమీద దయగానుండండి. [ఈలాగు 3 సార్లుచెప్పేది]

వివరము :—ఈ జపములను చెప్పేవారలకు ప్రతిది నము 300 దినముల ఫలమున్ను, వీటిని ఒక నెల పూర్ణముగా చెప్పువారలకు ఒకపరిపూర్ణ ఫలమును 7 వ—భక్తినాధు లను అర్చ్య—పాపుగారు 1817 సం॥ లో కట్టడచేసియున్నారు.

---

# 2-వ వేది.

## ఉత్తరించుస్థలముకలదని సకలజాతిజనులు ఒప్పుకొనిన సత్యవిశేషమూను.

---

## ధ్యానము.

మనసు తిరుగని కఠినచిత్తులైన పాపాత్ములకు నిత్యనర కమును, పూర్ణపరిశుద్ధులకు ముగింపులేని మోక్షముగాక, ఉత్తరించవలసిన ఆత్మలకు ఒక మధ్యస్థలమున్ను గలదని ఏకా లమునందును ఏదేశమునందునుగల జాతిజనులందరును విశ్వసిం చి నమ్మి ఒప్పుకొనినారనుటకు సందేహాము లేదు. ఈస్థలము లో ఉత్తరింపునిమిత్తముగా నిలుచు ఆత్మలు మిగుల వేదనలను

అనుభవించడమేగాని, మనుష్యులు వారలకొరకు ప్రార్థించి చేసిన జప తప దానధర్మములవల్లను చెల్లించిన బలులవల్లను ఈ వేదనలు తగ్గి నివారణమగుననియెంచి, వీటినన్నిటిని మహా ఆపేక్షతో నెరవేర్చుకొని వచ్చుచున్నారు. జేసునాథస్వామి ఈలోకమును రక్షించవచ్చుటకు ముందుండిన పేరుపోయిన అశ్శీర్యులును, పేర్శియులును, ఎజిప్తులును, గ్రేశియులును, రోమనులును చచ్చినవారలనుగురించి అనేక సాంగ్యములనును వేడుదలలను బలులనును చెల్లించుకొని వచ్చినారని వారల దేశ ఆచారమత గ్రంథములలో వివరముగా కనుపడుచున్నది. మరి యు పూర్వీక కాలమునుండి ఈదినమువరకు అజ్ఞానులుగానుం డు చీనాదేశస్తులయొద్ద ఇప్పుడును ఇటువంటి ఆచారము నడ చుచున్నది. చనిపోయిన తమ తండ్రి తాతముత్తాతలను గురిం చి విశేషభక్తి పట్టుదలతో కొన్ని ఉత్సవదివసములను కొని యాడి పలుపూజ బలిసాంగ్యములను నడిపించుకొని వచ్చుచు న్నారనుట అందరికి తెలిసినవిషయమగును. మనమున్న ఈ హిందూదేశములో సహితము అజ్ఞానులుగానున్న పలుమ తస్తులైన జనులు చచ్చిన తమవారల ఆత్మలనుగురించి మోక్ష దీపమనెడు సాంగ్యమును, అమావాస్య ఒక్క ప్రొద్దు, సూద కము, పక్షక్షౌరము ఇంకా పలు ఆచారములను నెరవేర్చు చున్నారని మీకు బాగా తెలియును. చచ్చిపోయిన వారలకొ రకు పీరుల పండుగ తద్దినములయందు అన్నదానము, పూజ, బలి, నానావిధ ఆచారసాంగ్యములను ముందుచెప్పిన జాతిజను లందరు ఎందుచేత అనుష్ఠించుకొని వచ్చుచున్నారనగా కట్టు కొనిన పాపములకు దండన అనుభవించు ఆత్మల ప్రాయశ్చి త్తముతీరి మోక్షదరిచేరులాగు ఈ ఆచారములకు అజ్ఞానిజనుల

అభిప్రాయ ముండునుగాని వేరేముఖాంతరము కనుపడడము లేదు.

మరియు జేసుక్రీస్తునాధునికిముందే సత్యదేవుని ఎరిగి ఆరాధించుకొని వచ్చిన యూదులుచనిపోయిన వారలఆత్మలు తమతప్పులనుండి రక్షింపబడి మోక్షప్రాప్తిపొందునట్లు జప ధర్మ పూజబలులవల్ల ప్రయాసపడినారని సత్యవేద పుస్తకములవల్ల తెలుసుకొనవచ్చును. దానిని దృష్టాంతపరిచే వర్తమానమేదనిన: మహాపరాక్రమ శూరులైన యూదా మఖబేయులదినములలో కొంతమంది యుద్ధభటులు సత్యవేదమును గురించి చేయుయుద్ధకలహములలో పడిచచ్చిరి. వారలప్రేతములను మహాపూజ్యముతో సమాధిచేసి వారల ఆత్మల నిమిత్తము అందరును వేడుకొనినదిగాక వారలసేనానాయకులుగానున్న యూదామఖబేయనువారు జనులలో విస్తారమైనరూకలు వసూలుచేసి 12000 వెండికాసులను జెరుసలేం పట్టణములోనున్న దేవాలయమునకు పంపించి, చచ్చినవారల పాపములకు పరిహారముగా పూజనైవేద్యములను ఒప్పగించచేసిరి. కాబట్టి చచ్చినవారలు తమపాపములలోనుండి రక్షించబడునట్లు వారలనిమిత్తము వేడుకొనునది. మేలున్నప్రయోజనమునుగల కార్యమని మఖబేయుల రెండవఆగమములో సత్యముగా వ్రాసియున్నది. ఈ కాలములో సహితము జేసుక్రీస్తునాధుని విశ్వసించని యూదులు ఉత్తరించుస్థలము గలదని విశ్వసించి చచ్చినవారల ఆత్మనిమిత్తము కొన్నిసాంగ్యములను నెరవేర్చుకొని వచ్చుచున్నారు.

అదిన్నిగాక పూర్వీక తిరుసభ మొదలుకొని ఈ దినము వరకు సకలక్రీస్తువులు చచ్చిన వారల ఆత్మలు ఉత్తరించుస్థల

ములో అనుభవించు వేదనలు తగ్గునట్లు జప తప దాన ధర్మ ములనును దివ్యపూజలనును ఒప్పగించుకొనివచ్చునది నిశ్చయము. ఆయాకాలములలో పిశాచిశోధనచేత అనేకులు సత్యసభనువిడిచి ఎడబాసి ఆర్యానితులనియు, నెస్తోరియానితులనియు, గ్రేకులనియు, మోన్‌గోపితులనియు, పలుపతితులుగా పోయియున్నప్పటికి వారలందరును చనిపోయినవారల కొరకు వేడుకొని మనవలెనె జపముచేయుచు వచ్చుచున్నారు. హిందూదేశమందుగల మళయాళదేశములో అనేకజనులు నెస్తోరియానితులను పతితులుగా నుండినప్పటికి వారలలో సహితము ఆలాగే నడచి వచ్చుచున్నదని సమస్తులు తెలుసుకొనవచ్చును.

ఇప్పుడు చెప్పిన విశేషములన్నిటిని వినిన క్రీస్తువులారా! చేయవలసిన యోచన ఏదనగా, సకలజాతిజనులు ఏకాలమునందును ఏదేశమునందును విశ్వసించి అనుసరించిన తప్పని సత్యముగనుక, నరకము మోక్షముగాక మధ్యస్థలమైన ఉత్తరించుస్థలమును కలదని దానిలో ఉత్తరించు ఆత్మలకు మన సత్కృత్యములచేత ఆదుదలరప్పించకూడునని ఒప్పుకొనవలయునే గాని వేరుకాదు. అట్లుండగా జేసునాధుడు స్థాపించిన సత్యవేదమును చెడగొట్ట మున్నూరు సంవత్సరములకుముందు మొలకెత్తిన ప్రోటెస్టాంటులను పతితులుమాత్రమే ఏముఖాంతరముచేతనో ముందు చెప్పిన సత్యమును త్రోసివేసి విరోధించుటయేగాక ఉత్తరించుఆత్మలమీద కొంచెమైనను కనికరము లేనివారలై యుంటున్నారుగదా? క్రీస్తువులారా, వీరలు చెప్పు అబద్ధములకు చెవియివ్వక ఉత్తరించు ఆత్మలకు మీచేతనైన మట్టుకు సహాయముగా నుండవలయునని ఎరుగగలవారలు.

ఈదినము అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసువా ! మామీాద దయగానుండండి (100 దిన. ఫలము)

## జ ప ము .

సకల విశ్వాసుల సృష్టకుడును రక్షకుడునైన సర్వేశ్వరా ! మృతిపొందిన మీాదాసుల ఆత్మలకొరకు చేయబడెడు భక్తిగల మా ప్రార్థనలను అంగీకరించి వారలు మిగుల ఆపేక్షతో కోరెడు పాప ఓర్పును దయతో కరుణించవలయునని మిమ్ము ప్రార్థించుచున్నాము. సదాకాలము జీవితులైయుండెడు సర్వేశ్వరా ! ఈ మనివిని దయతో చేకొనండిస్వామీా ఆమెన్ జేసు.

ఈ దినము చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలను గురించి ఒక పూజ చేపించుట, లేక పూజ చూచుట.

## అ ద్భు త ము .

ఉత్తరించు స్థలములో వేదన అనుభవించు ఆత్మలు కొన్ని సమయములలో మనుష్యులకు కనిపించినవియనియు, తామనుభవించు వేదనల ఘోరమును చూపించినవియనియు, తమకు ఊరటగా జపములనును, ధర్మములనును, పూజలనును చేయ అడిగినవియనియు అనేక గొప్ప శాస్త్రులు నిశ్చయముగా వ్రాసిపెట్టిరి. అలాగే పూర్వీక తిరుసభలో వేదసాక్షియైన అర్స్య పెర్పేత్తువమ్మ తనతమ్ముడైన దినోక్కిరాత్తనువారియొక్క ఆత్మము ఉత్తరించుస్థలములో కష్టపడుటనును, పిమ్మట

దానినుండి విడుదలపొంది మోక్షమునకు పోవుటను కనిన దని మహాశాస్త్రియైన అర్చ్యశ్. అగుస్తీనుస్ వ్రాసిపెట్టెను.

జేసునాధస్వామి జన్మించిన 500 సంవత్సరములకు పిమ్మట అయిర్లాండుదేశములో హెచ్చైన గోత్రమునందు అర్చ్యశ్. ఈదవమ్మ ప్రఖ్యాతివహించి యుండినది. ఆమె చిన్న ప్రాయమునందే నానావిధపుణ్యములను అనుసరించినందుచేత సర్వేశ్వరుడు ఆమెకనేక సుకృతవరములను దయచేయుచిత్తమైరి. తమ కావలియైన సన్మనస్కును అనుగడుగుకు దర్శించి వారితో సంభాషించును. విస్తారమైన అద్భుతములనుచేసి అతిశయమైన దర్శనములను కనును. ఆమెయొకనాడు ధ్యానమందుండునపుడు, కొద్దిరోజులకుముందు మరణముపొందిన, తమ పెదతండ్రియొక్క ఆత్మము ఉత్తరించుస్థలములో అఘోరముగా బాధపడుటను చూచినది. ఆలస్యములేకుండా ఈయనయొక్క ఎనిమిదిమంది బిడ్డలను రప్పించి తాను చూచినదానిని వారలకెరిగించి "అయ్యో! మీతండ్రి ఈసమయములో అంత వేదన అనుభవించుచున్నాడే, ఆయనకు ఆదరుదలరప్పించ మన మందరమును ప్రయాసపడవలసినదే కదా ? నేను రాత్రిపగలు ఎడతెగకుండా ఆయననిమిత్తము ప్రార్థించి తపసుచేయుదును. మీరును ఆయననుగురించి విస్తార దానధర్మములనుచేసి ఆకలిగొనినవారలకు అన్నముపెట్టి, గుడిలో మైనపు వత్తులను వెలిగించి, ఒక సంవత్సరముయావత్తు దివ్యపూజ ఒప్పగించ చేయుదురుగాక, అనినది.

ఈ ఎనిమిదిమంది బిడ్డలును అర్చ్యశ్. ఈదవమ్మ కట్టడచేసినదానినంతయు చక్కగా నెరవేర్చిరి. మరుసంవత్సరము రాగానే ఆమె తనపెదతండ్రియొక్క ఆత్మనుగని వీరలకు ఎరిగించిన

దేమనిన, "మీరు చేసిన ధర్మములవల్లను నేను ఒప్పగించిన జపములవలను మీతండ్రిగారికి నియమించ బడిన కష్టములలో సగము తగ్గిపోయినది. అయితే ఇంకా ఒకసంవత్సరమువరకు ఈయన ఆత్మకొరకు ప్రయాసపడుదముగాక" అనినది.

ఈలాగు ఆమె జపములను తపక్రియలను, వీరలు దానధర్మములను చేసిరి. ఈ రెండవసంవత్సరము కడపట ఆమె వీరలకు చెప్పిన దేమనిన, మీతండ్రిగారి ఉత్తరింపు తీరినదనుట నిజమే. అయితే ఆయన జీవించియున్నపుడు ఈలోకమేలులను అధికఆపేక్షతో వెదకి తిరిగినదిన్ని, దరిద్రులకు వస్త్రము ఈయకుండిన దానినిగురించి ఆయన ఇంకామోక్షపేరింప మహిమను పొందలేదు. కాబట్టి ఆయననుగురించి ఇంకా ఒక సంవత్సరమువరకు ప్రయాసపడవలసినదిగాక, వస్త్రములు లేని వారలకు వస్త్రములిచ్చుచు రాగలవారలని చెప్పినది. ఈబిడ్డలు దీనినిని కొరతలేక నెరవేర్చిన పిమ్మట, వీరలతండ్రి చనిపోయిన మూడవసంవత్సరము కడపటిదినములో, ఈయనయొక్క ఆత్మము మహాప్రతాపముతో మోక్షపేరింప గృహమునకు ప్రవేసించుటను అర్చ్యం. ఈదవమ్మచూచి ఈసంగతిని వారలకు ఎరిగించి "సహోదరులారా! మీతండ్రిగారికి ప్రాప్తించిన కఠిన నిర్భాగ్యమును తలంచి ఆయన ఈలోకములోని స్థిరము గానిమేలులను అధికపట్టుదలతో వెదకినలాగు మీరును వెదకవద్దు." అని ఆగొప్ప అర్చ్యశిష్టురాలు వచనించినది.

క్రీస్తువులారా! ఇప్పుడు చెప్పిన అద్భుతములో మూడు విశేషములను చక్కగా నెరుగవలసినది. 1 ది వెయ్యిన్ని నాలుగువందల సంవత్సరములకుముందు ఉత్తరించు ఆత్మలనుగురించి జపములను తపక్రియలను దానధర్మములను చేయను, గుళ్ళలో

దీపము మైనపువత్తులను వెలిగించను, దివ్యపూజలను చేయిం చను, తిరుసభలో వాడుక కలిగియుండునపుడు, ఈ ఆత్మలను గురించి వేడుకొనునది క్రొత్త వాడుకయని ప్రోటెస్టాంటులనెడు పతితులు చెప్పునపుడు ఇది వారలు కక్కుడు పదివేల అబద్ధ ములలో నిదియు నొక గొప్ప అబద్ధమును తప్పితముగాను ఉన్నదిగదా?

2 ది—ముందు చెప్పిన మనుష్యునియొక్క ఆత్మము అను భవించు వేదనలను ముగియచేసి ఆయాత్మము మోక్షమునకు చేర మూడుసంవత్సరములవరకు అన్ని జపములను ధర్మముల ను పూజలను జరిపించినారని ఎరిగి, మీూవారల ఆత్మలనుగురిం చి కొంచెము జపము కొంచెము ధర్మముచేసి ఒకటి రెండు పూజలను చేయించేది చాలదని కనిపట్టండి.

3 ది—ఈలోక సుఖమేలులన్ని శాశ్వతములేనందుచేత, వీటిని అధిక ఆపేక్షతో వెదకడమే గొప్ప పిచ్చితనముగా నుం డడముగాక అందుచేత ఉత్తరించుస్థలములో వేదన అనుభవిం చుటకు కారణముగా నుండునని ఎరుగుదురుగాక.

5 జ్యో 5 ప్రియ 5 త్రిత్వస్తోత్రములను చెప్పుట.

స్వామీా పాతాళమునుండిమిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాదుని...

---

# 3 వ తేది.

## ఉత్తరించుస్థలము కలదనుట సత్యతిరు సభయొక్క మూరని విశ్వాసము.

# ధ్యానము.

జేసుక్రీస్తునాధస్వామి ఈలోకమునకు వేంచేసివచ్చుట కుముందే వ్రాయబడిన పూర్వవేదపుస్తకములవల్లను, దివ్యరక్షకుడు వచనించిన వాక్యములవల్లను, వారిస్థానాధిపతులుగానున్న అపోస్తుల నిరూపములవల్లను, వేదపారగులందరును ఉత్తరించుస్థలముగలదని దృష్టాంతముగా ఒప్పించుకొని వచ్చుటచేత, వీరలు చెప్పుపరమన్యాయములను ఇచ్చుట పూర్ణముగా వివరించ తావు లేనందుచేత, దుష్టపతితులను నోరుమూయించుటకు ఈ న్యాయములను ఎరుగవలసినట్టయితే వీటిని వేదవిశక్షణము, జ్ఞానసంజీవి, పతితప్రోటెస్టాంటు మతఖండనము ఈ మొదలగుపుస్తకములలో చదివి కనుగొనవచ్చును.

మరియు సత్యవేదము అంతటను బోధించి స్థాపించిన అపోస్తుల నాటినుండి నేటివరకు, ఉత్తరించుస్థలములో కష్టపడువారల ఆత్మనిమిత్తము జపవేదుదలలనును, పూజబలులనును చేయు సుకృతవాడుక, పారంపర్యవిధముగా జరిగివచ్చుటగాక, ఆయాకాలములలో ప్రకాశించిన వేదపారగులును గ్రంధకర్తలును దైవికశాస్త్రిలును ఈ విధిని సుముద్రముగా అనుసరించవలయునని కల్పించుకొని వచ్చినారనుటకు కొంచెమైనను సందేహము లేదు. అర్చ్య. రాయప్పగారికి శిష్యుడుగానుండిన అర్చ్య. క్లెమెంతను పాపుగారు ప్రసిద్ధపరచిన అపోస్తొలిక్ కట్టడల ఎనిమిదవ అధ్యాయములో చెప్పియుండునదేమనిన. "సర్వేశ్వరుని సమాధానమునందు మృతిపొందినమన సహోదరుల ఆత్మలకు ఏలినవారుదయచేసి, వారల పాపములను మన్నించి, వారలను పితాపిత్రుడైన అబ్రహాము వద్ది

ర్థమైన మోక్షములో చేర్చుకొనునట్లు వేడుకొనుచుముగాక "
అని చెప్పినపిమ్మట వారలనుగురించి ఒక సొంపైన జపమును
వ్రాసిపెట్టిరి.

నూట ఏబదియవ సంవత్సరములో, మహా శాస్త్రి
యైన ఒర్జేన్ అనువారు వ్రాసినదేమనిన. " ఈలోకయుద్ధము
నుండి మరులోకమునకు పోవువాడు ఉత్తరించవలసి యుండుట
చేత, చచ్చినవారల కొరకు వేడుకొనునది విధిన్ని ప్రయోజ
నముగల కృత్యమనిరి "

మున్నూట ఏబదియవ సంవత్సరములో మహా శాస్త్రి
గాను ఆర్మేనియాదేశములో సత్యవేదదీపముగాను ప్రకాశిం
చిన అర్చ్య. ఎబిరేయనువారు చావబోవు సమయమున, దగ్గి
రయుండిన తమ శిష్యులనుచూచి. " నాప్రియ బిడ్డలారా !
చావబోవు ఓూ తండ్రియైన నాకు కడపటి ఉపశాంతి చేయ
రాండి. నా శరీరమునకు పరిమళములు పూయవద్దు; అయితే
నేను సర్వేశ్వరునియొద్ద కృపపొందుటకు దేవసంగీతములను
పాడి, కన్నీళ్లురాల్చి నాయాత్మకొరకు వేడుకొవండి. ఇకమీ
దట గుడిలో మీరందరు కూడినపుడు ఎప్పటికిని నన్నుమరు
వక నా నిమిత్తము ప్రార్థించండి " అనిరి.

అర్చ్య. అమ్బ్రుతనాథులోయనిన. " నాకు కుమారు
డును ఏలికయునైన తేయోదోసియూసు రాయునియొక్క
ఆత్మను మోక్షములో ప్రవేశింపచేయువరకు నా జపములను
ఏడ్పులను తపకృత్యములను విడుచుటలేదనిరి "

తమతల్లియైన అర్చ్య. మోనికమ్మ చనిపోయిన పిమ్మట,
అర్చ్య. అగుస్తీన్ వ్రాసిన సుకృతవాక్యమేమనిన. "నాకు
మహిమయును జీవముగానున్న సర్వేశ్వరా ! ఇప్పుడు నాతల్లి

యొక్క పుణ్యములను మీయొద్ద వివరించి మాట్లాడక, ఆమె పాపముల నిమిత్తము మిమ్ము ప్రార్థించుచున్నాను. ఆమెమీద దయగా నుండండి, దయగానుండండి స్వామీ. ఆమెకు కఠిన తీర్పు విధించకండికర్తా, ఆమె చనిపోవు సమయములో తన శరీరమును తలంచలేదు. దానికిమహిమగల స్థాపితము అడుగు కొనను లేదు. అని తలంచ నవధరించండి. దివ్యపూజలో పాపములను పోగొట్ట బలి ఒప్పగించ బడుటనుయెరిగి, ఆ దివ్య పూజలో తనను తలచవలయునని మాత్రమే అడిగినది. అందు వలన నా యేలినవారైన సర్వేశ్వరా? ఇప్పుడు నేను వ్రాసి నవాటిని చదువబోవువారలయిన మీ యాజ్రిగస్తులును నా సహోదరులునగు సమస్తులును మీ దాసిరాలగు మోనికా యనెడు నాతల్లిని తలంచి ఆమె ఆత్మకొరకు వేడుకొనునట్టు కృపచేయండి" అని వ్రాసిపెట్టిరి. మరియు ఈ మహాశాస్త్రి చచ్చినవారలకు చెల్లించవలసిన అప్పులనుగురించి ఒక మంచిపుస్తకమునును వ్రాసిపెట్టిరి.

ఇది మితిలేక విస్తరించునని వెరచి అర్చ్య. క్రిసొస్తొముస్, అర్చ్య. ఎరోనిముస్, అర్చ్య. బజిలియుస్, అర్చ్య. సిరిల్, అర్చ్య. గ్రెగోరి మొదలగు పూర్వీక వేదపారగులు వ్రాసిన వాటిని వివరించివ్రాయక ముందుచెప్పినవి బుద్ధిగలవారలకు చాలునని తలంచియున్నాము. ఇప్పుడు చెప్పినలాగు అపోస్తుల కాలమునుండి ఈ కాలమువరకున్న వేదపారగులందరును చచ్చినవారలకొరకు వేడుకొనునది తిరుసభయొక్క విధియని వ్రాసినదానిని నిరాకరించినవారలు ఎవరును లేనందుచేత, అపోస్తుల బోధకముచేత ఆరంభించి తిరుసభలో వాడుకకు వచ్చిన విధి ఇదేయని చెప్పగలవారలము. అయితే ఉత్తరించు

స్థలము లేకుండినట్టయితే చచ్చినవారలనిమిత్తము చేయబడు వేడుదల అబద్ధమేకదా ? కాబట్టి చచ్చినవారల నిమిత్తము వేడుకొనునది అపోస్తుల బోధనచేత వచ్చిన తిరుసభయొక్క ఆచారము గనుక ఉత్తరించు స్థలముకలదని అపోస్తుల బోధక ముచేత వచ్చిన తిరుసభ ఆచారమైయుండగా, ఉత్తరించు స్థలముకలదని అపోస్తులు నేర్పించిన సత్యవిశ్వాసముగదా ?

కడసారి సత్యముతప్పని తిరుసభయొక్క విశ్వాసము దాని ఎడల యేదని చక్కగా కనిపట్టునట్లు ఫ్లారెన్సు పట్టణ ములో కూడిన సకల మేత్రాణులయొక్క సంఘములో ప్రసిద్ధప రచబడిన తీర్మానమును వినగలవారలు. అది ఏమనిన: నిజమైన మనస్తాపపడి పాపాత్ములు తపక్రియలవల్ల తమ పాపములకు ఈలోకములో పరిహారము చేయుటకు మునుగా చచ్చినట్ల యితే, వారల ఆత్మలు ఉత్తరించు స్థలముయొక్క వేదనలలో శుద్ధీకరింపబడును. అప్పుడు ఈ ఆత్మలను జీవముగల క్రీస్తువుల యొక్క ప్రార్థనలవల్ల రక్షింపవచ్చుననుటవల్ల వాటినిగురించి దివ్యపూజ చేయించునదిన్ని, జపములు చేయునదిన్ని, భిక్ష మిచ్చునదిన్ని తక్కిన ధర్మములను చేయునదిన్ని తిరుసభయొ క్క వాడుకయును కట్టడయునునైను.

ఇదిన్నిగాక 1583 సంవత్సరలో, త్రిదెంతను నగరము లోకూడిన, మిగుల పేరుపొందిన సమస్తసంఘములో మేత్రా ణులు ఉత్తరించు స్థలముకలదనియు, దానిలో చెరబడిన ఆత్మ లు దివ్యపూజవల్లను, విశ్వాసులయొక్క తక్కిన మనవులవల్ల ను, ఆరుదలయును సహాయమును గైకొనుచున్నవి యనిన్ని, తిరుసభయొక్క విశ్వాసము అదేయనిన్ని చెప్పినపిమ్మట ఈ పరమసత్యమును గురువులందరును తమవిచారణకు లోబడి

యుండే క్రీస్తువులకు కొరత లేకబోధించి, వారలదానిని సరిగా ఒప్పుకొనునట్లు చేయవలయునని తీర్మానించిరి.

క్రీస్తువులారా! ఇప్పుడు వివరించిచూపిన ఉదాహరణ ములవల్ల మీ విశ్వాసము కొంచెమైనను తొత్తళించక నిలవర ముగా నుండవలసినదిగాక, అధికాధికముగా మీ జపతప దానధర్మములవల్లను, తక్కిన సుకృత మనవులవల్లను, ఉత్తరించుస్థల ఆత్మలకు ఆరుదలరప్పించి సహాయము చేయుదురుగాక.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసువా మామీాద దయగానుండండి (100 దినములఫలము)

## జ ప ము.

సత్యపితా! మా తల్లిదండ్రులు, బంధుమిత్రులు, ఉప కారులు మొదలయినవారలను తగినవిధముగా స్నేహించి, వారలకు కావలసిన సహాయమేలులను చేయ అజ్ఞాపించితిరి గదా? కాబట్టి మమ్మును కని సాకి పెంచినవారలును, నానా విధయుపకారములను మాకుచేసినవారలును, మా బంధువులుస్నేహితులు మొదలైనవారలును వేదనలుతగి నిత్యకాలము మిమ్మును సంతోషముగల రాజ్యములో దర్శింప కృపచేయవలయునని మిమ్ము ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి భిక్షమిచ్చుట.

## ఆ ప్పి త ము.

ఎనిమిదివందల సంవత్సరములకుముందే తప్పని భక్తి విశ్వాసమువల్లను, తేరిన విద్యా శాస్త్రమువల్లను, చేసిన

మితిలేని అద్భుతములవల్లను ప్రఖ్యాతమై పేరుపోయిన అర్చ్యశిష్ట బెర్నర్దనువారు ప్రకాశించుకొనియుండిరి. వారురచియించి ప్రసిద్ధిపరచిన సుకృతపుస్తకములలో అర్మాక్కపట్టణముయొక్క మేత్రాణులైన అర్చ్య- మలక్కిగారి చరిత్రము మధురోక్తులతో వ్రాసిరి. ఈ మేత్రాణివారు తాము జీవించిన దినములన్నిటియందును, ఉత్తరించు ఆత్మలమీద మిగుల భక్తిస్నేహముగానుండి వారలకు సహాయముచేయ తమచేత చేయకూడిన పుణ్యామంతటిని చేయుదురు. వారు గురువగుటకుముందే చనిపోయిన బీదవారల ఆత్మలకు ఊరట రప్పించేటట్టు వేడుకొనుటయేగాక, వారల భూస్థాపితమునకు వెంబడి పోదురు. కొన్నిసమయములలో వారలను తమ చేతులతో కావలసిన పరిచర్యచేసి భూస్థాపితముచేయుదురు. వారు ఇటువంటి ధర్మక్రియలను చేయునపుడు ఈలోక సుఖభాగ్యములమీద మిగుల పట్టుదలగానున్న మర్గ లేనమ్మయనెడు వారి సహోదరి ఒకతె, వారిని పరిహాసముచేసి చెప్పినదేమనిన : "గొప్పవంశములో పుట్టి పెరిగినమీకు ఈ నీచపనులు చేయునది తగునా ? బుద్ధిలేనివారా, మీ వంశమహిమను చెడగొట్టెడువారా, ఇటువంటి పిచ్చిపనులు చాలించి చచ్చినవారలను తమ బంధువులచేత స్థాపితముచేయనిమ్ము" అనును. దీనిని ఇంతకంటె రోషముగల వేరుమాటలనును ఆమె అనినప్పటికిని అర్చ్య - మలక్కియనువారు, తాము ఆరంభించిన సత్కృత్యములను విడిచిపెట్టినవారు కాదు.

కొన్ని సంవత్సరములకు పిమ్మట ఆస్త్రీ ఇంకా ముసలితనము రాకపోయినను తగిన ఆయత్తముతో మరణముపొందినది. అయితే తనసహోదరుడైన మలక్కియనువారు ఆత్మ

లను గురించిచేయు సత్కృత్యములను ఆమె పరిహాసకము చేసినందున సకలము నెరిగియున్న సర్వేశ్వరుడు ఆమె ఉత్త రించు స్థలములో మిగుల వేదన అనుభవించ తీర్పువిధించిరి. అర్చ్య. మలక్కి-గారోయనిన : బహుకాలము ఆమె ఆత్మను గురించి దివ్యపూజలుచేసి, జపములను జపించి, తపసులను నడ పించినపిమ్మట ఈ ఆత్మము దరిచేరి యుండవచ్చునని తలంచి ఏమినిచేయకనుండిరి. ఒక నెల జరిగినపిమ్మట ఈ ఆత్మ అధికకష్టి తోనును, అధిక కష్టముతోనును, గుడిలో ప్రవేశింపకూడని విధముగా వారికి కనిపించి "దేవరవారు ఒకనెలనుండి నాయా త్మకు పూజచేయని నిమిత్తము నేనుపడెడు బాధలలో ఒక ఊరటయునులేదు" అనిచెప్పినది. ఈ అర్చ్యశిష్టవారు సదరు ఆత్మము నిమిత్తము మరల పూజచేయ నారంభించిరి. కొంత కాలమునకు పిమ్మట ఈ ఆత్మము గుడిలో ప్రవేసించియుండి నను, పీఠమునకు దగ్గిరగా రాకూడకుండుటను మేత్రాణివారు చూచిరి. కాబట్టివారు మరియనేక తపదానధర్మములను చేసి నదిగాక, ఈ ఆత్మనిమిత్తము మహాభక్తితో దివ్యపూజనును చేయుచువచ్చిరి. కడసారి ఈ ఆత్మము మహిమ గౌరవముగల వస్త్రములను ధరించి మిగుల సంతోష ప్రతాపముతో ఉత్త రించు స్థలమునువిడిచి మోక్షమునకు పోవుటను వీరుదర్శించిరి.

వారోయనిన: బహుసంవత్సరములకాలము దేవయూ డిగమునందు మహాకృత్యములను నడపించినపిమ్మట, తాము ఆసించినలాగే ఉత్తరించు ఆత్మలపండుగనాడు అర్చ్య-బెర్నర్ది నువారు స్థాపించిన సభకు ముఖ్యస్థానమైన మఠములో భాగ్య మైన మరణము పొందిరి. ఆపండుగరోజు చేయబడు సకలపూజ లయందును ధర్మములయందును వేడుదలలయందును తమకును

పాలుదోరికేటట్టు ఆదినమునందు వారు చావ ఆసించినదిగాక, ఆమరణములోనుండు సకలసన్యాసులు తమ ఆత్మను, గురించి పూజమొదలైన తపధర్మములు చేయుచురనుటచేత, ఆస్థలము నందు తాము మృతిపొంద ఆశించుకొనియుండిరి. ఆలాగు దైవ సంకల్పముచేత సంభవించినదని అర్చ్య - బెర్నర్ధూసనువారు వ్రాసిపెట్టిరి.

మంచివిత్తనము అనేక కొమ్మలను శాఖరించి అధిక ఫలమిచ్చినట్టు, ముందుచెప్పిన అద్భుతముచేత సహోదరులారా మీకును అనేక జ్ఞానఫలములు రాతగును.

మొదటిది :—అర్చ్య-మలక్కి-గారియొక్క సహోదరి, వారు ఆత్మలను గురించి చేయుసత్కృత్యములను నిందించి అస హ్యపడినందుచేత, లేతవయసులోనే చచ్చి ఉత్తరించుస్థలము లో బహుకాలము వేదన అనుభవించినదని వినియున్నారుగ దా ? ఆమెకు సంభవించినలాగు మీకును సంభవించకుండు నట్టు ఉత్తరించు ఆత్మలనిమిత్తము తిరుసభలోచేయబడు పూజ, మోక్షదీపము మొదలగు సుకృత ఆచారములను మీరు నింద చేయకనుండడముగాక, అర్చ్య-మలక్కి-గారిని కని భావించి వీటిని భక్తి విశ్వాసముతో అనుసరించుకొనుచు రావలసినది.

రెండవది :—అర్చ్య బెర్నర్ధుస్ చెప్పినలాగు దివ్యపూ జయైనది పాపములను పరిహరించను, భూతగణములను జయిం చను, ఉత్తరించు ఆత్మలను మోక్షములోచేర్చను మిగుల శక్తి గలదగుటచేత, దివ్యపూజను అడుగడుగుకు భక్తితో చూడవ లసినదిగాక, కూడినట్టయితే దానిని చేయించవలసినది.

మూడవది :—ముందుచెప్పిన పుణ్యవతియొక్క ఆత్మ ము ఉత్తరించు స్థలమునుండి రక్షించ అర్చ్య - మలక్కి-గారు

అన్ని పూజలు మొదలైన ధర్మములను చేయుచుండినప్పుడు, అనేక గొప్ప పాపములను కట్టుకొనినవారలు మంచి ఆయత్తము తో చనిపోయియుండినను బహుకాలము ఉత్తరించక రక్షణ ము పొందుమరని నమ్మకూడదు. కాబట్టి చనిపోయిన మీ వారలను తలంచి మీరు జపించి ప్రార్థించి ప్రయాసపడి ఒక నాటికిని ఆపుణ్యమును మరచి విడువకూడదని ఎరుగగలవారలు.

5 జ్యో-5 ప్రియ-5 త్రిత్వస్తోత్రములను చెప్పుట

స్వామీ పాతాళమునుండి మిమ్ము............

* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని (13 పుట చూడు)

---

# 4-వ తేది.

ఉత్తరించుస్థలము కలదనుట పరమన్యాయముల వల్లకనుపడు సత్యమగును.

---

## ధ్యానము.

మతిచెడిన మనుష్యుడొకడు తనను కనిన తలిదండ్రిని కోపించి కొట్టి నరికిచంపును. వాడు కట్టుకొనినపాపము ఎంత టి క్రూరమైనదని మాటలవల్లను తలంపువల్లను వర్ణించి చెప్ప కూడదు. మరియొకడు ఒక దోసకాయ దొంగిలించుచున్నాడు. వీడుచేసిన తప్పితమునకును, మొదటివాడు కట్టుకొనిన పాతక మునకును ఎంతదూర వ్యత్యాసము! మోహముతేగిన చం డాల పాపాత్ముడొకడు పలు తంత్రోపాయములను ప్రయో గించి తనస్నేహితుని భార్యను మోసగించి చెరుపుచున్నాడు. దీనిని అందరును గొప్ప దోషద్రోహ మనుదురు. వేరొకడు

తనమనసులో కలిగిన తగనివిచారములను వెంటనే త్రోసివేయక స్వల్పకాలము అశ్రద్ధగానుండును. వీడు ఈలాగు కట్టుకొనిన తప్పితము ఆ ఛండాలుడు చేసిన ద్రోహ పాపమునకు సమానమని చెప్పువారలెవరు?

ఒకడు తనవిరోధిని చెరుపవలయునను ఆశచేత వానిమీద లేనితప్పితమును మోపి అబద్ధసాక్షులను పలికించి పలుముఖాంతరములనును దృష్టాంతములనును కనుపరచి వానికి మరణాజ్ఞ రప్పించుచున్నాడు. దీనికంటే అన్యాయముగల దుష్టతనము వేరేలేదుగదా? మరియొకడు ఎగతాళిగా ఒకస్వల్ప అబద్ధమును చెప్పుచున్నాడు. ఈ తప్పితము ఆ పాతకమునకు సరియైన దోషమని తలంచువారలు గలరా?

ఇట్లుండగా, ఎటువంటి మనుష్యులకును గొప్పపాపములును చిన్న పాపములును గలవని స్వభావబుద్ధివలన గ్రహించి చెప్పుచున్నారు. ముందుచెప్పిన పాపములను కట్టుకొనిన వారలందరు పాపసంకీర్తనము చేయకుండాను, ఉత్తమ మనస్తాపపడకుండాను, ఆకస్మికముగా చచ్చిరేని సర్వనీతిగల సర్వేశ్వరుడు వారలను ఏమిచేయుదురు? ఒకేసారి వారలందరిని అగ్నినరకమునకు పడద్రోయుదురా? గొప్పదోష ద్రోహములను కట్టుకొనిన వారలవలె అల్పస్వల్ప తప్పితములను చేసిన వారలను సహితము దండించుదురా? ఆలాగు దండించునది వారి నీతికిని దయకును తగునా? అది బొత్తిగా లేదని అందరికిని కనుపడు సత్యముగానున్నది. అందువలన మనసుతిరుగని మూర్ఖ పాపాత్ములను సదాకాలము వేదన యనుభవించ నిత్యనరకమునకు నీతిగల సర్వేశ్వరుడు పంపిచునప్పుడు, స్వల్ప తప్పితములతో చచ్చినవారలను ఆలాగు శపించి త్రోసివే

యురు. అయితే మోక్షపేరింప రాజ్యములో ఎవరైనను ఏదొక స్వల్పతప్పితముతో ప్రవేశింప కూడదనుటచేత, ఈ స్వల్ప పాపములతో చనిపోవువారలు ఆస్థలమునకు వెంటనేపోక తాము పరిశుద్ధమయ్యేవరకు ఒకమధ్యస్థలములో నిలుపబడు దురని చెప్పవలసినది. చచ్చినపిమ్మట నరకమును రప్పించెడు పాపమును, మోక్షమునురప్పించెడు పుణ్యమునుచేయ, స్థలము ను కాలమును లేనందుచేత, ఈ ఆత్మలు చెడిపోనును కూడదు; ఏదొక పుణ్యఫలమును సంపాదించుకొనను కూడదు. కాబట్టి తమ తప్పులకు తగిన దండన అనుభవించి శుద్ధకరమగుదురే గాని వేరుకాదు. ఈ ఆత్మలు తమ తప్పులకు తగినదండన అను భవించేస్థలమే ఉత్తరించు స్థలమనబడును.

మరియు స్వల్పతప్పితములతో చచ్చినవారలనుగాక, అనేకులుచావైన పాపములు కట్టుకొనియుండిన్ని, మంచిపాప సంకీర్తనము చేతనైనను, ఉత్తమమనస్తాపము వల్లనైనను ఈ పాపములకు మన్నింపుపొందిన పిమ్మట చనిపోవుచున్నారే. వీరలయెడఎరుగవలసిన సత్యావిశేషమేమనగా: మనసొప్పి చేసిన చావైనపాపముచేత .పాపాత్మునికి రెండువిధములకీడు కలుగు చున్నది. అవిఏమనగా: పాపదోషమును, అపరాధవిధియును అయిన ఈరెండునగును. పాపాత్ముడు పాపదోషముచేత యిష్టప్రసాదమును పోగొట్టుకొని, సర్వేశ్వరునికి ద్రోహిఅగు చున్నాడు. అపరాధవిధియో యనగా, రెండువిధముల నుం డును. నరకమునకుపోవ నిత్యఅపరాధవిధయును, అనిత్యఅప రాధవిధియునగును. పాపదోషము తీరక పోయినట్టయితే, నిత్యఅపరాధవిధి తప్పనందుచేత సదాకాలము నరకములో కాలవిధికలిగియుండును. ఆ పాపదోషము పాపసంకీర్తనము

చేతనయినను, నిజమైన ఉత్తమమనస్తాపము వల్లనైనను తీరి నట్టయితే నిత్యనరకమునకు పోనున్న అపరాధవిధియును తప్పి పోవును. అయితే ఈ పాపమునకు చెల్లించవలసిన అనిత్య అపరాధవిధి తప్పిపోదు.

ఈ అపరాధమును ఈ లోకములోనే చెల్లించవలసి యుండినను అనేకులు దీనిని సరిగా చెల్లించక అశ్రద్ధగానుంటు న్నారే, అలాగే చనిపోవుచున్నారే. వారలు యిష్టప్రసాద ములో చనిపోవుటచేత, నిత్యనరకమునకు పోయ బడుటలే దు. అయినను పాపమునకు చెల్లించవలసిన అనిత్య అపరాధ మును వారలు చెల్లించక నుండుటనుగూర్చి మోక్షమునకు పోవుటయును లేదు. కావున వారలు తమపాపములకు చెల్లించ వలసిన అపరాధమునును, పరిహారమునును, చెల్లించతగిన ఒక స్థలము ఉండవలసినదిగదా ? దానిలో ముందు చెప్పినలాగే పుణ్యఫలమును పొందను, పుణ్యము చేయను కాలము లేనందు చేత, తాము అనుభవించు వేదనలచేత ఆపరిహార అపరాధము ను తీర్చవలసినది. ఇప్పుడు చెప్పినదంతయు బుద్ధిగల ఏమను ష్యునికిని సరియైన న్యాయముగాను, దేవనీతికిని దేవకృపకును తగిన పడవడికగాను కనుపడుచున్నదిగదా ?

సర్వేశ్వరుడు దయచేసిన కల్పనలన్ని రెండుకల్పనలలో అణగియున్నవని మీకు తెలియునే, అది ఏమనగా, దేవస్నేహ మును పరస్నేహమును అయిన ఈ రెండు కల్పనలగును. తన్ను తాను స్నేహించినట్టు తక్కిన వారలనందరిని స్నేహించ వలసి యుండినను, బంధుజనులనును, స్నేహితులు ఉపకారులనును, ఎక్కువగా స్నేహించవలసినదిగదా? ఈ విశేష స్నేహమును సాధారణముగా పరస్నేహమును చావుచేత పాడైపోవునా ?

ఆలాగు చెప్పను తలంచనుకూడదు. అందుచేత మనము స్నే హించి, చచ్చినవారలకు ఏదొక సహాయమేలు చేయుకూడి నట్లయితే దీనిని మహాప్రియముతో చేయుదుమని సందేహ పడువారలు గలరా ? ఏలినవారి మితిలేని కృప దయాళత్వము నమ్మి ఆలాగు చేయవచ్చునని మనము, మనవారలు ఉత్తరిం చు స్థలములో అనుభవించే వేదనలను నివర్తి చేయుటను, తగ్గించనును, ముగించనును వలయుననే ఆశ చేత జపములను చేయుదము, ధర్మమునిచ్చుదము, తపసు చేయుదము, దివ్యపూజ చేయించుదము.

ఆలాగువారలు మన జపతప దానధర్మములవల్ల ఉత్త రించు స్థలమునుండి తప్పి రక్షింపబడి మోక్ష పేరింపమునకు చేరినప్పుడు మనలను మరువక సర్వేశ్వరునియొద్ద మనకొరకు వేడుకొనుదురను నమ్మికమైనది సంతోషమునిండిన సత్యవి శ్వాసముగునే. ఈలాగు ఇంకను ఈలోకములో జీవించియుండే వారలును, ఉత్తరించే స్థలములో వేదన పడేవారలును, మోక్ష ములో వర్ధిలుచుండువారలును తమలో ఛేదింపని స్నేహ మును, పీడని బంధనముగా నున్నారని బుద్ధిచే ఎరుగకూడిన విశేషముగాక వేదవాక్యములవల్ల బోధింపబడిన సత్యవిశ్వాస మని ఎరుగగలవారలు.

అలమంగులకు చెప్పవలసిన సుకృతము.

జేసువా మామీద దయగానుండమండి. (100 దిన ఫలము.)

## జపము.

సర్వవల్లభులైన నిత్యసర్వేశ్వరా ! జీవితులమీదను, మృతిబొందిన వారలమీదను అధికారము చెల్లించి, విశ్వాస మువల్లను సత్కృత్యములవల్లను మీా పక్షముగుదురని దేవర

వారు ముందుగా తెలుసుకొనిన సమస్తులకును దయగలవారై యున్నారు. మేము ఎవరెవరినిమిత్తము జపించి ప్రార్థించుచున్నామో వారలందరును శరీలసమ్మంధముతో ఈ లోకమున నుండువారలైనను, శరీరమునువిడిచి మరులోకములో చేరిన వారలైనను సకల అర్చ్యశిష్టుల వేడుదలవల్లను, మీదయ విశాలముయొక్క కృప కటాక్షమువల్లను, పాప ఓర్పు పొందులాగు దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమెన్ జేసు. చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి 53 పూసల జపమును చెప్పుట.

# అద్భుతము.

ఉత్తరించు స్థలము లేదనియు, చనిపోయిన ఆత్మలకును బ్రతికియున్న ఆత్మలకును ఏదొక సంబంధము లేదనియు, ఈ ఆత్మలకు మనుష్యులవల్ల సహాయమేలు కలుగుట లేదనియు, దుష్టపతితులు చెప్పునపుడు తమ బుద్ధిహీనమును కనుపరచుట యేగాక, వారలు మహాక్రూరమైన వారలుగాను, చచ్చిన పిమ్మట నిర్భాగ్యులుగాను ఎంచబడుచున్నారు. చనిపోయిన తలిదండ్రులకు బిడ్డలును, మృతిపొందిన పెనిమిటికి భార్యయును, గతించిన అన్నకు తమ్ముడును, ఆత్మ పెడబాసిన స్నేహితునికి బ్రతికియుండే స్నేహితుడును ఏదొక సహాయ మేలుచేయ కూడదని ఈ పతితులుచెప్పు అబద్ధము అందరికి తేటగా కనిపించును.

స్కోసియా రాజ్యములో గొప్ప వంశపతిదైన తండ్రికి జన్మించిన సహోదరులు ఇద్దరుండిరి. వారలలోగా సరిసమాన మైన గుణమును అన్యోన్యస్నేహమును గలవారలై యున్నందు

చేత, ఇద్దరును ఎడబాయక ఒకే జీవముగాను, ఒకే శరీరము గాను కలిసియుండిరి. అయితే ఈ ఇద్దరును పతితమతములో పుట్టి పెరిగినందుచేత తక్కిన వేదసంగతుల నెరుగనివారలై తమవేదమునే కూడినమట్టుకు అనుసరించుకొని వచ్చుచుండిరి. ఒక విశేషదినమునందు వీరలును కొంతమంది స్నేహితులును, ఒక గొప్పవిందుచేసి, ఆసనములయందు కూర్చొని సంతోషముగా తినునపుడు, ఈ యిద్దరిలో చిన్నవాడుగా నున్న వాడు తటాలున మూర్ఛగాపడి చచ్చెను. చచ్చినవాని అన్న తనప్రియతమ్ముని జీవములేని ప్రేతమునుగని చెప్పరాని కస్తి అనుభవించి నదిగాక, దానికిపిమ్మట ఒక సంతోషమును, మన రమ్యమును, అల్పఆరుదలయును గలవాడుకాదు. రాత్రింబగ లును తనప్రియతమ్ముని రూపమునుచూచినట్టు అదే జ్ఞాపకము వల్ల ప్రలాపించి, ఎడతెగక కన్నీళ్లు రాల్చుచుండును. తన తమ్ముడు మరులోకములో క్షేమముగా నున్నాడని నమ్మక ముండినట్టయితే కొంచెము బ్రతికెదనని అన్న తలంచినను, పతితమార్గమును కలిగించిన రూతెరు ఉత్తరించు స్థలములేదని త్రోసివేసినందుచేత పతితుడైన ఈ మనుష్యునికి ఈనమ్మిక లేకుండినది.

కాబట్టి వాడు, తన తమ్ముడు పరలోకమునుంచి ఆయత్తము లేక, అకస్మాత్తుగాచచ్చి నీతిగల సర్వేశ్వరుని తీర్పుకు పోయిన దానిని తలంచేటప్పుడు, వానికి అధికభయమును కస్తివిచార మును కలిగియుండినది. రోజులుగడవగా ఈ విచారముచేత వానికి పగలునందు విశ్రాంతియును, రాత్రియందు నిద్రయును, మనసునందు సంతోషమును లేనందుచేత, అధిక బాధపడి క్షయ వ్యాధిగాపడిపోయెను. అపుడు వానిస్నేహితులును బంధు

జరులుకు వానికి ఈ తలంపుమరచి పరాకును ఇతర చింతలును కలిగేటట్టు దేశయాత్రచేయుటకు పంపిరి. ఫ్రాన్సు దేశమునకు పోడువచ్చి, అక్కడ నొక కతోలిక్ గురుస్వాములవారిని హాఠాత్తుగాకని, వారికి తన తమ్ముడు చచ్చినవిధమునున్ను, అందునుండి తనకుగల ఆరని క స్తినిని వివరించి చచ్చినవారలను గురించి మీకైనను నమ్మకముగలదు, చచ్చిన మీస్నేహితులను గురించి మీరు వేడుకొనుచున్నారే, అయ్యో! నాకు ఈనమ్మకముకూడా లేదు, ఆలాగు వేడుకొనుటకు శక్తి కూడా లేదనెను.

గురుస్వాములవారు వానిమీద కనికరించి, మంచిమాటలు చెప్పి: నీవే వకసత్యమైన కతోలిక్కు వేదమును చేపట్టితివేని నీకును నమ్మికపుట్టును, జపముచేత కలిగెడు తృప్తిన్ని దొరుకుననిరి. దీనిని విని ఈ మంచి యవ్వనుడు తనకు నమ్మకమును, సంతోషమును రాతగ్గట్టు, సత్యవేదముయొక్క వ్యాయదృష్టాంతరములనును చదివి చక్కగా నేర్చుకొనిన పిమ్మట స్వాములవారి యొద్దకువచ్చి: యావత్తు తీర్మానించినదైనది, నేనిపుడు కతోలిక్కు క్రీస్తువుడనుగానున్నాను, నా తమ్ముని ఆత్మనుగురించి నేను వేడుకొన కూడినపుడు నా నిర్భాగ్యము నివర్తించును. వానికి మోక్షభాగ్యము నొసగవలయునని ప్రతిదినము స్వామిని ప్రార్థించుకొన జీవించుదును. నిజముగానే తిరుసభదైనది మనుష్యుని స్వభావమునును గుణాగుణములనును చక్కగా నెరిగినందువలన ఈలోకము నొక్క ఎల్లలో ఉత్తరించుస్థలము గలదని బోధించుకొని వచ్చుచున్నది. దానిలో నా తమ్ముని ఆత్మముకూడా కొన్ని మాకులు ఉండవచ్చునే. వాని కొరకు ఎప్పుడును వేడుకొనునదే నాకు ఎంతో యూరట

టగానుంపుడు ! అందుచేత నేను క్రీస్తువుడనుగానుండ తీర్మానిం చితిని అనెను. ఈలాగువాడు సత్యవేదమును చేకొని, తన ఆత్మకు సంతోషమును నమ్మికయునుపొంది, మంచి క్రీస్తువు డుగా నడిచెను.

వర్తకుడు ఏవ్యాపారమునందును లాభము వెదకుచు వచ్చులాగు, క్రీస్తువులారా ! మీరును ఇప్పుడు చెప్పిన అద్భుత ముచేత మీకు జ్ఞానప్రయోజనమును వెదకవలసినది.

మొదటిది :—సర్వకృపగల సర్వేశ్వరుడు మిమ్మును పతితమార్గములో పుట్టింపక, సత్యవేదములో పుట్టిపెరిగి స్థిర ముగానుండ కృపచేసినారని తలంచి, వారికి మేలెరిగిన మన సుతో స్తోత్రముచేయవలసినది గాక, ఈ సుకృతవేదమునును, దీని కట్టడలనును, సుముద్రముగా అనుసరించవలసినది.

రెండవది :—మీతలిదండ్రియైనను, కొడుకు కూతురై నను, పెనిమిటి భార్యయైనను, అన్నతమ్ముడైనను, అక్కచెల్లె లైనను చనిపోవునపుడు, వేదమునెరుగని అజ్ఞానులవలెను, నమ్మికలేని పతితులవలెను అధికకష్టపడవద్దు. ఉత్తరించు స్థల మునుండి మీవారల ఆత్మలను రక్షింప కూడునని ఎరిగినందు చేత, వారలనుగురించి జప తప దాన ధర్మములను అధికము గాచేయుండి.

మూడవది :—మీ బంధువులు, స్నేహితులయొక్క ఆత్మలు ఎంతకాలము ఉత్తరించుస్థలములో కష్టపడుదురని ఎరు గనందుచేత, ముందుచెప్పినమంచి యవ్వనుడు తానుజీవించు దినములన్నిటియందును, తన తమ్ముని ఆత్మనుగురించి ప్రార్థించు చుననని చెప్పినలాగే, మీరును మీ ఆయుష్కాలమంతా మీ

స్వకీయుల ఆత్మను నిమిత్తము వేడుకొనవలయునని ఎరుగగల వారలు.

5 జ్యో-5 ప్రియ-5 త్రిత్వస్తోత్రములను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము..........

* నిత్యపితా జేసు క్రీస్తునాథుని వెలలేని (13 పుటచూడు)

---

## 5-వ తేది.

ఉత్తరించు స్థలములో ఆత్మలు అనుభవించే వేదనలను వివరించు వర్తమానము.

---

## ధ్యానము.

ఉత్తరించుస్థలము కలదనియు, దానిలో ఉత్తరించు ఆత్మలు వేదన అనుభవించుచున్నవియనియు, ముందు చెప్పిన ధ్యానములలో వివరించియున్నాము. ఇపుడుమీరు ఈ ఆజ్ఞలకు భయపడి నడవను, వాటినిరప్పించు పాపములను చేయకనుండను, ఈ ఆజ్ఞలను అనుభవించు ఆత్మలమీద దయగానుండను ఈ వేదనలు ఎటువంటివియని యోచించి ధ్యానించి చూడగల వారలు.

ఒకనాడు కొందరు బుద్ధిలేని పడుచువారలు, మేము నరకానికి పోకుంటే మాత్రముచాలును, ఉత్తరించుస్థలమునకు పోతే పర్వాలేదని చెప్పుటను అర్చ్య-అగు స్త్రీగారువిని జ్ఞాన కోపమునొంది, " నిర్భాగ్యులారా! అలాగు మాట్లాడకండి; ఈ లోకమురొక్క హింసబాధలు యావత్తు ఒకటిగా చేర్చి నను, ఇవియన్ని ఉత్తరించుస్థలములోని వేదనలకు ఈడుకాదని

ఎరుగ గలవారలని" ఖండించి చెప్పిరి. ఈ ఒక వార్తలో ఎంత కార్యము అణగియున్నదని కొంచెము ధ్యానించగలవారలము.

ఈ లోకములో మనుష్యుని పీడించు వ్యాధులు ఎన్నియున్నవియనియు, ఎంత కష్టముగలవియనియు, ఎవరివల్ల చెప్పకూడును ? కంటినొప్పి, పంటినొప్పి, చెవినొప్పి, చేతినొప్పి, కడుపునొప్పి, కాలునొప్పి, తలనొప్పి, శూలనొప్పి, కుష్టురోగము, పలువిధములైన వ్రణములును ఈ మొదలైనవాటికి లెక్క గలదా ? ఈసకలమైన వ్యాధులచేత కలుగు నొప్పియుపద్రవములన్ని క్రమముగా ఒకమనిషి అనుభవించవలసి యుండినట్టయితే వాటిని సహించజాలడని అందరు తలంచుదురుగదా ? అయితే ఉత్తరించుస్థలముయొక్క వేదనలు ఇపుడు చెప్పిన కష్టములన్నిటికంటె అధికమైనవియని వేదశాస్త్రులు నిశ్చయించు చున్నారు. వీటిని సహించ మీవల్ల సాధ్యమగునా చెప్పండి ?

ఇదిగాక, అర్చ్య. వనచిన్నప్పగారును, పెద్ద అంతోని వారును, పెద్ద మక్కారియుస్, చిన్న మక్కారియుస్, అను వారలును, స్తీత్ అను శిమయోనును, తక్కిన పేరుపోయిన తపోధనులును, ఋషులును, అనేక సంవత్సరములు నడపించిన తపక్రియలనును, అనుసరించిన ఉపవాసములను, ధరించినముండ్లమొడ్డాణములనును, తాముకొట్టుకొనిన కొరడాలనును, భుజించిన కొంచెము తిండినిని తలంచేటప్పుడు ఇదియంతా మహాగొప్పతపసనియు, సహింపరాని నిగ్రహమనియు ఎంచుదురు కాబోలు ? అయితే ఇవి యన్ని ఉత్తరించు స్థలవేదనలతో సరిపోల్చినట్టయితే కొంచెమును, స్వల్పమును, సులువునైన తపసనుటకు సందేహములేదు. ఒక గడియసేపు ఉత్తరించు

స్థలములో కష్టపడుటకంటె, నూరుసంవత్సరములు కఠినతపసు చేసి ఉపవాసముగానుండడమే గొప్పయూరటగా కనబడుచునని ఒకశాస్త్రి నిశ్చయించి చెప్పియున్నారు. తిరుసభకట్టడ చేసిన ఒక్క ప్రొద్దుదినములను అనుసరించునదిని, పెద్ద శుక్రవారము నాడు నేయి, పెరుగు, మజ్జిగ త్రాగకుండునదిని పెద్దకష్టమని చెప్పి వేరేతపసేమిన్ని చేయనివారు ఉత్తరించుస్థలములోని బాధలను సహించుకొనుదురో చెప్పండి ?

మరియు వేదసాక్షులు అజ్ఞానులచేత అనుభవించిన ఎన్నివిధకౄర బాధలనును తలంచవలసినది. వారలు చెరసాలల యందును, న్యాయస్థలములయందును, ఘోరముగా దెబ్బలు బడి, ఇనుపయత్నములచేత శరీరాదియంతమును చీల్చబడి, కరగిన సీసమును త్రాపబడి, పులి, కరడి, సింహము మొదల యిన దుష్టమృగములకు ఎరగా త్రోయబడి, అవయవములన్ని తుండుతుండుగా నరకబడి, విషసర్పములతో చేర్చికట్టబడి ఘోరముగా మండు అగ్నిఆవములో వేయబడి, చచ్చుటకు ముందే వేయిమారు చచ్చి, వారలు అంతటిబాధలను ఏలాగు సహించజాలినారని కనిపట్టువారలుగలరా ? చెప్పిచూపువా రలుగలరా ? అయితే ఈ ప్రతాపముగల వేదసాక్షులు అను భవించిన వేదనలనన్నిటిని ఉత్తరించుస్థలముయొక్క వేదనలకు ముందు అవి నీడయనియు, చిత్తరువు అనియు చెప్పియున్నది. సత్యముగానే ఈ వేదనలు మనుష్యుని బుద్ధికి మించినవిగా నుండుటచేత, వీటి యఘోరమును మనుష్యుడు కనిపట్టకూడ దని అర్చ్య. అగుస్తీనుస్ వ్రాసిపెట్టిరి. ఇది ఇట్లుండగా, ఒక దోమకాటుకును, చలి ఎండకును భయపడేవారు, ఉత్తరించు స్థలముయొక్క వేదనలను ఓర్చుకొనుదురో చెప్పండి.

కడసారి నిత్యనరకములో శిక్షించబడిన పాపాత్ములు అనుభవించే ఆజ్ఞలకును, ఉత్తరించు ఆత్మలు అనుభవించే వేదనలకును ఒకే ఒక వ్యత్యాసముగాని వేరే వ్యత్యాసము లేదని అర్చ్య-సిరిలూస్ అనువారును, మహాశాస్త్రియైన అర్చ్య-తోమాస్ అనువారును నిశ్చయించిరి. ఆవ్యత్యాసము ఏదనగా; ఉత్తరించు స్థలముయొక్క వేదనలకు ముగింపుగలదు, నిత్యనరకముయొక్క వేదనలు ఎన్నటికి ముగియవనే వ్యత్యాసమేగాని, వేరేవ్యత్యాసము లేదు. ఇట్లుండగా నరకమునకు భయపడుచున్న మీరు, ఉత్తరించుస్థలమునకు భయపడకనుండుట ఏలాగు ? దాని వేదనలను సహించ మీరు త్రాణగలదో చెప్పండి.

క్రీస్తువులారా ! ఇపుడునేను స్వల్పమాటలచేత వివరించినదానినిగని భయపడి జంకి, అయ్యయ్యో అని అంగలార్చెదరేగాని, అంతటికఠిన బాధలను అనుభవించుచున్న ఆత్మలమీద ఇప్పుడైనను దయగానుందురని నమ్మియున్నాను. అయితే ఈ ధ్యానముకుండా మీకు వేరే ప్రయోజనము రావలసినది.

1 వ :—ఇటువంటి బాధలను కష్టములనునురప్పించు స్వల్పపాదములను మిగుల గమనముతో త్రోసివేయవలసినది. అనేకులు చెప్పులాగు ఇది స్వల్పఅబద్ధమును, స్వల్పదొంగతనమును, స్వల్పపాపమును అని మీరు తలంచనుకూడదు, చెప్పను కూడదు. కలిగే శిక్షవలన ఒక తప్పితముయొక్క ఘనము తెలియబడుచున్నదిగదా ? ఈ పాపములకు ఉత్తరించు స్థలములో ముందు చెప్పబడిన ఆజ్ఞలు నీతిగల సర్వేశ్వరుడు విధించినపుడు ఈ పాపములు స్వల్పమనియు, కొంచెమైనవియనియు ఎంచుదురోఏమి ?

రెండవది :—మీరు చిన్న ప్రాయమునందును యవ్వన వయసునందును ఇప్పుడును కట్టుకొనెడు చాలావైనపాపములు ఎన్నియని తలంచండి. మంచి పాపసంకీర్తనముచేసి వీటికి ఓర్పు పొందియున్నారనుట నిజమే; అయితే వాటికి ఏమి పరిహారమును చెల్లించితిరి చెప్పుడు ? ఈ విషయములో మిమ్ము ను మోసపరచకండి. ఈ లోకములో అందుకు సరియైన పరిహారమును చెల్లించకపోతిరేని ఉత్తరించు స్థలములో ముందు చెప్పిన బాధలను ఎన్నిరోజులు ఎన్నిసంవత్సరములు అనుభవించవలసి యుండునని ధ్యానించుకొనండి. కాబట్టి ఇపుడు ఈ పరిహారమునకు అధిక జపముచేయండి, అధికధర్మము చేయండి, అధికతపసు చేయండి, అధిక ప్రయాసతో తిరుసభ యొక్క ఫలములను పొందండి.

ఈ లోకములో నున్నవారలకు వ్యాధిచేత నయినను ఆకలి దాహముచేతనయినను, అన్యుల విరోధముచేతనయినను ఎవ్విధ కష్టిసంకటము కలుగుచున్నదని మీకు చక్కగా తెలియును. ఉత్తరించు స్థలవేదనలను సరిగా తలంచినట్లయితే ఇవియన్ని స్వల్పమని తలంచి, మారని ఓర్పుతోను దేవచిత్తమునకు క్రిందుపడిన మనసుతోను సహించి ఓర్చుకొనుదురు. ఈలాగు ఈకష్టిసంకటములన్ని కొంచెము కష్టిసంకటములుగా తోచుటయేగాక, ఇవి మీపాపములకు మంచి పరిహారమగు వని ఎరుగ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసువా మామీద దయగానుండండి (100 దినముల ఫలము.)

## జ ప ము .

కృపనిండిన సర్వేశ్వరా ! మృతిపొందిన మా సహో

దరులను దయతోచూడ నవధరించండి. వారల ఆత్మలను పితా పితృలైన అబ్రహాం, ఇజాకు, జాకోబు అను వారలతో సదాకాలముజీవించు మోక్షవాసులయొద్ద చేర్ప నవధరించండి. ఏవ్వి కష్ట ప్రళాపములేని స్థలమైన ఎవ్విధ సంతోషభాగ్యమునిండిన మీా మోక్షరాజ్యములోకి ఈ ఆత్మలను రప్పించు కొనవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీా ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి ఏదొక దరిద్రునికి అన్నముపెట్టుట

## అద్భుతము.

తొలోమైయనెడు అంజెలమ్మ హెచ్చైన గోత్రపు తలిదండ్రులనుండి పుట్టి, చిన్నప్రాయమునందు సహితము సకల పుణ్యములను కొరతలేక అనుసరించు కొనుచువచ్చెను. పిమ్మట దేవస్నేహములో అధికాధికముగా వర్తించునట్లు అర్చ్యసామినాధులు కలిగించిన కన్యాస్త్రీల సభలో ప్రవేశించినది. ఆ మఠములో నామె తక్కిన కన్యాస్త్రీలకు సన్మాతృకయును, సకల పుణ్యములయొక్క అద్దమువలె నుండినను కొన్ని స్వల్పతప్పితములను అసడ్డచేత చేయుచుండును. ఇట్లుండగా ఒకనాడు కఠినవ్యాధిగాపడి అవస్థయై చావపడియుండునపుడు ఒక దర్శనమును కనినది. అది ఏలాగనగా :-ఉత్తరించు స్థలములోగల భయంకరమైన వేదనలు యావత్తుదర్శించి, ఈ స్థలములో తనకు నియమించబడియున్న స్థలమునును తేటగా చూచినది. ఆ దర్శనముచేత ఈమెకు వచ్చినభయము ఎంతయునగా, మేలుకొనినపిమ్మట ఆమె శరీరమంతయు దిగులుగొనినట్లు కంప

మునొంది అమర కూడకనుండినది. దానికిపిమ్మట ఆమె సౌఖ్యా ముపొంది, ఏదొక అల్పసంతోషము నయినను వెదకక, స్వల్ప ఆరుదలను సహితము ఆపేక్షించక ఏవిధ తపక్రియలనును నడ పించుకొని వచ్చును.

మరియు ఆ సభలో వాడుకైన ఒక్కపొద్దు ఉపవాస ములును, ముండ్లవడ్డాణములును, సబుకు, పంచరాత్రులును, దీర్ఘజపములును ఆమెకుచాలక తన్ను బాధించునట్టు తక్కిన ఏవిధ కష్టములనును వెతుకుకొనుచుండును. కొన్ని సమయ ములలో తన్ను నిప్పువలన కాల్చి, తన్నుతానే గాయపరచు కొనును. కొన్నిసమయములలో రక్తము కారేవరకు ముండ్ల చెట్లమీద పడి పొర్లాడును. అనేకరోజులమట్టుకు ఏ ఆహార మునులేక పస్తుగానుండును. ఆలాగే తనవల్ల చేయకూడిన తపసంతయు చేయును. ఆమె నడిపించెడు ఆ భయంకరమైన తపక్రియలను తక్కిన కన్యాస్త్రీలుచూచి భ్రమించి, ఆలాగు చేయునది మహాక్రూరమనియు, తగని తపసనియు చెప్పినారు. అందుకామె ప్రతియుత్తరముగా :—మరులోకములో స్వల్ప పాపములకును స్వల్ప తప్పితములకును నియమించిన వేదనల తో వీటిని సరిపోల్చినట్టయితే, ఏమిలేనట్టుగా కనిపించునే. వీటినన్నిటిని వేయి సంవత్సరములు అనుభవించినను ఉత్తరిం చు స్థలముకంటె మిగుల సులభముగా నుండునే యనును. కాబట్టి ఆమె చనిపోవువరకు తన తపక్రియలలో నొకటయినను తగ్గించక చేసి పేరుపొందిన అర్చ్యశిష్టురాలైనది.

ఈ అద్భుతమును వినిన క్రీస్తువులారా! ఇప్పుడు మీ రేమి తలంచుచున్నారు? మీరు ఏదొక భయములేక కట్టు కొనుచున్న పలుపలు స్వల్పతప్పితములు కొంచెపు కీడనియు

అందునిమిత్తము సంభవించెడు ఉత్తరించు స్థలవేదనలు స్వల్ప వేదనలనియు ఇంకా తలంచుచున్నారా? ఉడుకుపాలలో మూతిపెట్టిన పిల్లి పచ్చిపాలుత్రాగ భయపడులాగు, ముందు చెప్పబడిన కన్యాస్త్రీ ఉత్తరించు స్థలమును చూచిన తరువాత, ఆ స్వల్పపాపములకు భయపడి నడచినదిగాక, అఘోర తప క్రియలనును చేసుకొని వచ్చినలాగు, మీారిక మీాదట ఏపాప ములనును విడిచిపెట్టి, కూడినమాత్రము తపము చేయవలయు నని ఎరుగ గలవారలు.

5 జ్యో- 5 ప్రియ 5—త్రీత్వ... చెప్పుడు.

స్వామీా పాతాళమునుండి మిమ్ము.........

* నిత్యపితా జేసుక్రీస్తు నాథుని వెలలేని (13 పుటచూడు)

---

## 6-వ తేది.

ఉత్తరించుస్థల ఆత్మలు సర్వేశ్వరునిచూడక అనుభవించెడు వేదనలను కనుపరచెడు వర్తమానము.

---

## ధ్యానము.

మితిలేని సర్వవల్లభము నిండినవారుగానున్న సర్వే శ్వరుని ప్రత్యక్షముగా దర్శించి, వారితో ఏకీభవించి, వారిని తరగని ప్రేమతో అనుభవించునదే, మోక్షానంద భాగ్యమ గును. వారిని దర్శించకుండాను, వారియొద్దకుచేర నమ్మకము లేకుండాను, వారిని సదాకాలము స్నేహించ కూడకుండాను ఉండునదే నరక నిర్భాగ్యమగును. ఈ పరమదేవుని దర్శించను, స్నేహించను, అనుభవించను, కూడకనుండునది, నరకవాసు లు తాము అనుభవించే ఇతరబాధలకంటె నూరువేలరెట్లు

అధికమైనదని యని అర్చ్య- క్రిసాస్టోమ్ అరుళప్పగారు వచసించి యున్నారు. ఉత్తరించు ఆత్మలోయసగా, తమకు కట్టడ చేయబడిన ఉత్తరింపు తీరుపర్యంతము బహు కఠినబాధలను అనుభవించునదేగాక, తాము ఏకముగాస్నేహించు సర్వేశ్వరుని దర్శించకుండాను, వారియొద్ద చేరకూడకుండాను ఉండునురు. సర్వేశ్వరుని కానకూడని ఈ వేదన ఎంతగొప్పదని ఇపుడు కొంచెమైనను కనిపట్ట ప్రయాస పడగలవారలము. ఈ ఆత్మలకు తటస్థించిన ఏకష్టబాధలకంటె, అదే విశేషకష్టమును సహించరాని బాధగానుండునని వేదసారగులందరును సిశ్చయించి చెప్పుచున్నారు.

మంచి తలితండ్రిని బహుసంవత్సరముల కాలముగా చూడని కుమారుడు, వారలయొద్దకు మరల పోయిచేరు సమయములో, పోకుండునట్లు దారిలో అడ్డగింపబడినట్లయితే ఎంతకష్టిఅనుభవించును ? ఒకగొప్పరాజ్యమును గైకొన ఒకడు పిలునబడినపుడు ఏదొక అభ్యంతరముచేత పోగూడక నుండు నేని, వానికిగల వ్యసనము ఎంతగొప్పదిగానుండును ? దూర ప్రయాణము యాత్రపోయినవాడు ఏవిధ ఆపత్తులనును అనుభవించి, గొప్పగాలివానలకును సముద్రదొంగలకును తప్పించుకొని, మిక్కుటద్రవ్యములను సంపాదించుకొని, దిగవలసిన రేవుగట్టుకుచేరినపుడు ఏదొక కారణమువలన దరి ఎక్క కూడక నిలువబడునేని మనోవాకుకందసికష్టి అనుభవించునుగదా ? అలాగే ఉత్తరించు ఆత్మలు అన్నిటికంటె తాము ప్రేమించి అపేక్షించెడు సర్వమేలునిండిన సర్వేశ్వరుని పొందకూడకను, తమపుణ్యములవల్లను ప్రయాసలవల్లను స్వతంత్రించుకొని నటువంటి మోక్షపేరింపరాజ్యము గైకొనకూడకను, ఈ లోక గాలివాన

లలోనుండి తప్పించుకొని, ఈ లోకయుద్ధములలో జయము
గొని వచ్చియుండినను, మోక్షగ్రైకక్కను, మోక్షకిరీటముధ
రించను కూడకనుండు కారణముచేత, ఈ పరిశుద్ధ ఆత్మలకు
ఎటువంటికస్తియును సంకటమును కలిగియుండునని చెప్ప
సాధ్యముకాదు.

తమకు ప్రియముగల కుమారుడు కనుపడనందుచేత,
పితాపిత్రుడైన జాకోబనువారు సదాక ఊరటలేక, కస్తిపడి క
లంగి ఏడ్చిప్రలాపించి, నాకుమారుడు జోజేపును ఇక నీలోక
ములో చూడనందున, మరణమేనాకు గతియనిరి. దావీదు
రాజు కుమారుడైన అబ్సలోమనువాడు తన తండ్రి సముఖము
నకు పోకూడనిదానినిగురించి, మిగుల కస్తిపడి, నాతండ్రిగారు
నాతప్పితమును ఇంకాజ్ఞాపకముంచుకొని తమయొద్దకు నన్ను
గానివ్వక నుందురేని నన్నునరికి చంపివేసినట్టయితే మేలనెను.
వీరలనుభవించిన కస్తి మహాగొప్పదనినను, ఉత్తరించుఆత్మలు
తమకు తండ్రిగాను దేవుడుగాను గతిగానున్న సర్వేశ్వరుని
ప్రతాపరమ్యముగల సముఖమునకు రాకూడనందువల్ల, వార
లు అనుభవించుకస్తి ఎంతకఠినమైనదని చెప్పువారలుగలరా?
కని పట్టువారలుగలరా?

పూర్వీకకాలమున ఎసయుడనువాడు తనకు ప్రియ
ముగల పదార్థముమీద ఆశపడి, తన జ్యేష్ఠత్వమును తనత
మ్ముడైన జాకోబనువానికి అమ్మివేసినందుచేత, దానితో సక
లమేలులను రప్పించు తనతండ్రియొక్క విశేష ఆశీర్వాదమును
ను పోగొట్టుకొనెను. వాని భ్రమతీరి, బుద్ధితెలిసిన పిమ్మట
ముందువెనుకు యోచించినప్పుడు, ఈ నష్టమంతా తనతప్పిత
ముచేతనే ప్రాప్తించినదని చక్కగాకనిపట్టి, తానుపడిన దుః

ఖాధికముచేత ఏనుగువలె గీపెట్టి భయంకరముగా అరచి, సహించరాని మనోవేదన అనుభవించినాడని వేదపుస్తకము లో వ్రాయబడియున్నది. ఈ మనుష్యుని వ్యాకులము మితి మించినదనితోచినను, ఉత్తరించు ఆత్మలు అనుభవించెడు దుఃఖమును క్లేశమును వ్యసనమును మనోసంకటమును ఇంతకంటె అధికరించి యుండునని చెప్పుటకు సందేహాము లేదు.

ఏసయుడనువాడు తన భోజనప్రియమువల్లను, స్వేచ్ఛ మనసువల్లను, ముందుచెప్పిన నష్టమంతయు తనకు కలిగినదా నినిగురించి అంతకస్తి చూపించినాడే. ఆవిధముగానే, ఆ యా త్మలు తమ బుద్ధిహీనమువల్లను, స్వల్ప సుఖాంతరమువల్లను, తామే తమనిర్భాగ్యమునకు కారణముగా నున్నదానినిగని, అధికకస్తిపడుదురు. నరకములో సదా బాధింపబడెడు పాపా త్ములు తామిూ పాతాళములో పడియుండునది తమ తప్పే గాని, వేరుకాదని ఎరిగినందుచేత, ఈ తలంపు వారలను ఎడ తెగక కొరుకు మనోపురుగువలెను, విడువకబాధించు మన ఖండనమువలెను ఉండునుగదా ? ఈ తలంపు వారలు పడు వేదనలను ఎంతవృద్ధి పరచునని చెప్పకూడునో ? ఉత్తరించు ఆత్మలోయనిన, తమబాధ నిర్బంధమంతా తనువల్లనే వచ్చిన దనిచూచి అలాగే అధిక కస్తిపడుదురు. కాబట్టి వారలు తమ మిూదనేమొరపడి :-అయ్యోయ్యో ! ఏలాగు ఆయాపాపముల కట్టుకొననైతిమి ? ఏలాగుచెడనైతిమి ? ఈ నిర్భాగ్యస్థలము నకు ఏల రానైతిమి ? ఎందుకు దేవయూడిగమునందు అశ్రద్ధ గానుంటిమి ? ఎందుకు పుణ్యమార్గములో మందగతులముగా నుంటిమి ? ఎప్పుడు మా నిర్భాగ్యము నివారణమగును ? ఎప్పుడు స్వామిదయకు పాత్రులమగుదుము? ఎప్పుడు మోక్ష

పేరింపము నొందుదుము? ఎప్పుడు మాకు సకలమేలుగానున్న సర్వేశ్వరుని ప్రత్యక్షముగా దర్శించుదుము? భూమిలో సంచరించెడు పుణ్యాత్ములారా మీరైనను మామీద దయగానుండి మీ జపతప దాన ధర్మాది సత్క్రియలచేత మాకష్టములను ముగియచేయండి. ఇది మీవల్ల కూడినకార్యము. మాయాప్తసఖులారా, బాధువులారా, తలిదండ్రాదులారా, భార్య బిడ్డలారా మమ్ము మరువగాకండి, మరువగాకండి యని ఈ ఆత్మలు ప్రలాపించి అరిచెడు కేకలశబ్దము మీ చెవిలో సోకినట్లుగా తలంచవలసి యున్నది.

హా! క్రీస్తువులారా, ఈ ఆత్మలమీద మీకు దయ కలిగేటట్టు ఇప్పుడు చెప్పినదానిని చక్కగా ధ్యానించినట్టయితే చాలునని యున్నాము.

అడుగడుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసువా మామీద దయగానుండండి (100 దినముల ఫలము)

జ ప ము.

మట్టులేని కృపనిండిన సర్వేశ్వరా! మీకృప దయాశమునునమ్మి మృతిపొందిన ఆత్మలను కృపాకటాక్షముతో దృష్టించి, నబుఖొదొనొసోరుని చేత ఆవములో వేయబడిన ముగ్గురు పరిశుద్ధ యవ్వనులను అగ్నినుండి కాపాడి రక్షించినలాగే, ఈ ఆత్మలను ఉత్తరించుస్థల నిప్పునుండి విమోచనము చేసి, నిత్యవిశ్రాంతిన్ని, పేరింప మోక్షభాగ్యమునుపొంద మీ సముఖమునకు రప్పించు కొనవలయునని మిమ్ము ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి ఏదొక బీదవానికి వస్త్రమునిచ్చుట.

# అద్భుతము

అర్ఛ్యి. పంచగాయముల ఫ్రాన్సీస్కు కలిగించిన సభలో, అంతోని కోర్సోయనెడు ఒక సన్యాసిగారుండిరి. ఆ సభలో తాముచేసిన సుకృతపుణ్యములవల్ల, తమ శరీరమును నిగ్రహించి, తాము అనుసరించిన అఘోర తపములవల్ల ఒక కిరణమువలె ప్రకాసించుకొని యుండిరి. కాబట్టి అందరును వారిని గొప్ప అర్ఛ్యశిష్టుడుగా భావించుకొని యుండిరి. అట్లుండినను వారు చనిపోయినపిమ్మట, మోక్షపేరింపమునకు వెంటనేపోక, ఉత్తరించు స్థలముయొక్క కఠిన చెరసాలలో ఆపబడిరి. దానినుండి దేవయానతి చొప్పున ఒకనాడు బయలువెడలి, మిగుల దుఃఖముఖము తోనున్న, సహించరాని వేదన అనుభవించు వారుగానును, తాము చచ్చిన మఠములో వ్యాధిగ్రస్థులను విచారించెడు సన్యాసిగారికి తమ్మును చూపించిరి. ఈ సన్యాసిగారోయనిన, ఆ యాత్మను చూచి దిగులుపొంది మిగుల అతిశయముతో చెప్పినదేమనిన: "అంతోని సహోదరుడా, మేము మిమ్మును మోక్షపేరింప గృహములో చేరినట్టుగా ఎంచుకొని యున్నామే, మీరు ఉత్తరించుస్థలములో ఉండుటదేలాగు? మీరచట అనుభవించెడు వేదనలు ఏవని చెప్పుదురుగాక" యనిరి. అందుకు ఆయాత్మయు ప్రతియుత్తరముగా: నేనచట రెండువిధములైన వేదనలు అనుభవించుచున్నాను. చెప్పరాని అగ్ని బాధలను అనుభవించుచున్నాను. అయితే నేను ఎవ్విధ మేలులుగల దేవుడైన సర్వేశ్వరుని ఇంకాచూడకనుండు దానిని గురించి నాకుగల కష్టము, ముందుచెప్పిన అగ్నిబాధకంటె వేయింతలు

అధికరించినదిగాను, ఏమనుష్యుని బుద్ధివలను కనిపట్టకూడనిది గాను యున్నదనుట నిశ్చయము. నేను దేవుడైన సర్వేశ్వరుని చూడ నంతమట్టుకు నావంటి నిర్భాగ్యుడు వేరెవ్వడును లేడు. కాబట్టి మీరు నామీద దయగానుండి, మనసభలోగల సహో దరులందరును, నాకొరకు స్వామిని వేడుకొని, నానిర్భాగ్యము ముగియునట్టు ప్రయాస పడవలయునని ప్రార్థించుచున్నాను, అని చెప్పి అదృశ్యమైపోయినది.

ఆసభసన్యాసులు ఈ సంగతినెరిగి, మిగుల అతిశయ పడినదిగాక, ఆయాత్మకొరకు కఠిన తప దాన ధర్మక్రియలను చేసి, జపములుసల్పి, అనేక దివ్యపూజలను ఒప్పగించిరి.

క్రీస్తుప్రియులారా, ఒక గొప్ప అర్చ్యశిష్టుడుగా సకల పుణ్యములను సాంగోపాంగముగా అనుసరించి, అర్చ్యశిష్టుడుగా మరణము పొందిన ఈ సన్యాసివారు, వెంటనే మోక్షమునకు పోక ఉత్తరించుస్థలములో చాలాకాలముగా నిలుపబడియుం డునపుడు, సకలపాపబురదలో పందివలెపొర్లాడి, లెక్కామిత ములేసి పాపములను కట్టుకొనిన మీరు పాపసంకీర్తనముచేసి చచ్చియుండినను, ఉత్తరించు స్థలములో మీకురాబోవు వేద నలు ఎంతమాత్రమని చూచుకొనండి. వీటినన్నిటిని చక్కగా తలంచి, కాలముండగానే తగిన పరిహారము చేయవద్దా? దానికి పిమ్మట ఈలోక చింతలలో చిక్కుపడిన మీరు, సర్వే శ్వరుని ముఖ ముఖముగా దర్శింపకనుండే వేదన ఎంత గొప్ప దని ఎరుగ కుండినను, ఇది అన్ని వేదనలకంటె గొప్పదిగానుం డునని విశ్వసించి, ఈ వేదనలను రాచేయు పాపములనుచేయ కనుండ మిగుల జాగ్రతగానుండండి.

కడసారి ఉత్తరించు ఆత్మలు అభయశబ్దమిడిచి, తమకు సహాయము చేయవలయునని అంత ఆశతో అడుగునపుడు, మీరు ఆయాత్మలకు కనికరించకనుందురో? మీకు కొంచెము దయయుండి నట్టయితే వారల నిర్భాగ్యము తీరునట్లు మీయొక్క జపములనును, ధర్మములనును ఒప్పగించవలయునని ఎరుగ ఁగలవారలు.

5 జో. 5 ప్రి. 5 త్రిత్వ. చెప్పుట.

స్వామీపాతాళమునుండిమిమ్ము ... ... ...

* సత్యపితా కేసుక్రీస్తునాథుని వెలలేని (13 పుట చూడు.)

---

# 7-వ వేది.

## ఉత్తరించు ఆత్మలు అగ్నిలో అవధి అనుభవించే వర్తమానము.

---

## ధ్యానము.

"బంగారము పుటము వేయబడినట్టు" ఉత్తరించు ఆత్మలు అగ్నివలన శుద్ధీకరింపబడి మోక్షపేరింపము నొందుదురని, వేదపారగులందరు క్రమముగా చెప్పెడు సత్యవాక్యమౌను. శరీరమునువిడిచి ఎడబాసిన ఆత్మము, ఏలాగు నిప్పువలన బాధింపబడుననగా, సర్వేశ్వరుని సర్వవల్లభమువలన అద్భుత విధముగా ఆలాగు నిజముగానే సంభవించుననని అర్థ్యం. అగుస్తీనుస్ వ్రాసిపెట్టెరి. ఆత్మలను కాల్చి చంపకనే, వాటిని కాల్చి శుద్ధము చేయు ఈ నిప్పు ఎంతగొప్ప బాధకరమైనదని ఇప్పుడు కొంచెము ధ్యానించుదుముగాక.

అన్ని బాధలకంటె నిప్పుబాధ అధిక క్రూరమైనదని చిన్నబిడ్డలకు సహా తెలిసిన సంగతిగా నున్నదిగదా? ఒక దేశమును స్వాధీనపరచుకొని ఏలుటకుగాను, ఒకటిరెండు రోజులు, లేక ఒకటి రెండు గంటలకాలము నిప్పులో కాలవల సియుండినట్లయితే, దానికి సమ్మతించే వారలుగలరా? ఈలో కనిప్పు అంత భయంకర వేదనగలదిగానుండునపుడు ఉత్తరిం చుస్థల నిప్పు ఎటువంటిదిగా నుండవచ్చును ?

నిప్పు, రాతిబండలనును, ఇనుము మొదలగు గట్టిలోహ ములనును, వెండి బంగారమునును, వజ్రపురాళ్ళనును కరుగ చేయునే. అయినప్పటికిని ఈ నిప్పు, ఉత్తరించుస్థలములోని నిప్పుకు సమానమని చెప్పవచ్చునో? పరిచ్ఛేదముగా చెప్ప కూడదు.

నబుఖోదొనోజోర్ రాజు, ముగ్గురుపవిత్రులను దహిం చివేయు నిప్పుజ్వాలలను ఏడంతలు అధికముగా రగిలించి తేవ వలయునని మహాకోపముతో కల్పించినాడే. అఘోరముగా మండు ఆ ఆవముయొక్క నిప్పు, ఉత్తరించు స్థలముయొక్క నిప్పుకు సమానమని చెప్పవచ్చునా? అదిన్ని కూడదు.

సోదోంగోమోరనే పట్టణవాసులు మహాపాపద్రోహు లుగా నున్నందుచేత, వీటినిని వీటిచుట్టునుగల పట్టణములనును, బొత్తిగా నాశనము చేయునట్టు సర్వేశ్వరుని కోపముచేత నిప్పులవానకురిసి, ఈ దేశమంతయు నిప్పుచేత నిర్మూలమై పోయినదే. అటువంటి అగ్ని ఉత్తరించుస్థలముయొక్క నిప్పుకు సమానమైనదని చెప్పదగునో? అదిన్ని చెప్పతగదు.

సర్వసంహారకాలము వచ్చునపుడు, ఈ లోకమునును, దానిలోగల మిద్దెమేడలు, కూటగోపురములు, ఊళ్లుపట్టణము

లనును, కొండ పర్వతములనును, సకలమనుష్య జీవజంతువుల నును నాశనము చేయునట్లు, అగ్ని వర్షముకురిసి, సకలవస్తువులను బూడిదగా చేయునే. ఆనిప్పునును ఉత్తరించుస్థలములోని నిప్పు కు సరిపోల్చునది సరియగునా ? అదిన్ని సరికాదు.

ఇప్పుడు చెప్పిన నిప్పులన్నిటికి, ఉత్తరించుస్థలముయొక్క నిప్పు, అధికరించినదిగా నుండుటచేత, దాని యఘోరమును వర్ణించి చూపునది ఏమనుష్యునివల్లను సాధ్యముకాదు. అది ఏలాగనగా: సర్వేశ్వరుని ప్రతాపముగల లక్షణములన్ని మితి లేని మేరగా అన్నిటియందును మనుష్యునియొక్క బుద్ధికిమిం చినవనుట పరమసత్యము. మితిలేనివారి నీతి కోపమువల్ల, ఈ నిప్పుకలిగినదేగాక, మితిలేని వారి పరిశుద్ధతనమునకు తగిన ఆత్మలను శుద్ధీకరించుటకు కలిగించ బడిన నిప్పుగానున్నది. అందుచేత దానిఘోరము మితిమీరి, మట్టులేక, ఉత్తరించు ఆత్మలను ఆవరించుకొని అగ్నిమయముగాచేసి, చావకుండానే కాల్చి, ఏవిధమునందును బాధపరచును. కాబట్టి ఉత్తరించు స్థలములో దేవస్నేహమును నమ్మికయును లేకుండా నుండినట్ల యితే ఉత్తరించుస్థలముకూడా నరకమేయని చెప్పబడును. అర్చ్యశిష్టులు సహితము, అటువంటి నిప్పును తలంచునపుడు, భయపడి వణికి, అయ్యోయ్యోయని కఠిన తపసుచేయుచున్నా రే. మహా పాపాత్ములముగానున్న మనము దానికి భయపడ క, రాతిబొమ్మలుగా నుండునది ఏలాగు ?

మరియు ఈనిప్పు, సర్వేశ్వరుని నీతిచేత రగిలింపబడి, నీతి ప్రకారమే ఆత్మలనుబాధించుననుటకు సందేహములేదు. అదే లాగనగా: ఒకొకడు చేసిన పాపములకును, ఆపాపములక్రూరత్వ మునకును, లెక్కకును, దండనయును తగినదిగానుండును.

ఒకటి రెండు పాపములకును, నూరు, వేయి పాపములకును, అస
ఢ్ఢచేతకట్టుకొనిన పాపములకును, మనసాక్షి తెలిసికట్టుకొనిన
పాపములకును, ఆత్మలను ఆనిప్పు వేరు వేరువిధముగా బాధిం
చుననుట తప్పని సత్యమగును. సర్వనీతిగల సర్వేశ్వరుడు
ఏపుణ్యమునకును సంభావన దయచేయులాగు, ఏపాపమునకును
దండనవిధించక విడిచిపెట్టరు. ఇది ఇట్లుండగా లెక్కా మితము
లేక భయ భీతిలేక పాపముకట్టుకొనుచున్న మీకు, ఏమేమి
సంభవించునని చూడండి.

ఇదిన్నిగాక ఉత్తరించుస్థలములో, ఆత్మము తన శరీ
రముతో కలిసియుండకపోయినను, ఈ శరీరమును గొనిన్ని
దీని పలుఅవయవములను గొనిన్ని చేసినపాపముల నిమిత్తము
ఆత్మము ఆయా అవయవములలో బాధించబడులాగు, వేదన
అనుభవించునని శాస్త్రిలు చెప్పుచున్నారు. అబద్ధము, అప
దూరు, అపవిత్రమాటలు ఈ మొదలగు నోటిపాపములకు
నాలుక కాలినట్టుగానును, కానిమాటలను, సుఖభోగపాట
లను, మోహావిషయమునను ప్రియముతో వినిన పాపములకు
చెవులలో నిప్పుప్రవేసించినట్టుగానును, దొంగతనము హత్య
మొదలగు చెడుపనులుచేసినందుకుగాను రెండుచేతులు నిప్పు
లో కాలునట్టుగాను, తగని తలంపులు దురాలోచనలు చేసినం
దుకుగాను, తలలోని మెదడు ఉడికినట్టుగాను, భోజనప్రియ
మునిమిత్తము ప్రేగులు మండునట్టుగాను, ఆత్మము ఆయా
బాధలన్నిటిని ఏకముగా అనుభవించును.

ఇప్పుడు వివరించినవాటినన్నిటిని యోచించి ధ్యానిం
చునపుడు, మనసుకరగి, బుద్ధితడుమారి, ప్రజ్ఞతప్పి అయ్యో
య్యో ! ఏలాగుసహించకూడునని భయమును గుర్గరింపును

కలుగుచున్నదిగదా ? అయితే ఈ భయము అప్రయోజనమై పోకుండా మేము చెప్పేదానిని వినండి. ఒక మునీశ్వరుడు పాప ముకట్టుకొనపిశాచి వారికి తంత్రశోధన పుట్టించినపుడు, నరక నిప్పును సహించవచ్చునో, సహించకూడదోయని పరిశీలించు లాగు, తమరెండు కాళ్లను నిప్పులోనుంచిరి. సహించవలయు నని ప్రయాసపడినను కొంచెముసేపైనను సహించ కూడక వెనుకకుదీసి, నాటినుండి భయముతో అర్చ్యశిష్టుడుగా జీవించిరి.

క్రీస్తువులారా ! ఉత్తరించుస్థలము నిప్పు నరక నిప్పుకు సమానముగా నున్నందుచేత, దానిని సహించకూడునో ? సహించకూడదోయని శోధించ, ఈ మునిచేసినట్టుచేయండి. సహించకూడనట్టయితే ఈ నిప్పులో పడకుండునట్టు తగినలా గునడువవలసినది.

వర్తకుడు అప్పు తీయుటకు ముందుగానే వాటిని తీర్చు ఉపాయమేమని యోచించునుగదా ? అలాగు యోచించక, అప్పుమీద అప్పు చేసినట్టయితే వాడు బాత్తిగా మునిగి పోవుట తప్పదు. మీరును అలాగు ఏపాపము నయినా చేయుటకు ముందు, ఈపాపమునకు నరకములోనైనను, తప్పితే ఉత్తరించుస్థలములోనైనను అప్పుతీర్చులాగు, ఉత్తరించవ లయునని తలంచవద్దా ? దానిని తలంచనట్టయితే మీకు బహుకష్టములను సంపాదించుకు నేదిగాక, నిత్యనరకమునకు పోవు మహా ఆపత్తులో దొరకుకొనుదురనుటకు సందేహ ము లేదు.

మీ బిడ్డయైనను, మీ భార్యయైనను, వేరే ఏమను ష్యుడైనను నిప్పులో పడుటను చూచినట్టయితే, ఎంతజాగ్రత తోను, ఎంతకష్టముతోను వారలను వెలుపలికీడ్చ ప్రయాస

పడుచున్నారు. మీ కొడుకుగాని, కూతురుగాని,తల్లిగాని,తండ్రి గాని పినిమిటిగాని, భార్యగాని ఈ లోక నిప్పుకన్న వేయంతలు అధికముగా మండు ఉత్తరించుస్థల నిప్పులో కాలిపడియుండు టను చూచునపుడు, వారలను రక్షింప ఏమియున్ను చేయకనుండ కూడునో ?

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసువా మామీద దయగానుండండి. (100 దినములఫలము)

## జ ప ము .

దేవుడైన సర్వేశ్వరా ! విశ్వాసముయొక్క ముద్రతో మాకంటె ముందుగా చనిపోయినటువంటి, దేవరవారి సమాధానమందుండెడు స్త్రీ పురుషులైన మీ యాడిగస్తులను తలంచ నవధరించండి. ఏలినవారా ! హీరలకును, జేసుక్రీస్తు నాధునియందు మృతిపొందిన తక్కిన వారలందరికిని, నిత్యవిశ్రాంతినిని, అస్తమించని ప్రకాశమునును, కష్టదుఃఖములేని సమాధానమునును కృపతో దయచేయవలయునని దేవర వారిని ప్రార్థించుచున్నాము స్వామీ......ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలను గురించి ఒక్కప్రొద్దుగానుండుట, కూడనట్టయితే ఒక భిక్షగానికి అన్నముపెట్టుట.

## అ ద్భు త ము .

ముక్తిభాగ్యముపొందిన రకోనిక్ కత్తరేనమ్మగారు ఉత్తరించు ఆత్మలమీద మిగుల భక్తిగా నుండినందుచేత, వారల వేదనలను తగ్గించ మహాతపకృత్యములను చేసుకొని వచ్చును. ఒకనాడామె, కఠిన జ్వరముగాపడి, అధిక బాధపడు

చుండునపుడు తనకు ఓర్పు కలిగేటట్టు ఉత్తరించు ఆత్మలనుతలం చుకొనియుండినది. అపుడు దేవకృపచేత పరవశమై, ఉత్తరించు స్థలములో అఘోరముగా మండు అగ్ని విస్తారమును కనినది. మరియు, ఆయగ్ని ఎంతక్రూరమైనదని, ఆమె ఎరుగునట్టుగాను, ఆత్మలమీద ఆమెకింకా అధికభక్తి రాతగ్గట్టుగానను దేవయానతిచేత ఆ నిప్పునుండి ఒక చిన్నరవ, ఆమె ఎడమచెంపమీద పడినది. తోడనే దానినుండి గొప్పగాయమై ముఖమంతావాచి, అమెకు సహింపరాని బాధ కలిగినది. ఈమెను చూచు వారలందరికి ఈమె: ఈ లోకములో రాతగిన నొప్పి యుపద్రవబాధలన్ని, ఈ చిన్న నిప్పురవ నాకు రప్పించుచున్న కష్టమునకు ముందు ఏమిలేనట్టుగా నున్నదనును.

అర్చ్య. సామినాథులు కలిగించిన సభలో, స్తానిస్లాసనెదు పేరుపోయిన ఒక గురుస్వాములవారుండిరి. వారొకనాడు, అగ్నిచే ఆవరింపబడియున్న ఒక ఉత్తరించు ఆత్మను కనిరి. ఆయాత్మను జూచి: నిన్ను బాధించు నిప్పు లోకములోని నిప్పుకంటె అధికవేగము గలదాయని అడిగినందుకు, ఆ యాత్మ ము ప్రత్యుత్తరముగా: భూలోకములోని నిప్పంతయు నన్ను దహించు ఉత్తరించు స్థలముయొక్క నిప్పుతో సరిపోల్చినట్టయితే ఈలోక నిప్పు చల్లనిగాలికి సమానముగా నుండు ననినది. మరల గురుస్వాములవారు :- నేను దానియఘోరమును పరిక్షింప వచ్చునా యనినందుకు, ఆయాత్మము :- ఈలోకమందలి ఏమనుష్యుడును దానిని కొంచెమైనను సహించలేడనినప్పటికి, మీచేతిని కొంచెము చాపండి, కొంచెము చూతురుగాక యనినతోడనే, తననొసటినుండి ఒక బొట్టుచెమట పడినట్టు ఆగురువుచేతిలో పడినది. అందుచే గురు

పుతువచ్చిన అధిక వేదనచేత పెద్ద కేకలు పెట్టి, నేలమీదపడి చచ్చునట్టుగానుండిరి. ఆశబ్దమునువిని, తక్కిన సన్యాసులు పరుగెత్తివచ్చి ఏమని అడుగగా, వారు గడగడ వణకుచు, తమచేయిచూపించి నడచినసంగతిని వివరించిరి. వారు ఇంకా ఒకసంవత్సరము తమకుగలగాయముచేత చెప్పరాని వేదనలను అనుభవించి చావబోవు సమయములో దగ్గిరనున్న వారలను చూచి, సహోదరులారా! ఇంత భయంకరమైన వేదనలను మీరు అనుభవించ పోకుండునట్టు, మీచేతనైనంత మట్టుకు ఎవ్విధపాపములనును విసర్జించవలసినదిగాక, చేసిన పాపములకు ఎప్పుడును తపసుచేయండిఅని చెప్పి మరణముపొందిరి.

క్రీస్తువులారా! ఈ గురువు చెప్పిన వార్తలు మీకే చెప్పినలాగు ధ్యానించి ఎప్పుడును తలంచగలవారలు.

5 జో్య-5 ప్రియ-5 త్రిత్వ... చెప్పుడు

స్వామీ పాతాళమునుండి మిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని. (13 పుట చూచు)

---

# 8 వ-త్రేధి.

## ఉత్తరించు ఆత్మలు ఎంతకాలముదాకా ఉత్తరించు దురని చూపించే వర్తమానము.

---

## ధ్యానము.

ఒకస్వల్ప వేదనయైనను బహుకాలముగా దానిని అనుభవించవలసి యుండినట్టయితే, పెద్దదియై సహించరాని కష్టముగా తోచుననుటకు సందేహములేదు. పోయిన ధ్యానములలో చూపించినలాగు, ఉత్తరించుస్థలముయొక్క వేదనలు,

అంతకఠినమును ఘోరమైనవిగా నుండుటచేత వాటిని బహు సంవత్సరములు అనుభవించుటయే ఎంతటికష్టముగానుండునని ఇపుడు యోచించుకొనవలసినది.

మహా శాస్త్రియైన పెల్లార్ మీాన్సనేవారు ఈవిషయముపై వ్రాసినదేమనిన, కొన్ని ఆత్మలు ఉత్తరించుస్థలవేదనలలో పది, ఇరువది సంవత్సరముల కధికమును, నూరు, ఏనూరు సంవత్సరముల కధికము ఉపాధింపబడుచునున్న వీమ్మాట, తాము చెప్పుదానిని అనేక యుదాహరణములవల్లను, వేదపారగుల వాక్యములవల్లను, కొందరు అర్చ్యశిష్టుల దర్శనములవల్లను ఒప్పించుకొని వచ్చుచున్నారు. వీటినన్నిటిని ఇచట వివరించుటకు తావులేక, ఒకటిరెండు న్యాయములను మాత్రము చెప్పి చూపుదుము. అదేలాగనిన,

నీతిగలవారును సకలము నెరిగినవారుగానున్న సర్వేశ్వరుడు, సకలమైన సత్క్రియలకు మోక్షములో సంభావన దయ చేయుచున్నలాగే, సకలమైనపాపములకు దండన విధించును రనుట, తప్పులేని సత్యవిశ్వాసమగును. అందుచేత ఒక మనుష్యునికి సంభవించబోవుదండన ఎంతయని కనిపట్టుటకు వాడు చేసినపాపములను లెక్కచేసి చూడవలసినదిగదా? ఈవిధముగా మొట్టమొదట క్రీస్తువుడైన ఒకమంచి మనుష్యుని స్వల్ప పాపములను ఉద్దేసించి లెక్కించుకొనవచ్చును. నీతిమంతుడు సహితము రోజు ఒకటింటికి ఏడుసారులు తప్పితము కట్టుకొనును నసి సత్యవేదపుస్తకములో వ్రాయబడియున్నది. ఇపుడు మేము గురించెడు మనుష్యుడు ఒకరోజుకు పదిస్వల్పపాపములు చేయునట్టుగా లెక్కచేయుదము. ఒక సంవత్సరములో మునూ్నట అరువదిరైదు దినములున్నందుచేత ఆ మనుష్యుడు రోజు ఒక

టింటికి పదితప్పులు చేసే లెక్క ప్రకారము ఒకసంవత్సరములో 3650 పాపములను కట్టుకొనుచున్నాడు. పది సంవత్సరములకు పిమ్మట 36 500 పాపములు వాని లెక్కలో చేరియుండునుగదా? ఈ మనుష్యుడు ఇంకా వేరే పదిసంవత్సరములు బ్రతికియున్న ట్టయితే 73000 పాపములను చేసియుండునే. అలాగు ఇరువది సంవత్సరములలోగా డెబ్బది మూడు వేల పాపములను చేసియు న్న మనుష్యుడు, సర్వేశ్వరుని నీతికి పరిహారముగా ఎటువంటి దండనకు పాత్రుడుగా నుండవలసినది ? ఒక పాపమునకు ఒక నాడుమాత్రము ఉత్తరించే స్థలములో ఉండవలసినదిగా నున్న ట్టయితే ముందు చెప్పిన మనుష్యుడు, డెబ్బది మూడు వేల దినములు ఆ అఘోరఅగ్నిలో కాలవలసినది. ఆ డెబ్బది మూడు వేల దినములు సర్వేశ్వరుని చూడక నుండవలసినది. డెబ్బదిమూడు వేల దినములు ముందు చెప్పబడిన వేదనలను అనుభవించ వలసినది. డెబ్బదిమూడు వేల దినములు జ్వరము తోను, లేక పల్లునొప్పితోను తలనొప్పి కడుపునొప్పితోను బా ధపడి పడియుండ వలసినట్టయితే సహించ వచ్చునో చెప్పండి. ఆపాపములు స్వల్ప పాపములనినను అవి ఆమాత్రము లెక్క మొత్తమగుచున్నవి యనిచూచి, అటువంటి దండనకు కారణ మగుచున్న వనుట చేత, వాటిని స్వల్పకీడుగలవని చెప్పను ప్పునా? భయములేక కట్టుకొనకూడునాయని అర్చ్య. అగు స్తీనుస్ అడుగు చున్నారు.

దేవనీతికి 73000 దినములు అప్పుపడిన ఈ మనుష్యు డు మంచి క్రీస్తువుడనియు, చావైనపాపములను కట్టుకొనని మనుష్యుడనియు ఎంచి ముందు చెప్పిన లెక్క తేల్చితిమి. అయితే ఈ లోకములో అటువంటి మంచి మనుష్యులు కొం

చెము మంది మాత్రము తక్కిన అందరును సాధారణముగా అనేక చావైనపాపములను కట్టుకొనేవారలని మీకు బాగా తెలిసినకార్యమే. కొందరు ఏదోక భయభీతిలేక, సిగ్గుహీనము లేక, ఇరువది, ముప్పది సంవత్సరములదాకా మోహాపాపములో మునిగియుండి, ఇంకాకొందరు విసువని మనస్తాపముతో పగగానుండి, మరికొందరు పరులసొత్తును అన్యాయముగా అపహరించుకొని తిరుగా ఉత్తరించకనుండి, వేరుకొందరు అహంకారముచేత పొంగి తిరుసభ పెద్దలకు లోపడక, కొందరు బుద్ధిచెడేటట్టు మట్టుదిట్టములేక కల్లు, సారాయి, అభిని గంజాయివలనచెడి, ఈ మొదలగు ద్రోహాములను కట్టుకొని పరమ పాపిష్టులుగా నుంటున్నారుగదా? ఇటువంటిఘన పాపాక్రమములను కట్టుకొనినపిమ్మట చావబొయ్యే టప్పుడు ఒకగంట ఆయత్తముచేసి, బానిస మనస్తాపపడి, మంచి పాప సంకీర్తనము చేయుదురనుట నిజమని ఒప్పుకొనినప్పటికి, అంతటితోయావత్తు ముగిసిపోయినదని తలంచులాగు, పాపములకు అపరాధముగా ఏదోక పరిహారముచేయను, ఏదోక జపముచేయను, ఏదోక తపసుచేయను, ఏదోక దాన ధర్మము చేయను చూచుటలేదే. మరల మరల వారలు అనేకపాపములు కట్టుకొనుటయేగాక, ఏదోక ఉత్తరింపునును పరిహారమునును చేయువారలుకాదు: అలాగు తమకు మంచిసౌఖ్యము, ఆయుసు ఉన్నంతవరకు దుర్మార్గముగా నడచినపిమ్మట, కడసారి సర్వేశ్వరుని కృపచేత మంచి పాపసంకీర్తనముచేసి, అనేకులు యిష్టప్రసాదముతో చనిపోదురు. అయితే ముందు చెప్పిన మంచి మనుష్యుడు, తాను కట్టుకొనిన స్వల్పపాపములకు 73000 దినములు ఉత్తరించు స్థలములో ఉత్తరించవలసినదిగా

నుండినట్టయితే, ఇటువంటి చావైనపాపములను చేసినవారలు మంచి పాపసంకీర్తనముచేసి చచ్చియుండినను, ఎంతకాలము ఉత్తరించవలయునో, మీరే యోచించి చెప్పండి. కాబట్టి అర్చ్య. సిప్రియానుస్ వ్రాసినలాగు కొంతమంది ఓర్పుపొందిన పాపాత్ములు, లోకముగింపువరకు ఉత్తరించు స్థలములో బాధింప బడుదురని చెప్పవలసినదిగా నున్నది.

చేసిన స్వల్పపాపములకును కట్టుకొనిన చావైన పాపములకును ఈ లోకములో, దానధర్మ తపజపముల వల్లను, తిరుసభ ఫలముల వల్లను, పరిహారము చేయవచ్చుననుట సత్యము. అయితే తమపాపముల నిమిత్తము జపములు చేయువారలును, ధర్మమిచ్చు వారలును, తపకృత్యములను అనుసరించు వారలును, తిరుసభ ఫలములను పొందే వారలును బహు కొంచెముమంది మాత్రమేనని మీరుకూడా చెప్పుదురు. ఎచ్చుతక్కువగా అందరును, ఈలోక సుఖభాగ్యములను, ఆస్తి ద్రవ్యములను, మహిమశ్లాఘ్యములను, ఒంటికి అలంకారమైన వస్త్రాభరణములను, నోటికి రుచికరమైన పదార్థములను మహా ఆపేక్ష గమనముతో వెదకుటయే గాక, వారలకు తపసనే పేరుకూడా తెలియదు. ఇట్లుండగా వారలు దేవనీతికి చెల్లించవలసిన సకలమైన ఋణములతో చచ్చి ఉత్తరించు స్థలములో బహు సంవత్సరముల కాలము బాధింప బడుదురనుట తప్పదు.

వారలు ఉత్తరించు స్థలములోనుండునపుడు, వారల నిమిత్తము చేయబడు జపములవల్లను, చేసిన దానధర్మముల వల్లను చేయించిన దివ్యపూజలవల్లను వారల అవధి తగ్గింపవచ్చుననుట నిజము. అయితే తోమాస్ అకెంపిస్ అనువారు చెప్పులాగు, జీవముతోనుండునపుడు తన్నుతాను మరచిపోయి

న వానిని, చచ్చిన తరువాత తలంచేవారలు ఎవరు ? అలాగే మీకును సంభవించునో ఏమోయని తలంచుటకు చచ్చిన మీవారల ఆత్మమునిమిత్తము ఇప్పుడు మీరేమిచేయుచున్నారని చూడండి. చనిపోయిన మీతలిదండ్రి, బంధువులు, ఉపకారులు, స్నేహితులు, స్వకీయులకొరకు ఏమిచేయుచున్నారు? ఎన్ని జపములుచేయుచున్నారు ? ఏమిధర్మముల నిచ్చుచున్నారు ? ఏమిమంటతపసుచేయుచున్నారు ? ఎన్నిపూజలు చేయించుచున్నారు ? బహు కొంచెముమాత్రమే చేసితిమనినట్లయితే, నిశ్చయముగానే అలాగేమీకున్ను బహు కొంచెము మాత్రము చేయుదురు. మిమ్మును అందరును మరచి పోదురనులాగు, మీరు ఉత్తరించుస్థలములో ఎన్నోసంవత్సరములు పడియుందురని ఉద్దేసించి చూడగలవారలు. ముందుచెప్పిన న్యాయములచేత, ఉత్తరించుస్థలముయొక్క వేదనలు మిగుల కఠినముగా నుండేదిగాక వాటిని అనేకఏండ్లు పరియంతము అనుభవించవలయునని చూపించినట్లయినది. దానిమీదమీరు బాగా యోచన చేయవలసినదని ఎరుగ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసువా మామీద దయగానుండండి ( 100 దినములఫలము )

# జ ప ము .

నిత్య పితయైన సర్వేశ్వరా ? మాతలిదండ్రులను గౌరవించవలసినదని ఆజ్ఞాపించితిరిగదా ? మృతిపొందిన మాతలిదండ్రుల ఆత్మమునిమిత్తము మేముచేయు మనవులనాలకించి, కృపతో వారల పాపములను ఓర్చి, మేము వారలను నిత్య ప్రకాశముగల మీరాజ్యములో సదాదర్శింప కృపచేయువల

యునని దేవరవారిని ప్రార్థించుచున్నాముస్వామీ...ఆమెన్
చేయవలసిన సత్క్రియ.

చనిపోయిన మీ తలిదండ్రులను తలంచి వారల నిమిత్తము ఏమిసత్క్రియలను చేసినారనియు, ఏమి చేయబోచున్నారనియు యోచించుట.

# అద్భుతము.

1644 సంవత్సరములో రాజగోత్రము నందుద్భవించి, కీర్తిపొందిన ఒక ప్రభువు తన బావమరిదియైన మరియొక ప్రభువుతో కలహించిన నిమిత్తము వారలలో నొక ప్రత్యేక జగడము కలిగినది. ఆప్రత్యేక జగడములో ముందుచెప్పిన గొప్ప ప్రభువు ఈటెచేత రొమ్మున పొడవబడి, వెంటనేపడి చచ్చెను. ఇటువంటి ప్రత్యేక జగడములు చేయరాదని తిరుసభ నిషేధించి యున్నందుచేత, చనిపోయినవాని ఆత్మము నిమిత్తము దేవాలయములలో ఏదొకసాంగ్యము జరిపినదిలేదు. వాని ప్రేతమును మంత్రించబడిన సమాధిలో పెట్టబడినదియు లేదు. ఆప్రభువు పాపసంకీర్తనము లేకుండా, అకస్మికముగా చచ్చినందుచేత నరకానికి పోయినాడని అందరును నిశ్చయముగా నమ్మి యుండిరి. అర్చ్య ఫ్రాన్సీస్కు సలేసియుస్‌గారు కలిగించిన సభలో, పుణ్యాత్మురాలైన ఒక కన్యస్త్రీ ఆకాలములో ప్రకాసించుచుండినది. సర్వేశ్వరుడామెకు, ఆదొర జీవముతోనున్నపుడు చేసిన, కొన్ని ధర్మక్రియలనుగురించి స్వామి విశేష కృపచేత వాడు చనిపోవుసమయములో ఉత్తమమనస్తాపపడి నిత్యనరకమునకుతప్పి ఉత్తరించు స్థలములలోనున్నట్టుగా తెలియచేసిరి.

వాను ఉత్తరించుస్థలములలో, బహుకాలముగా ఉత్తరించతీర్వపొందినాడని, కన్యస్త్రీచూచి, వాని వేదనను తగ్గించతేన జపధ్యానములనును, కఠినతపక్రియలనును, ఒప్పగించినది. అలాగు బహుకాలముచేసినపిమ్మట, ఆయాత్మముయొక్క వేదన కొన్నిగంటలకాలముగా తగ్గినదని, సర్వేశ్వరునివల్ల ఎరిగించబడినది. ఈ సంగతి తక్కిన కన్యాస్త్రీలకు సంతోషముతో ఎరిగించినంతట, వారలు అంత స్వల్పఆరుదలకు ఇంతసంతోషపడనేలయని అడిగినందుకు ఆమె:ఆయాత్మముయొక్క వేదనలు కొద్దిగడియలుమాత్రము అమరిక పొందియుండినదానిని, అల్పఆరుదలగా నెంచకండి. కొంతసేపు ఉత్తరించుస్థలములో బాధనొందుటకన్న ఈలోకములో అనేక సంవత్సరములు కఠినవ్యాధితో కష్టపడునది సులభమనినది.

మరియు ఆపుణ్యవతి, యానిర్భాగ్యమైన ఆత్మనుగురించి పది సంవత్సరములు ఒక్కప్రొద్దుగానుండి, చేయకూడిన తపక్రియలన్నిటిని చేసి, ఎడతెగక జపించుకొనియుండినది. దానికి పిమ్మట ఈఆత్మకు విధింపబడిన వేదనలలో ఒకభాగము తనకు పంపించవలయునని సర్వేశ్వరుని ప్రార్థించినది. సర్వేశ్వరుడు ఆమె విజ్ఞాపనకు కనికరించి, ఒక ఘోరమైనవ్యాధి ఆమెకు పంపించినమీదట, ఆమె శరీరమంతయు కఠినమైనొచ్చి వేగముగా శుష్కించి ఆమె కాళ్ళుచేతులు సహించరాని శీతలమువల్ల తిమురెక్కి, అమెమనసునందు వవిధ కష్టక్లేశమును కలుగనైనది. ఈమె దీనినంతయు ఆయాత్మము నిమిత్తము చేసియుండినను ఆయాత్మము ఉత్తరించు స్థలమునుండి పూర్ణముగా రక్షించకూడకనే చనిపోయినది.

క్రీస్తువులారా! ముందుచెప్పిన అద్భుతముచేత ఉత్త

రించు స్థలముయొక్క వేదనలు ఎంతకఠినముగా నున్నవో, ఎంతకాలము అనుభవించవలయునోయని యోచించి, అక్కడికి మీరు పోకుండునట్టు తగిన విధముగా నడువవలసినదిగాక, దానిలో వేదన అనుభవించు ఆత్మలనుగురించి సోమరితనము లేక, విసుగులేక, అశ్రద్ధలేక, ఎల్లప్పుడును జపము చేయవలయునని ఎరుగ గలవారలు.

5 జ్యో- 5 ప్రి- 5 త్రిత్వ......చెప్పుట.

స్వామీ పాళమునుండి మిమ్ము..........

* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని (13 పుట చూడు.)

# 9-వ తేది.

## ఉత్తరించుస్థలముయొక్క వేదనలవల్ల ఉత్తరించు ఆత్మలకు ఏదొక పుణ్యఫలము కలుగుట లేదనియు, అది జీవించియుండే వారలవల్ల మాత్రమే కలుగుచున్నదనియు చూపించే విశేషము.

---

# ధ్యానము.

ఎవడును పనిచేయకూడని రాత్రికాలము వచ్చునని, జేసునాథుడే వచనించియున్నారు. ఈ దివ్యవచనమునకు అర్థమేమనగా :-చచ్చినతరువాత ఎవడును ఏదొక ఫలముగల పుణ్యమును చేయకూడదనియు, సంభావనరప్పించు ఏదొక ధర్మమును చేయకూడదనియు వేదపారగులందరును చెప్పుచున్నారు. కాబట్టి సకల మనుష్యులును తమకు జీవమున్నపుడే, మోక్షమును బహుమానమును రప్పించు ఎవ్విధ పుణ్యములనును ధర్మములనును మహా చురుకుతో చేయవల

సినదేకదా ? జీవితకాలములో తగినలాగు చేసినదంతయు ఫలించును; తపసువల్ల అధిక సంతోషమునను, జపమువల్ల అధిక మనోహరమునను; ధర్మమువల్ల అధిక ప్రతాపమునను పొందవచ్చుననుట సత్యమగును. ఉత్తరించు స్థలములోనో యంటే అలాగుకాదు, దానిలో అనుభవించెడు మాటలయుం డును తలంపు నందును అణగని బాధలన్ని ఉత్తరించవలసిన అప్పుమాత్రమే ప్రయోగించునుగాని, వాటివల్ల మోక్షము లో ఒక అల్పప్రయోజనమును కొంచెపు బహుమానమును లభించుటలేదు. దానిలో ఆత్మలుచేయు జపములచేత తమవే దనలు కొంచెమైనను తగ్గిపోవుటలేదు. సర్వేశ్వరుని కోపాగ్ని చల్లారునదిని లేదు. దానిలో, మోక్షముమీాద ఆ యాత్మలు పడెడు ఆపేక్షలచేత వారలకు అధిక సంకటము కలుగుచున్న దేగాని దానిచేత ఒక క్షణమునకు ముందు మోక్షభాగ్యము దొరక పోవునదిలేదు. కాబట్టి తాము పడునదంతా మిగుల క్రూరమైనదైనను తమకొక అల్పప్రయోజనమును కలిగించుట లేదని చూచి ఈ ఆత్మలు అధికవేదన అనుభవించు చున్నవి యనుటకు సందేహములేదు.

జెరుసలేం మహా నగరమునందు వ్యాధి వారలకు ఆరోగ్యమురక్షించు సిలోయనెడు ఒక కోనేరుఉండినది. దాని లో ప్రతిదినము గురింపబడిన సమయమునందు మొదటముని గెడు ఎటువంటి వ్యాధిగ్రస్తునికైనను వ్యాధితీరి పూర్ణ సౌఖ్య మగును. ముప్పదియెనిమిది సంవత్సరములనుండి తిమ్మిరు వాతముగల రోగియొకడు ఆ కోనేటిగట్టున బహుదినములు కాచుకొని యుండినను తన్ను పట్టుకొనిపోయి కోనేటిలో దింపెడువారు లేక, ఆరోగ్యమునిచ్చు ఈ జలములో దిగుటకు

శక్తిలేనివాడై యుండెను. అందుచేత ఈ వ్యాధికానికిగల దుఃఖవ్యసనము, విసుకు కొంచెమని చెప్పకూడునో ? ఉత్త రించు ఆత్మలకు అలాగే సంభవించును. ఈ ఆత్మలు తమకు తామే ఏదొక సహాయము చేసుకొన కూడదనుటచే, తమకు ఇతరులనుండి సహాయము రానందుచేత, తమ ఉత్తరింపు కాలము ముగియునంతవరకు మిగుల కష్టిజెంది బాధపడునురు. తక్కిన అనేక ఆత్మలు తమనిమిత్తము చేసిన జపతప దాన ధర్మ పుణ్యములవల్ల శీఘ్రముగా మోక్షముకు పోవుటనును, తమకు యితరులు సహాయము చేయకనుండుటనును చూచి ఆ యాత్మలకు ఎంతకష్టి కలుగునని కనిపట్టువారలు గలరా ?

మఖబేయుల రెండవపుస్తకము ఏడవ అధ్యాయములో వ్రాసియుంకులాగు, ఆకాలములో ఒకతల్లినిని ఆమె ఏడుగురు బిడ్డలనును పట్టుకొని కూరుడైన అంతియోకుక్ రాజు సత్యవే దమునిమిత్తము వారలను బాధించునపుడు, ఆవేదనలచేతనే మోక్షములో తమకుఅధికమహిమయును భాగ్యమునుసంతో షమును కలుగుననెడు నమ్మికమువల్ల, అజ్ఞానులందరును అతి శయపడ, పీడని ఓర్పుతోను, ఆనందసంతోషముతోను, అవే దనలను అనుభవించి మహిమకు చనిపోయిరి. ఉత్తరించు ఆత్మలోయునిన తాముపడెడు బాధలచేత కొంచెమైనను బహు మానము రాని దానినిగురించి అధికబాధ పడుదురేగాక వేరు కాదు. భూమిలోనుండువారలు ఒకచిన్న జపమునైనను చేసి నట్టయితే, లేక ఒకకాని, ధర్మముచేసినట్టయితే, లేక అల్పక ష్టమును సర్వేశ్వరుని గూర్చి సహించినట్టయితే వారలకు ఫల ముంచుటయేగాక, దానికి తగినలాగు మోక్షములో బహు మానము చిక్కును. వేదసాక్షులందరును అనుభవించిన బాధ

లకంటె, ఉత్తరించు ఆత్మలు అధికక్రూరమైన బాధలు అనుభవించినను అందుచేత వారలకు ఏబహుమానమును లేదు. కాబట్టి ఏవిధమునందును వారల వేదన అధికరించునేగాని వారలకు అల్ప ఆదరుదల మొదలుగా రాగానము.

కొంచెమైనను ఆయాత్మలకు వెలుపలనుండి ఆదరుదల సహాయము వచ్చునో ? ఆలాగు వచ్చునది సందేహముగా నుండుటయేగాక.ఆలాగువచ్చినను బహుకొంచెముగానుండును. అది ఏలాగననగా: పూర్వవేదములో, పేరుపొందిన పితాపిత్రుడైన జోజేపనువారు తమసహోదరుల అసూయవైరాగ్యముచేత దాసునుగా అమ్మబడి, అన్యాయముగా తమమీదమోపబడిన లేని తప్పితమును గురించి చెరసాలలో వేయబడి, మిగుల కష్టపడుచుండిరి. దానిలో తమకు తోడుగా చెరబడిన రాజుయొక్క సేవకునికి గొప్పసహాయముచేసినందునుమీద జోజేపువానితో చెప్పినది: "నీవు నీయుద్యోగములో తిరుగాఅమరి క్షేమముగా నున్నపుడు నన్నుతలంచి నా మీద దయగలిగి రాజుయొద్ద నా కొరకు మాట్లాడి నన్ను ఈ చెరలోనుండి విడిపించులాగు చేయువలయునని ప్రార్థించుచున్నాను" అనిరి. అట్లుండినను ఆమనుష్యునికి సకలము సఫలమైనను తనకు ఉపకారముచేసిన జోజేపును మరచి పోయెను. ఉత్తరించు ఆత్మలకుకూడా అనేకమారులు ఆలాగు సంభవించునది నిశ్చయము. బిడ్డలు తమ తలిదండ్రులనున్ను, తలిదండ్రులు తమ బిడ్డలనున్ను, స్నేహితులు తమ యిష్టులనున్ను, యిష్టులు తమ స్నేహితులనున్ను, ఉపకారము పొందిన వారలు తమకుమేలు చేసిన వారలనును మరచి పోయి, వారల అవధిని తీర్చ ఏమిన్ని చేయక పోదురు. ఏదైనను చేయుదురేని మిగుల కొంచె

ముగా నుండును. చనిపోయిన వారలు ఉత్తరించు స్థలములో సహించరాని వేదన అనుభవించునపుడు, వారలబిడ్డలును, స్వీయబంధువులును, ఊరివారలు స్నేహితులును, ఆ చచ్చిన వారల ఆస్తి బాస్తిని స్వతంత్రించుకొని తృప్తిగాతిని, సొగసుగా అలంకరించుకొని, ఆడిపాడి, ఉల్లాసము కొనియాడి వారలనిమిత్తము ఏమిన్ని చేయడములేదు. అందుచేత అంత కష్టపడు ఆత్మలు ఏదొక సహాయములేక తమకు విధింపబడిన ఉత్తరింపునంతటిని ఉత్తరించియే తీరవలసినదిగా నుంటున్నది.

క్రీస్తువులారా! మీరును మీవారల ఆత్మలకు సహాయముచేయక వారలను మరచి పోయెదరా? వారలను మరచి పోయెదరేసి అది గొప్పఅన్యాయమైన క్రూరత్వమని ఇప్పుడు వినిన ధ్యానమువల్ల మీకు తోచడములేదా? కాబట్టి మీరు చేయునదంతయు, వారలకు ఆదరువుగా నుండునట్టు మంచి మనసుతో సర్వేశ్వరునికి ఒప్పగించవలసినది. జీవ్యకాలము ఫలముగలకాలమనియు, కోతకాలమనియు, మహిమ సంభావన రప్పించుకాలమనియు, చక్కగా విచారించి, రాత్రి కాలమైన చావువచ్చుటకుముందే మీరందరును పలువిధపుణ్యములనును చేయ ప్రయాసపడగలవారలు.

నానావిధ కష్టసంకటములుగల చెరసాలకు సంతోషముగా పోవువారలు గలరా? పోనుసమ్మతించేవారలు లేరన్నట్టయితే మీరు ఏలాగు పలుపలు పాపములను కట్టుకొని సకలవేదనలు నిండిన ఉత్తరించుస్థలమైన క్రూర చెరసాలకు పోను సమ్మతించు వారలుగా నుంటున్నారు? దీనికంటే బుద్ధిహీనము వేరుకలదా చెప్పండి.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసువా ! మామీద దయగానుండండి. (100 దినముల ఫలము)

## జ ప ము.

మాదేవుడైన సర్వేశ్వరా ? స్త్రీపురుషులైన మీదా సుల ఆత్మలమీద మీకృపను హెరాళముగా దయచేసి, వారలు జ్ఞానస్నానము పొంద చిత్తమైనందున నిత్యోపేరింపములో, ముగియని సంతోషమును వారలకు దయచేయవలయునని మిమ్ము ప్రార్థించుచున్నాము స్వామీ ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి గుడికి ఒక వత్తినిచ్చుట.

## అ ద్భు త ము

తొలందీనొయనెను అర్చ్యి. నికోలాసనెడువారు ఉత్తరించు ఆత్మలమీద మిగుల భక్తిపట్టుదలగానుండిరి. సర్వేశ్వరుని సముఖమున వారిజపధ్యానమును, తపోనిగ్రహమును, శక్తిగలదిగానున్నందుచేత ఉత్తరించు ఆత్మలు తమనిమిత్తము వేడుకొనవలయునని అనేకమారులు వారికి దర్శనమై అడుగుకొనినారని వారిచరిత్రములో నిశ్చయముగా వ్రాయబడియున్నది. ఒకనాడువారు నిద్రచేయుచుండునపుడు, కొన్నిరోజులకుముందు చనిపోయిన వారిస్నేహితుడగు పెలెగ్రినోయనెడు సన్యాసిగారియొక్క ఆత్మము వారియొద్దకువచ్చి, తాను ఉత్తరించేస్థలములో కష్టమనుభవించునట్లుగా ఎరిగించి " గురువా, మీరు నావెంబడివచ్చి ఆత్మలను చూడండి " అనినది. అలాగే అర్చ్యి. నికోలాసనువారు ఆ యాత్మను వెంబడించి పోవులాగు ఒక విస్తారమైన మైదానమునకుచేరిరి. ఆమైదానము అగ్నిద్ర

క్కలయందును అఘోరముగా మండి, ఆకాశమువరకు లేచె డుఇసుక నింశిల ఒక పెద్దజ్వాలను చూచిరి, ఆజ్వాలమధ్య లెక్కలేని ఆత్మలు మిగుల కష్టముతో వచ్చుటనును, భయంకరముగా ప్రళాపించుటనును, తమమీద దయగలిగి ఏలాగైనను సహాయము చేయవలయునని అడుగుటనును చూచిరి. దానిని చూచి భయపడి వణికి కాళ్లాడక నిలుచుండునపుడు వారిని పిలుచుకొనివచ్చిన బెలెగ్రినో సన్యాసిగారి ఆత్మము, గురువా " ఈలాగు కష్టపడెడు ఆత్మలమీద దయలేకుండా నుండెదరా ? వారలు అనుభవించు వేదనలు మనుష్యులబుద్ధికి అందనందుచేత, వారలు తమకుఒక అల్పసహాయము రప్పించ శక్తిగలవారలుకాదు. మీరోయనిన; వారలకొరకు జపములనును, తపక్రియలనును, విశేషముగా దివ్యపూజలనును ఒప్పగించ సమ్మతించుదురేని వారలకు ప్రయోజనమగుటగాక, మీకృపచేత అనేకాత్మలు ఈ నిర్భాగ్యస్థలమును విడిచి మోక్షమునకు పోదురు" అని చెప్పి ఆయాత్మము మరుగై పోయినది.

అర్చ్య. నికోలాసనువారు మేలుకొనిన పిమ్మట లేచి సాష్టాంగముగాపడి హేరాళ కన్నీళ్ళనురాల్చి, తాము కనిన నిర్భాగ్య ఆత్మలను గురించి మహాభక్తితో జపములనుచేసి, సర్వేశ్వరునికి ఒప్పగించిరి. ప్రాతఃకాలము శ్రేష్ఠగురువుయొక్క ఉత్తరువుపొంది, ఆయాత్మల కొరకు దివ్యపూజచేసినదిగాక, ఆలాగు ఎనిమిది రోజుల పర్యంతము, మిగుల చురుకుతో అనేక జపములుచేసి, దివ్యపూజలను ఒప్పగించుకొని వచ్చిరి. ఎనిమిదవరోజు ముందుచెప్పబడిన బెలెగ్రినో సన్యాసిగారి ఆత్మము, సంతోష పరితాపముగల ముఖముతో కనిపించి,

తోమును తమలో కూడా అనేక ఆత్మలును, వారి జప పూజ ఆఫలమువల్ల ఉత్తరించుస్థల వేదనలలోనుండి రక్షింపబడిమోక్షమునకు పోవునట్లుగా ఎరిగించి మేలెరిగిన మనసుతో స్వాములవారికి స్తోత్రముచెప్పి మరుగై పోయినది.

క్రీస్తువులారా! ఇప్పుడు చెప్పబడిన అద్భుతముచేత ఉత్తరించు ఆత్మలను రక్షింపవలయునను ఆశచే మీకుమంచి బుద్ధి కలుగుననుటకు సందేహాము లేదు. అయితే మీ ఆశ వ్యర్థమైపోక నరవేరునట్లు, అర్చ్య. నికోలాసును కనిభావించి ఆత్మలనిమిత్తము అధికచురుకుతో జపతప దానధర్మములను చేయవలసినది. ఆలాగు చేయుదురేని మీవలన అనేక ఆత్మలు ఉత్తరించు స్థలమునుండి రక్షింపబడి, మోక్షపేరింపము నొందుదురని ఎరుగ గలవారలు.

5 జో్య 5 ప్రియ 5 త్రిత్వ...చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము ...........

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని (13 పుట చూడు)

---

## 10-వ తేది.

లెక్కలేని ఆత్మలు ఉత్తరించు స్థలములో ఉపాధింపబడుటను చూపించే చర్తమానము.

---

## ధ్యానము.

ప్రతిదినము ఎనుబది వేలమంది మనుష్యులు చనిపోవుచున్నారని శాస్త్రిలు లెక్కించి చెప్పుచున్నారు. ఈ 80,000 ల మనుష్యులలోగా, ఇరువదిదైదు వేలమంది నిజమైన సత్యా

క్రీస్తువులుగా నున్నారని ఉద్దేశించుకొన వచ్చును. ఈ ఎన్నిక ప్రకారము పది రోజులలోగా (250000) రెండులక్షల యాభై వేలమంది చనిపోయియుందురే. ఒక నెలకు లెక్కచూచినట్టయితే యేడులక్షల యాభై వేలమంది చనిపోయియుందురు గదా? ఒకసంవత్సరములో చనిపోవువారల లెక్క (9000000) తొంబదిలక్షల జనమగుచున్నది గదా? పదిసంవత్సరములకు లెక్కచూచి నట్టయితే సుమారు తొమ్మిది కోట్ల క్రీస్తువులు చచ్చియుందురే. ఈ లెక్కను అధికముగా గుణించక, ఒక దినములో చనిపోవు ఇరువదియైదు వేలమంది క్రీస్తువులమీద కొంచెముసేపు ధ్యానించగల వారలము. ఈ ఇరువది అయిదు వేలమంది క్రీస్తువులలోగా, ఎన్నో ఆత్మలు చక్కగా మోక్షమునకుపోక, బహు కొద్ది పూర్ణ పరిశుద్ధ ఆత్మలు మాత్రము చక్కగా మోక్షమునకు పోవునని చెప్పతగి యున్నది. అది యేలాగనగా: ముందటిధ్యానములలో కనుపరచినలాగు చనిపొయ్యే వారలందరును ఎచ్చు తక్కువ అనేక స్వల్ప పాపములతోనును, ఓర్వబడిన చావైనపాపములకు తీర్చవలసిన అపరాధ ఋణముతోనును, చచ్చి పోవుచున్నారు గదా? అదియునుగాక, ఒకొకడు చచ్చిన పిమ్మట అనేకదినములైనను, అనేక సంవత్సరములైనను, ఉత్తరించవలయునని ముందేకనుపరచియుంటిమి. మరియు చచ్చిన వారలకు ఆరుదలయును సహాయమును రక్షించ ప్రయాసపడు వారలు మిగుల కొంచెమువుంది మాత్రము. ఇట్లుండగా రోజు ఒకటింటికి ఇరువదియైదు వేలమంది క్రీస్తువులు చనిపోవునప్పుడు ఎన్నిలక్షలు ఎన్నికోట్ల ఆత్మలు ఉత్తరించు స్థలముయొక్క క్రూర బాధలలో ఉపాధింపబడుచురని తలంచు కొనండి.

పేరుపోయిన మేత్రాణులైన అర్చ్య- అమృతనాథులు, పుణ్యాత్ములు మొదలుగా దేవయూడిగమునందు అసడ్డయును, తప క్రియలలో మందతనముగాను, ధర్మము జేయుటలో బిజిని తనముగాను ఉన్నందుకు, మోక్షమునకు నియమించబడిన వారందరును ఎచ్చుతక్కువ ఉత్తరించు స్థలనిప్పుగుండా కడతేరుదురసిరి. అర్చ్య, విత్తలియానమ్మయును, లెక్కలేని అద్భుతములను చేసిన అర్చ్య- సెవేరియానూసనువారును, అర్చ్యశిష్ట పట్టణముపొందిన వేరనేక పుణ్యాత్ములును, ఉత్తరించు స్థలములో వేదన అనుభవించి ఉత్తరించిన వెనుక మాత్రమే మోక్షమునకు పోయినట్టు ఎరిగియున్నాము. ఒక అర్చ్యశిష్ట వారు గాముకనిన దర్శనముచేత, ఒకనాడు చచ్చిన వారిలో నొకడు మాత్రము చక్కగా మోక్షమునకు పోయినాడనియు, వేరే రెండు ఆత్మలు కొంచెము సేపు మాత్రము ఉత్తరించు స్థలములో వేదన అనుభవించుచు పడియున్నారనుట కనుపడుచున్న సత్యముగదా ?

క్రీస్తువులలోగా విస్తారమంది, నరకమునకు త్రోసివేయబడుచున్నట్టు కొంతమంది శాస్త్రిలు అభిప్రాయపడినను, ఏ పాపాత్మునినిన్ని గురించి ఫలానివాడు నరకానికి పోయినాడని నిశ్చయముగా చెప్పకూడదు. ఎందుచేతననగా: అనేకులు పాపసంకీర్తనము లేకుండా అకస్మాత్తుగా చచ్చినప్పటికిని, వారలచావు దుర్మరణముగా తోచినప్పటికిని, సర్వేశ్వరుని మితిలేని కృపవల్ల ఆత్మను ఎడబాయు సమయములో, కొన్ని మారులు తమ పాపములకు నిజమైన ఉత్తమ మనస్తాపపడి నరకమునకు తప్పివారని తలంచ దగియున్నది. మరియు సర్వేశ్వరుని మట్టుమించిన కృపనువెంబడించి, అర్చ్య -

గోరియుస్, అర్చ్యి-బెయోనార్డుస్, శాస్త్రిలలో గొప్పశాస్త్రి యైన స్వారేశియుస్ మొదలైన పేరుపోయిన శాస్త్రిలు కతలిక్ క్రీస్తువులలో అనేకమంది నరకమునకు తప్పి ఉత్తరించు స్థలములో కఠినవేదన అనుభవించిరైనను రక్షణముపొందుదురని చెప్పుచున్నారు. ఇటువంటి అర్చ్యశిష్టులును శాస్త్రిలును చెప్పు ఈ సత్యము, అందరికిని ఊరటగానున్నను అందుచేత దేవయూడిగములో అశ్రద్ధగా యుండకూడదు, పాప మార్గములో మూర్ఖముగా నడువకూడదు, ఎందుచేత ననగా : అలాగు నడుచువురేని, ఉత్తరించుస్థలములో ఆఘోర వేదనలను అనేక సంవత్సరములకాలము సంపాదించు కొనుటయే గాక, నిత్యనరకమునకుపోవు మహా ఆపత్తులో నుందురనుటకు సందేహము లేదు.

ఇదియునుగాక, పతితులును మతవిభాగస్తులును యావత్తుమంది నరకమునకు పోదురని చెప్పకూడునా ? అదియును చెప్పకూడదు. ఏలాగంటే, వారలలో అనేకులు నిజమైనరక్షకుడైన జేసుక్రీస్తునాధుని నమ్మివిశ్వసించి జ్ఞానస్నానము పొంది కూడినమాత్రము పాపములను త్యజించి, చేసినపాపమునకు ఉత్తమమనస్తాపపడి, తాము అనుసరించెడు మతము అబద్ధమని తెలియక చనిపోయినట్టయితే వారలుకూడా రక్షణము పొందుదురనుట సత్యవిశ్వాసమాను. అయితే ఆలాగు నిజమైన ఉత్తమమనస్తాపములో చనిపోవుపతితులు అనేకులో, కొంచెము మందోయని సర్వేశ్వరునికి మాత్రము తెలియును. అది ఏలాగుండినను, వారలలో రక్షణముపొందువారలు ఉత్తరించుస్థలములో మహావేదన అనుభవించుదురని అందరికిని సులభముగా కనిపించు విశేషమగును.

అజ్ఞానులకును తురకలకును ఏమిసంభవించునని అడిగి
నట్లయితే, వారలు ఏకరక్షకుడైన యేసుక్రీస్తునాథుని ఎరుగ
నందుచేతను, మోక్షముయొక్క ఏకద్వారముగానున్న జ్ఞాన
స్నానమును పొందనందుచేతను, వారలలో ఒకరున్ను రక్షణ
ముపొందనేరరనుట నిశ్చయము. కాబట్టి వారలలో ఒకరును
ఉత్తరించుస్థలములో ఉండబోవునది లేదు.

ఇప్పుడు చెప్పిన న్యాయములచేత ఉత్తరించుస్థలములో
వేదన అనుభవించు ఆత్మలు ఎన్నియని లెక్కయించును మాట
లయందును అణగిన సంగతికాదే. అయితే ప్రతిదినమునందును
తిరుసభయంతటచేయబడు, జపతప దాన ధర్మములవల్లను,
ఒప్పగించబడు దివ్యపూజ బలులవల్లను విస్తార ఆత్మలు ఉత్త
రించుస్థలమునుండి రక్షించబడి మోక్షదరిచేరుదురని చెప్పుదు
రు కాబోలు. మీరుచెప్పునది నిజమైనను, పది రూకలిచ్చి
పది వేలరూపాయలబాకీ తీర్చవచ్చునా ఏమి? పదిమంది త్రాగ
దగిన నీళ్ళవలన పది వేలమంది దాహము తీరునేమోచెప్పుండి.
ఆవిధముగానే ఉత్తరించుస్థలములో పాటుబడెడు లెక్కలేని
ఆత్మలకును ఆయాత్మలు చెల్లించవలసిన పరిహారఅప్పులకును,
ఆజపతపదానధర్మము పూజఫలములన్ని సరిపోల్చి చూచినట్ల
యితే బహుకొంచెమని కనిపించునుగదా? అందరివల్లను చేవి
డువబడిన ఆత్మలుఎన్నో! పరదేశుల ఆత్మలు ఎన్నో! స్వంత
యింటివారలచేతకూడా మరువబడిన ఆత్మలుఎన్నో! ఈలాగు
దిక్కుమాలిన ఆత్మలు ఎన్నియని చూడండి.

క్రీస్తువులారా! ఒకదేశములో అనేక వేలజనులు కరువు
చేత చచ్చుచున్నారని వినినట్లయితే ఏమిచేయుదురు? వారల
మీద కనికరించి, కష్టపడియైనను మీచేతనయిన ధర్మసహాయ

ముచేయుదురుగదా? అలాగే ఉత్తరించుస్థలములో లెక్కలేని ఆత్మలు వేదనయనుభవించుటనుచూచి హేరాళముగా వారలకు సహాయముచేయవలసినది, హేరాళముగా వారలనుగురించి ధర్మమీయవలసినది. జపముచేయవలసినది. దివ్యపూజలు చేయించవలసినది.

అధిక పాపాత్ములును, పతితులును, మతవిభాగస్తులును సహా మట్టులేనిదేవకృపచేత కొన్నిమారులు నరకమునకు తప్పి ఉత్తరించు స్థలములో నుందురు, అయినందున వారల కొరకు కూడా వేడుకోవలసినది.

ప్రతిదినమును 80,000 మంది చచ్చి తీర్వావిధించ బడుచున్నారని ఎరిగి వారలకు కృపనిండిన జేసుక్రీస్తునాధస్వామి దయచేయునటుల, శృంగారతోపులో మరణ అవస్త నొందిన వారి దివ్యహృదయమును చూచి "కరుణాంబర జేసువా! ఆత్మలను స్నేహించెడువారా" అనెడు జపమును అడుగడుగుకు చెప్పుదురుగాక. ఈ జపమును జపించు వారలకు ప్రతిసారికిని నూరుదినముల ఫలము కలుగుటయేగాక, ఆ జపముచేత అనేకమంది మంచిమరణము పొందుదురని ఎరుగ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసువా మామీద దయగానుండండి (100 దినములఫలం)

## జపము.

కృపనిండినకర్తా! మాతలిదండ్రులయొక్కయు, సహోదరులు, సహోదరీలయొక్కయు తక్కిన సకల విశ్వాసులయొక్కయు ఆత్మలను మతువక, వారలు సత్య విశ్వాసమునందు మృతిపొందిన వారలని తలంచనవధరించండి. వారలను

మోక్షమునకు దూరముగా నిలిపెడు బంధనములను విప్పి, పాపములను మన్నించి, అపరాధ ఋణమంతటిని తీర్చి మహా కనికరముంచి, మీయొద్దకు చేర్చుకొనవలయునని మిమ్ము ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

అత్మలమీద భక్తిగానుండ కొందరికి బుద్ధిచెప్పుట.

# అస్యాతము.

ఇతాలియా రాజ్యమునందుగల ఒక పట్టణములో మరియమ్మ యనెడు ఒకస్త్రీ యుండినది. ఆమె చిన్నప్రాయమునందే ఏ దొక సిగ్గుభయములేక పాపదుర్మార్గమునందు ప్రవర్తింపుచు వచ్చినదిగాక, వయసుమించెడుకొద్ది మహా పాపాత్మురాలైనది. ఆమె ముసలిదియైనప్పుడుకూడ మేర మర్యాదలేక, దేవభయభక్తి, నరకభయమును లేక అందరికిని దుర్బుద్ధి చెప్పుచుండును గనుక, ఆమెయున్న పట్టణమువారలు ఇటువంటి దుర్మార్గురాలిని సహించలేక ఊరువెళ్ళ దరిమిరి. ఆమెకు ఇల్లు వాకిలి ఇతర అధరువు ఏమిన్ని లేనందుచేత, సమీపమందున్న కొండలకుపోయి ఒక గుహాలో ప్రవేశించినది. ఆ గుహాలో బహుకష్టపడి ఏ దొక సహాయములేక పడియుండి, ఆమె శరీరము పుచ్చి, దుర్గంధకంపుబుట్టి మనస్తాప గురుతులులేక, ఎవరికి తెలియకుండా నిర్భాగ్యముగా చచ్చినది. ఆమె మృగమువలె చచ్చినదని క్రీస్తువుల సమాధిలో దాని ప్రేతమును స్థాపించక ఆ యడవిలోనే పూడ్చివేసిరి.

ఆ పట్టణములోనే కర్తేనమ్మయనెడు పేరుగల ఒక కన్యాస్త్రీ యుండినది. ఆ పుణ్యవతి, ఎవరి మరణమునైనను

వినినతోడనే, వారల ఆత్మనుగురించి మిగుల భక్తితో జపము లను జేసి ఒప్పగించును. అట్లుండినను ముందు చెప్పిన పాపాత్ము రాలైన మరియమ్మ యనునది చచ్చిపోయిన సమాచారము విని యుండినను ఆమె నిశ్చయముగా నరకమునకు పోయి యుండునని నమ్మి ఆమె ఆత్మనిమిత్తము ఒక జపమైనను చేయ లేదు. నాలుగు మాసములు గడచిన పిమ్మట ఆమె ధ్యానము లో నుండునపుడు ఒక ఆత్మము ఆమెకు కనిపించి చెప్పిన దైనది: "సహోదరియైన కత్తరేనమ్మ గారా! నాసర్భా గ్యము మహాగొప్పది. అదేమనగా, మీరు అన్ని ఆత్మల నిమిత్తము జపించువారుగా నున్నను నా యాత్మను మాత్ర ము బొత్తిగా మరచి నామీద దయలేక నున్నారే, యని నది. "నీవుఎవరు" అని ఆపుణ్యవతియడుగగా, "కొండగుహాలో నిర్భాగ్యముగా చచ్చినమరియమ్మను నేనే, అనినందుకు: నీవు నరకమునకు తప్పించుకొనినది ఏలాగని విచారించినది. అందుకు ఆయాత్మము. "దేవకృప చేతను, పరిశుద్ధకన్యకయొక్క వేడుద లవల్లను తప్పించుకొంటిని. అందరిచేతను చేవిడువబడి చావ బోవుసమయములోనే, నాపాపముల ఘోరమును తలంచి మి గులభయపడి అయ్యో చెడితినేయని, నేను పేరుగొనియున్న దేవమాతనుతలంచి ఆమెనుజూచి పరిశుద్ధకన్యకా, ఏదొక దిక్కు సహాయము లేనివారలకు మీరే ఆధరువు. మహాపాపా త్మురాలైననన్ను అందరు విసర్జించి త్రోసివేసినను మీరు మాత్రమునన్ను చేవిడువజాలరని నమ్మియున్నాను. నాకు సహాయముగానుండండి, నామీద దయగానుండండి, ఏలిన రాలాయని ప్రార్థించితిని. ఈ నామనివి దయతో చిత్తగించి దేవమాత, నేను నాపాపములమీద ఉత్తమమనస్తాపపడునట్టు

నాకు అనుగ్రహము దయచేసినది. ఆలాగు ఉత్తమమనస్తాప పడి యిష్ట ప్రసాదముతో చచ్చి నిత్యనరకమునకు తప్పించుకొంటిని. అయితే ఉత్తరించు స్థలములో మహాకఠిన వేదన అనుభవించుచున్నాను. నా ప్రియ సహోదరీ, నా యాత్మము నిమిత్తము కొన్ని పూజలనైన చేపించుదురేని నా ఉత్తరింపు తగ్గి మోక్షమునకు పోదును. ఈ కృపనాకు దయచేసినట్టయితే మీనిమిత్తము ఎప్పుడును సర్వేశ్వరునిని దేవమాతనును వేడుకొనుదును, అని చెప్పి ఆయాత్మము అదృశ్యమైపోయినది. ఆలాగు భక్తిగల కత్తరీనమ్మ, పూజలుచేయించిన కొన్నిరోజులకు తరువాత, ఆయాత్మము మహా మహిమప్రతాపముతో కనిపించి, "సహోదరియైన కత్తరీనమ్మగారా, మీరునాకు గొప్పయుపకారము చేసియున్నారుగదా. మీరు చేయించిన పూజలచేత నా ఉత్తరింపు ఋణముతీరి సర్వేశ్వరుని కృపదయాళమునుపొగడి స్తుతించను, మీనిమిత్తము వేడుకొనను మోక్షమునకు పోవుచున్నాను, అని చెప్పినపిమ్మట ఆయాత్మము సూర్యుని మించిన జ్యోతిప్రకాశముతో మోక్షమునకు వేంచేసి పోవుటను కన్యాస్త్రీ చూచినది.

క్రీస్తువులారా! పై చెప్పిన పాపాత్మురాలు నిత్యనరకమునకుతప్పి మోక్షము పొందిన దానినిచూచి, ఎటువంటి పాపాత్ముల మరణమునుగురించియైనను అపనమ్మకపడక, సకల ఆత్మలనిమిత్తము వేడుకొనవలయునని ఎరుగగలవారలు.

5 జ్యో-5 ప్రియ-5 త్రిత్వ...చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము.....

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని (13 పుటచూడు)

# 11 వ-త్రే ది.

ఉత్తరించు ఆత్మలకు సహాయము చేయవలయు
నను ముఖాంతరములను తెనుపరచే సాధారణ వర్తమానము.

## ధ్యానము.

ముంను చెప్పిన ధ్యానములలో ఉత్తరించు స్థలము కల దనియు, దానిలో లెక్కలేని ఆత్మలు మనోవాకుకందని వేదనలను అనుభవించుచున్నారనియు వివరించి చూపియున్నాము. ఇపుడు ఆ యాత్మలకు సహాయ ఉపకారము చేయవలయు ననెడు విశేష ముఖాంతరములను వివరించి చెప్పెదము. అయితే ముందుముందు, మనము ఏవిధముగా ఈ ఉపకార సహాయము చేయవచ్చునని గొంచెము యోచించి చూడవలసినది. మనుష్యుడు రెండువిధములైన ద్రవ్యములను సంపాదించుకొన వచ్చును. అవి యేవనగా: ఆత్మసంబంధమైన ద్రవ్యములును, శరీరసంబంధమైన ద్రవ్యములును అగు ఈ రెండువిధ ద్రవ్యములగును. రూకకాసులు, నగలు, చేను, బీడు, ఇల్లువాకిలి, గొడ్డుగోదలు ఈ మొదలగునవి శరీరసంబంధమైన ఆస్తి ద్రవ్యములగును. జపతప దానధర్మమువల్లను తక్కిన ఏ పుణ్యముల వల్లను కలిగే పుణ్యఫలమును, మోక్షమునకు స్వతంత్రమును, తక్కినజ్ఞానవరములును ఆత్మసంబంధమైన జ్ఞానద్రవ్యములగును. ఇపుడు చెప్పిన లోకద్రవ్యములు మనుష్యునికి స్వంతముగా నున్నందుచేత వాడువాటిని తన యిష్టప్రకారము శెలవుచేయ స్వతంత్రముగలవాడై యున్నాడని అందరు చెప్పుదురుగదా? ఆ విధముగానే వాడుపొందిన జ్ఞానద్రవ్యములు వానికి స్వంత ఆస్తిగా నున్నందుచేత వాటిని దేవచిత్తమునకులోబడి శెలవు

చేయ స్వతంత్రము పొందియున్నాడని చెప్పవలయునుగదా ?
ఈ లోక ఆస్తిగలవాడు, తన ద్రవ్యములను తన స్వంత అవ
సరములకు శెలవుచేయవచ్చు ననులాగుననే, వాటిని పరుల
అవసరముల నిమిత్తమును శెలవుచేయవచ్చునుగదా ?

అలాగే జ్ఞానద్రవ్యములు కలిగినవాడు, వాటినన్నిటిని
తననిమిత్తము ఉంచుకొనవచ్చునను లాగుననే, వాటిని సర్వే
శ్వరుడు కట్టడచేసిన ప్రకారముగా ఇతరులకును ఇవ్వవచ్చును
గదా ? అదియేలాగనగా : రాజుకు ఒక మనుష్యుడు ఒక
గొప్ప సహాయమును చేసినాడు, అందుచేత వానిమీద రాజు
సంతోషముగలవాడై, వానికి ఏదొక గొప్ప బహుమానము
నియ్యబోవు సమయములో ఈ మనుష్యుడు రాజునుజూచి,
నేను గైకొనవలసిన ఈ బహుమానమును, నాకు యివ్వక
నా స్నేహితుడయిన ఫలాని వానికి దయచేయ ప్రార్థించు
చున్నాను అనినట్టయితే, వాని ప్రార్థనకు రాజు కనికరించి
వాడు అడిగినలాగే చేయునుగదా ? అలాగే జప తప దాన
ధర్మమువల్లను, ఇతరపుణ్యములవల్లను మనుష్యుడు స్వతం
త్రించుకొనిన జ్ఞానద్రవ్యములను సర్వేశ్వరుని ప్రార్థించి జీవించి
యుండే వారలకైనను, చనిపోయియుండే వారలకైనను రా
చేయ వచ్చుననుటకు సందేహము లేదు.

ఈ విషయములో ఒక న్యాయము ఎరుగవలసినది
అదిఏదనిన :-ఏ పుణ్యమునందును మూడు కార్యములు అణగి
యుండునట్టుగా వేద శాస్త్రులు నిశ్చయించుచున్నారు. ఏలా
గనగా : పుణ్యఫలమును, వేడుదల ఫలమును, పరిహార ఫల
మును అను యీ మూడు ఫలములగును. పుణ్యమును చేసిన
వాడు పుణ్యఫలమువల్ల, సర్వేశ్వరునికి ప్రియపడుచున్నాడు,

వేఁడుదల ఫలమువల్ల తనకుగాని ఇతరులకుగాని ఏదొక సహా యమును పొందుచున్నాడు, పరిహారఫలమువల్ల తన పాపము లకుగాని, గురించెడు వేరేమనుష్యుని పాపములకు గాని పరి హారము చేయును. అది ఏలాగగునని ఒక ఉపమానము చేత కనువరచెదము. ఒకఁడు శుద్ధ తలంపుతో ఒక్క ప్రొద్దుగా నుంటున్నాఁడు. అది పుణ్యముగాను తపసుగాను ఉండుటచేత, తనకు కలిగెడు పుణ్యఫలమువల్ల, సర్వేశ్వ రునికి ప్రియపడి సంభావన పొందును. ఈ ఒక్క ప్రొద్దు నిమిత్తము తన వ్యాధిగాని, తనస్నేహితుని వ్యాధిగాని పరి హారము కావలయునని అడిగినట్టయితే, ఆ వేఁడుదల ఫలమువల్ల అదిపొందతగినదిగానుండును. ఒక్కప్రొద్దుగానుండునది కఠిన మును కష్టమునుగలదిగా నుండుటచేత, ఈ కష్టమును తనపాప ములకుగాని, ఇతరుల పాపములకుగాని ఒప్పగించినట్టయితే అది పరిహారఫలము వల్ల పరిహారమగును. ఇది ఇట్లుండినను పుణ్యఫలము మనుష్యునికి స్వాధీనముగలదిగా నున్నందుచేత వానికి చెల్లునేగాని మరియెవరికిని యివ్వబడుట లేదనునది నిజ ము. అయితే వేఁడుదలఫలమును, పరిహారఫలమును అందరికి పొందింపవచ్చుననుటచేత, వాటిని ఉత్తరించు ఆత్మలకు ఒప్ప గించినట్టయితే, సర్వేశ్వరుని మితిలేని కృపచేత ఆయాత్మలు చేయవలసిన పరిహారమును పడవలసిన ఉత్తరింపు వేదనయును తగ్గుననుట తప్పని సత్యమగును.

ఇదియంతయు అధిక తేటయగునట్టు ఇంకొక ఉదాహ రణమువల్ల చూపించెదము. అది ఏమనగా, ఒకమనుష్యుఁడు చాల అప్పుపడి ఉత్తరించగతిలేక, న్యాయాధికారిచేత చెరలో వేయబడి అధిక కష్టపడుచున్నాఁడు. దానిలోపనిచేసి అప్పు

తీర్చకూడదనందుచేతను, భిక్షమెత్తుకొనకూడదనందుచేతను ఏమి న్ని సంపాదించకూడక తనకు విధింపబడిన కాలము ముగియు నంతవరకు ఈ నిర్భాగ్యములో నుండునుగదా ? వాని కష్టము ను ఎరిగిన ధర్మిష్టు డొకడు వాడు యివ్వవలసిన అప్పును చెల్లించి వానిని చెరసాలనుండి రక్షించుచున్నాడు. ఉత్తరించు స్థల ఆత్మల ఎడలకూడా అలాగే అగుచున్నదని అందరికి తెలి యునే. ముందు చెప్పినలాగు మనము ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయము చేయవచ్చుననుటే సర్వేశ్వరుని విశేష కృపయును మితిలేని సహాయముగా నున్నదేగాని వేరుకాదు.

ఇపుడు చూపించినలాగే, క్రీస్తువులు సర్వేశ్వరుని ప్రా ర్థించి, ఉత్తరించు ఆత్మలకు సహాయము చేయవచ్చుననుట సత్య విశ్వాసముగనుక, అలాగుచేయునది ఎంతమేలైన కార్య మనియు, ఎంతప్రయోజనమైన పనియనియు, ఎంత అవసరము గలదియనియు ఇక చెప్పబోవు ధ్యానములలో దేవకృపనుగాని చూపించ ప్రయాసపడెదము.

క్రీస్తువులారా ! మీరు ఆత్మలనుగురించిచేయు జపము లవల్లను, ధర్మములవల్లను, ఆయాత్మలు అనుభవించెడు వేదన లు ముగియును, లేక తగ్గిపోవునని అర్చ్య-అగుస్తీను నిశ్చయ ముగావచనించిరి. అందుచేతమీరు తగిన ప్రకారముగా ఆత్మల నిమిత్తము చేయునదంతయు వ్యర్థమైపోక ఫలించునను దానిని గురించి మహాభక్తి చురుకుతో ఆత్మలకు సహాయముచేయ ప్రయాసపడ గలవారలు.

మరియు రాజుకు ద్రోహిగా నున్నవాడు, తాను వాని యొద్ద అడుగు మన్ననిని పొందగలడా ? పొందనేరనందుచేత, మీరు ఆత్మలను గురించి వేడుకునేటప్పుడు పాపముచేత

మీరు సర్వేశ్వరునికి ద్రోహులుగా నున్నారో ఏమోయని చూడవద్దా ? చావైన పాపముతో నుండురేని మొట్టమొకట పాప పరిహారము చేసుకొనవలసినది.

కడసారి మనుష్యులు చేయు పుణ్యములలో తలంపును గమనమును భక్తియును లేనందుచేత, ఆ పుణ్యములకు చెల్లు ఫలములను పొందకనుంటున్నారు. అందుచేతమీరు ఆత్మల కొరకు చేయు జపములను, ధర్మములను, మంచితలంపుతోను భక్తిచురుకుతోను చేయవలయునని ఎరుగగలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసునాథుని దివ్యహృదయమా ! ఉత్తరించు ఆత్మల మీద దయగానుండండి. (100 దినముల ఫలము.)

## జ ప ము .

నిత్యజీవ్యముగల దేవుని కుమారుడైన జేసుక్రీస్తునాధా స్వామీ, దేనరవారు లోకరక్షణము నిమిత్తము మధ్యాన వేళన శిలువమ్రానుకు నకొట్టబడి పైగానెత్తబడి, మాపాపములకు విమోచనముగా మీవెలలేని తిరురక్తమును చిందితిరే, దాసులు మోక్షరాజ్యములో ప్రవేశించి నిత్యానంద మహిమప్రతాపమును పొందేటట్టు అనుగ్రహముచేయ నవధరించ వలయునని దేవరవారిని తాక్షివందనముతో ప్రార్థించుచున్నాము స్వామీ ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి శిలువమార్గమును చేయుట కూడక పోయినట్లయితే జేసునాథుని తిరుపాటులనుతలంచి 14 జోత్రి. 14 క్రియ-14 త్రిత్వస్తోత్ర మంత్రములను చెప్పుట.

# అద్భుతము.

కర్తూసియాన్ సభలో ప్రవేశించిన గొప్పశాస్త్రిరైయైన సూరియూసనువారు అర్చ్య-క్రీస్తియానమ్మ చరిత్రను వ్రాసిన వారైరి. ఉత్తరించు ఆత్మలమీాద ఈ అర్చ్యశిష్టురాలు మిగుల భక్తిగానుండుటచేత, ఆయాత్మలకు ఉపకారసహాయముచేయు నట్టు వారికందని తపక్రియలను చేసుకొనివచ్చును. ఒకనాడు ఆమెకనిన దర్శనములో: ఆమె ఆత్మము ఆమెశరీరమును విడిచి ఎడశాసినట్టుగాను, సన్మనస్కులచేత ఉత్తరించు స్థలమునకు కొనిపోబడి, దానిలో ఆత్మలు అనుభవించే కఠిన వేదనలను కండ్లార దర్శించినట్టుగాను కనినది. దానినుండి మోక్షపేరింప గృహమునకుపోయి, దానిలో మోక్షవాసులకుగల మనోవా కు కందని సంతోషములనును మహిమలనును తేటగాచూచి కనిపట్టినది. వీటినన్నిటిని దర్శించినపిమ్మట సర్వేశ్వరుడు ఆమె కు వచనించినది: 'క్రీస్తినమ్మా? ఇపుడు నీవు ముగియని భా గ్యముగల పరమస్థలమునకు వచ్చితివి. దీనిలో నిలకడగా నుం డవలసినదో? లేక తిరుగా భూమిమీాదికి దిగి ఉత్తరించు ఆత్మ లకొరకు వేడుకొని పుణ్యఫలము పొందను అరుదైన తపము చేయను పోవలసినదో? ఈరెంటిలో ఏది నీకిష్టముగా నున్న దో చెప్పుదువుగాక' యనిరి. అందుకామె మరుత్తరముగా, ఏలినవారా! ఈనిర్భాగ్యమైన ఆత్మలనిమిత్తము ప్రయాసపడ ను, దహనబలిగానును ఉండునట్టు మీాకు చిత్తమైనట్టయితే మరల భూలోకములోనుండ సమ్మతించుచున్నాను, అనినది.

ఈదర్శనమును కనిన పిమ్మట అర్చ్య-క్రీస్తినమ్మ ఆత్మ లను గురించి ముందుకంటె నూరంతలు అధిక కఠిన తపఃకృత్య

ములను చేసుకొనుచువచ్చినది. అనేకదినములు ఏ ఆహారము ను తినకుండానుండును, తన మృదువైన శరీరమును రక్తము కారువరకు బెత్తముతో కొట్టుకొనును. ఖూరుగల ముండ్ల చెట్లమీద పొర్లాడును. ఏవిధమునందును తనను బాధింపవెద కును. ఆమె తనకు రప్పించుకొనెడు కఠిన వేదనలనుచూచి ఇతరులు అతిశయపడి, క్రీస్తీనమ్మ ఈలాగు బ్రతుకుచుండుటనదే గొప్ప అద్భుతమనుదురు. ఆలాగు ఆమె అనేక సంవత్సరము లుగా దేనినిని తగ్గించక కఠిన తపము చేయుచు వచ్చినందున విస్తారమైన ఆత్మలను ఉత్తరించుస్థలమునుండి రక్షించి మోక్ష పేరింపమునకు చేర్పించినదనుట అతిశయముకాదు. ఆమె ఆలాగు రక్షించిన ఆత్మలు ఆమెకు కనుపడి, ఆమెనుపొగడి మేలెరిగిన స్తోత్రము చెప్పును. కడసారి ఆమెయును ఆ లెక్క లేని ఆత్మలవల్ల పరివేష్టింపబడి, భాగ్యవతిగా మరణముపొంది మోక్ష పేరింప గృహాములో చేరినది.

క్రీస్తువులారా ! హెచ్చైన గోత్రములో ఉద్భవించినది యునై మృదువైన శరీరముకలదియునై యుండిన ఈ అర్చ్య శిష్ట క్రీస్తీనమ్మ, ఉత్తరించు ఆత్మలనిమిత్తము అంత కఠినతప కృత్యములను నడిపించినదనిచూచి, మీరు ఆయాత్మలను గు రించి ఏమిన్ని చేయక నుండవచ్చునో ? సకలమేలులు నిండిన మోక్షమును పొందుటకు ఉత్తరించు ఆత్మలమీద భక్తిగా నుండునది మంచిమార్గమని ఎరుగ గలవారలు.

5 జో్య, 5 ప్రి త్రిత్వస్తోత్రములను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము........

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని...(13 పుట)

# 12-వ తేది.

## ఉత్తరించు ఆత్మలకుగాను ఉపకారసహాయము చేయునది సర్వేశ్వరునికి ప్రియమైన పుణ్యమని చూపించెడు వర్తమానము.

## ధ్యానము.

మనుష్యుడు దేవకృపచేత చేయకూడిన పుణ్యములన్నిటిలోను తన జప తప దాన ధర్మమువల్లను, సత్కృత్యముల వల్లను ఉత్తరించుస్థలములోని ఆత్మలను రక్షించి మోక్ష ప్రవేశింపమునకు చేర్చునదే సర్వేశ్వరునికి మిగుల ప్రియమైన పుణ్యమనుటకు కొంచెమైనను సందేహము లేదు. అదేలాగనగా: కలిగించబడిన యావత్తును విశేషముగా, బుద్ధిగల సమస్త వస్తువులనును సర్వేశ్వరుడు తమనిమిత్తముగానే సృష్టించినారనుట వేదపుస్తకములో వ్రాయ బడిన సత్యమాను. సర్వేశ్వరుడు బుద్ధిగల వస్తువులను తమనిమిత్తము కలిగించినారనుటకు అర్థమేమనగా, బుద్ధిగల ఆవస్తువులు యావత్తు తమ్మును ఈ లోకములో ఎరిగి స్నేహించి సేవించి మహిమ పరచిన పిమ్మట, తమ్మును సదాకాలము మోక్షములో ప్రత్యక్షముగా దర్శించి ఏకముగా స్నేహించి, స్తోత్రించి తమయొద్ద నుండనుడు వర్థిలుటకుగానే సర్వేశ్వరుడు బుద్ధిగల వస్తువులను కలిగించినారని అర్థమగును. అయితే సర్వేశ్వరుడు వారల నిమిత్తము ఆపేక్షించి వెదకిన ఈ మహిమను ముందు చెప్పిన బుద్ధిగల వస్తువులు మోక్షమును పొందిన పిమ్మట మాత్రమే చక్కగా చెల్లించుదురనుటచేత, ఆయాత్మలు మోక్షములో చేరకుండు

వంతవరకు ఆ దేవమహిమకు ఒక కొరతవలె నుండునుగదా? కాబట్టి ఇంకా మోక్షభాగ్యమును పొందని ఉత్తరించు ఆత్మలను రక్షించి మోక్షమునకు చేర్పించునదే సర్వేశ్వరుని ఉత్తమవిధముగా మహిమపరచునదియై యుండుటచేత ఈపుణ్యము వారికి మిగుల ప్రియమై యుండుననుట నిశ్చయము.

ఉత్తరించు ఆత్మలు యిష్టప్రసాదముతో నుండుటచేత, సర్వేశ్వరునికి అధిక ప్రియముగల ఆత్మలగును. వారు ఆయాత్మలను విశేషపక్షముతో ప్రేమించుకొని వచ్చుచున్నారనుటను గూర్చి, వారలు అనుభవించు వేదనలు శీఘ్రముగా ముగియవలయుననియు, సకలమేలులనిచ్చు మోక్షపేరింపము వారలకు శీఘ్రముగా రావలయుననియు ఆశించియున్నారుగదా.? అయితే ఆయాత్మలు తమనీతికి పరిహారము చేయవలసినందున, ఈ పరిహారము ముగియునంతవరకు ఆయాత్మలు ఉత్తరించు స్థలములో నుండవలసినది. అయితే మనుష్యుడైనవాడు సర్వేశ్వరుడు నియమించినలాగే ఆ యాత్మలు చేయవలసిన పరిహారమును నెరవేర్చినట్టయితే, వారలు వెంటనేమోక్షమునకు పోదురుగదా? మరియు సర్వేశ్వరుడు తమకొక ఉపకారమును చేసినట్టుగానే ఎంచుకొని, అలాటి పుణ్య జనులకు కావలసిన మేలులను దయచేయుదు రనుట అంగీకరించతగిన సత్యమౌను.

దేవుడైన సర్వేశ్వరుడు సకలలక్షణములను గొనియుండువారుగా నున్నను వారి దయ అన్నిటికిని అధికరించినదిగా నున్నదనుటచేత, అందరికిని మేలుచేయునది వారి స్వభావగుణముగాక, దండనవిధించునది వారికొక కష్టముగా తోచుచున్నది. అందుచేత పూర్వదీర్ఘదర్శియైన ఎజెక్కియేలను వారి

నోటివల్ల వారు మొరపడులాగు " మేము భూమిని నాశనము చేయకుండునట్టు మమ్మును ఎదిరించి మాట్లాడి, ఆటంకపరచు లాగు ఒకమనుష్యునిమేము వెదకియున్నను ఈ మనుష్యుడు అగపడలేదని " సర్వేశ్వరుడు తామే వచనించియున్నారు. అలాగే సర్వేశ్వరుడు తమనీతిని చెల్లించి ఉత్తరించు ఆత్మలకు కఠిన వేదనలను కట్టడచేయుచుండి నప్పటికిని, తమ కోపమును చల్లార్చనును, తాము విధించెడు దండనలను ఆటంకపెట్టి నిలుపనును, ఆ యాత్మలను రక్షించనును, మనుష్యులు ప్రయాసపడవలయునని మిగుల ఆశగా నున్నారే. వారి ఆశ అలాగుండగా, మనము కూడిన మాత్రము ఉత్తరించు ఆత్మలను గురించి ప్రయాసపడక నుండవచ్చునో ?

మరియు ఏదొక పాపాత్ముడు పాపమార్గమును విడిచి సన్మార్గమునకు తిరిగినట్టయితే, అందుచేత మోక్షములో బహుసంతోషము కొనియాడబడునని జేసునాథస్వామే వచనించిరి. మనసు తిరిగిన ఈ పాపాత్ముడు ఇంకా భూలోకములో నున్నందుచేత మరలచెడిపోవునో పుణ్యములో సుస్థిరముగా నుండునోయని సందేహము కలిగియున్నను వానినిగూర్చి మోక్షములో అంత ఉల్లాసము కొనియాడునపుడు, ఇష్టప్రసాదముతో మృతిపొందిన ఉత్తరించు స్థలఆత్మము ఏదొకటి మీ చేత రక్షింపబడి పరమగతి పొందినట్టయితే సర్వేశ్వరునికిని మోక్షవాసులకును సన్మనస్కులకును ఎంతటి అధిక సంతోష ఉత్సాహము కలుగునని చెప్పతరముకాదు.

పితాపిత్రుడైన అబ్రహామనువారు తమకుమారుడైన ఈసాకను వారిని సర్వేశ్వరునికి బలిగా నరుకబోవు సమయములోనే, ఒక సన్మనస్కుడువచ్చి "నిలుపు, నిలుపు, నీకుమారు

నికి మోసము రప్పించవద్దు" అని ఆటంకపరచినపుడు తండ్రీనైన అబ్రహాముకు ఎంతసంతోషము కలిగినదని చెప్పకూడునో ? ఆవిధముగానే సర్వేశ్వరుడు, తమ నీతిప్రకారము తాము ప్రేమించెడు ఆత్మలను ఉత్తరించు స్థలవేదనలవల్ల దండించునపుడు మనుష్యులువచ్చి వారిని బతిమాలిప్రార్థించి ఆయాత్మలకొరకు పరిహారమును చెల్లించి "ఏలినవారా! దయగానుండండి, ఇక ఆయాత్మలమీద కోపముంచక వారలను మీయొద్దకు చేర్చుకొనండి స్వామీ, స్వామీ, అని చెప్పినట్టయితే సర్వేశ్వరునికి మనోవాకుకందని సంతోషము కలుగునుగదా?

మరియు ఒకతండ్రి తాను మిగుల స్నేహించెడు తన ఏకకుమారుని ఒక తప్పితమునుగురించి దండించునపుడు తల్లి వచ్చి "ఓర్చుకొనుము, ఓర్చుకొనుము, బిడ్డనుకొట్టవద్దు" అని వానిచేతిని పట్టుకొనినట్టయితే తండ్రికి సంతోషముగానుండునుగదా ? సర్వేశ్వరుడు ఉత్తరించు ఆత్మలను ఏతండ్రియును తన బిడ్డలనుస్నేహించు దానికంటె, అత్యధికముగా స్నేహించుచున్నారనుటకు సందేహము లేదు. కాబట్టి వారినీతిప్రకారమే ఆయాత్మలకు దండన విధించునపుడు, మనము వారి పాదములమీదపడి "ఓర్చుకొనండి, ఏలినవారా ఓర్చుకొనండి, కోపముతో దండించకండిస్వామీ, స్వామీ" అని మనము ప్రార్థించినట్టయితే వారికి ఆయాత్మలమీద దయకలుగునదిగాక మనమీదను సంతోషపడుదురు.

ఈ విషయములో చెప్పతగు అనేక న్యాయములుండినను, ఉత్తరించు ఆత్మలమీద భక్తిగానుండుట సర్వేశ్వరునికి మిగుల ప్రియముగల పుణ్యమనియు, ఉత్తమ దేవస్నేహమనియు

తేటగా చూపించునట్లు ఇపుడు వివరించినది చాలునని ఎంచు చున్నాము.

మీకుగతియును సకలమేలులుగానున్న సర్వేశ్వరుని మహిమను ప్రసిద్ధిపరచ ఆశించు పుణ్యాత్ములారా! ఉత్తరించు ఆత్మలమీద భక్తిగానుండునదే దానికి ఉత్తమ మార్గమని ఎరిగి ఆయాత్మలను రక్షించ మీరుచేయు జపతప దానధర్మ సత్కృత్యముల నన్నిటిని ఒప్పగించుదురుగాక.

అనంత దయా స్వరూపియునై, మీకు జీవమును సహా దయచేసినవారునై, మిమ్మును మితములేని ప్రేమతో స్నేహించెడువారునై యుండెడు సర్వేశ్వరునికి, మీపక్షమును చూపించ ఆశించు పుణ్యాత్ములారా! ఉత్తరించు ఆత్మలమీద భక్తిగానుండునదే దానికి ఉత్తమమార్గమని కనిపట్టి, ఆయాత్మల కొరకు వేడి, మీవల్లకూడినమట్టుకు ప్రయాసపడుదురుగాక.

జ్ఞాన శత్రువులలో చిక్కుకొని ఈ కన్నీటి కనములో నుండి ప్రశాపించి, మీమీద దేవసహాయము, దేవానుగ్రహము రావలయునని ఆశించు పుణ్యాత్ములారా! ఉత్తరించు ఆత్మలమీద భక్తిగా నుండునదే అందుకు ఉచితమార్గమని కనిపట్టి మీనాలుకకు మాటలు లేకపోయినను, మీచేయి తిమురుపట్టినను, కష్టమనుభవించెడు ఆయాత్మలను ఒకనాటికిని మరువక నుందురుగాక.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

యేసుక్రీస్తునాథుని దివ్య హృదయమా ఉత్తరించు ఆత్మలమీద దయగానుండండి. (100 దినముల ఫలము)

## జపము.

మాపలినవారైన సర్వేశ్వరా! మృత్యులైన సకల

క్రీస్తుప్రులకును మీ రాజ్యముయొక్క సత్యవిశ్రాంతిని దయచే యుండి. మృతిపొందినవీరలు మీ తిరునామమును విశ్వసించి స్నేహించి నమ్మియుండినందుచేత, మనుష్యునియొక్క కన్ను కానకూడనిదిని, వాని చెవివిన కూడనిదిని, వాని మనసు గ్రహించకూడ నిదిగానున్న పేరింప రాజ్యముయొక్క మేలుల ను వారలకు కృపతో దయచేయవలయునని దేవర వారిని ప్రార్థించు చున్నాము స్వామీ.

ఆమేన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగూర్చి ఏదొక తపకృత్యమునుచేయుట.

# అద్భుతము.

ఇస్పానియా రాజ్యములో గొప్పవంశపతులైన తలిదండ్రి నుండి పుట్టిన కోర్తోసనెను అర్చ్య-కత్తరేనమ్మ మహిమగల పేరు ప్రఖ్యాతివహించియుండినది తక్కిన చిన్నపిల్లలు ఆట్లా టలయందే ప్రియపడు లేతవయసులో ఆమె పుణ్యముమీద అధిక గమనముగా నున్నందుచేత, ఆమెను నన్మనస్కని చెప్పుకొనుచుండిరి. ఆమెకు ఎనిమిది వయసు జరుగునపుడు ఆమెతండ్రి చనిపోయెను. కొన్నిరోజులకు పిమ్మట వాని ఆత్మము ఉత్తరించుస్థలనిప్పులో క్రూరముగా బాధ నొందు రీతిగా, ఆమెకు కనిపించి చెప్పిన దేమనిన: "నా ప్రియము గల కుమార్తే, నీవు నాయాత్మము నిమిత్తము కావలసిన తప సంతయు చేయువరకు ఈ కఠిన నిప్పులో కాలుచుండవలసిన దే" యనినది, దీనిని విని ఆమె హృదయము అంబుచేత పొడవబడినట్లు, అధికకష్టి యనుభవించినది గాక, కొద్ది

ప్రాయము గలదిగానుండినను, మృదుశరీరముగలదిగా నుండి నను, అప్పుడే గొప్ప తపోధనులుసహా చేయకూడని కఠిన తపకృత్యములను చేయ నారంభించినది, పంచప్రాదు, ముండ్లవొడ్డాణము మొదలైన తపయత్నములు ఆమె వశము లో లేనందుచేత గుఱ్ఱపు కొరడాతో తన్నుకొట్టుకొని, గుఱ్ఱ మును రుద్దు కలారుచే తన శరీరమును గీరి రక్తము కార గాయపరచుకొనును. ఆమె విడిచిన కన్నీళ్ళవల్లను, చేసిన జపములవల్లను, చిందిన రక్తమువల్లను ఆమె తండ్రి దేవనీతికి చెల్లించవలసిన పరిహార అప్పుతీరి, దేవకోపము చల్లారినది. అప్పుడు తండ్రి మోక్షవాసుల మహిమవలన చుట్టబడి తన కుమార్తెకు దర్శనమై, " నా కుమార్తే ! సర్వేశ్వరుడు నీతప సును కృపతో చేకొనిరి. అందుచేత ఉత్తరించు స్థలమును విడిచి నేను మోక్ష గృహమునకు పోవుచున్నాను. నీ తపసు జేసునాథునికి మిగుల ప్రియముగలదై యున్నందుచేత, వారు నిన్ను తమ స్నేహకుమార్తెగా తెలుసుకొనిరి. నీవు నిన్ను ఆత్మలకు బలిగాఒప్పగించి అలాగే నీవు ఆయుసుపరియంతము తపసుచేయు దేవచిత్తము " అని చెప్పి అదృశ్యమైపోయెను.

మిగుల ధైర్యముగల ఈకన్యాస్త్రీ, అది దేవచిత్తమని యెర్రిగి, తన జీవితకాలమంతయు ఆత్మలనుగురించి, భయంకర మైన తపసును చేసుకొనివచ్చినది. అధ్యానఅరణ్యములో వన వాసిగానుండి ఒకగుహాలో ప్రవేసించి, ముండ్లరొడ్డాణమును ధరించి అచ్చట ఫలించు ఆకులుములు తిని, ప్రతిరోజు ఉప వాసముచేయును. కొన్ని సంవత్సరములకు పిమ్మటఒక ఉద్యో గమునుగురించి అర్చ్య - తెరేసమ్మ కలిగించిన తొల్లేమ నగ రపు కర్మేల్ మఠమునకు వచ్చినపుడు, ఒకనాడు తనను మూడు

గంటలసేపు పంచతార్రిదుతో ఘోరముగా కొట్టుకొనినది. దానినిని ఆమెచేసిన వేరే తపసులనును ఆమఠ కన్యాస్త్రీలు చూచి అలాగుచేయునది మహాకూరరము గనుక, ఈకఠిన తప మును తగ్గించవలెనని ఆమెను ప్రార్థించిరి. అందుకు అతిశయ మైన ఈకన్యాస్త్రీ మరుత్తరముగా: "ఆరకనుండు అఘోర అగ్ని నరకములో పాపాత్మలు బాధింపబడుటయును, దానికి సమానమైన ఉత్తరించుస్థల నిప్పులో ఆత్మలు దండించ బడుట యునుచూచితిని. వీటినన్నిటిని చూచినపిమ్మట, పాపాత్మలు నర కములో పడకుండునట్టు వారలను ఆటంకపరచనును ఆత్మలను ఉత్తరించుస్థలమునుండి కాచిరక్షించనును నాచేతనయిన తప సంతయు చేయకనుండకూడునా? అందుచేతనే, దేవనీతికి నన్ను బలిగాఒప్పగించితిని" యనినది.

క్రీస్తువులారా! ఈ సుకృతాద్భుతమును వినినపిమ్మట అతిశయపడ వలసినదిగాక, ఉత్తరించు ఆత్మలనుగురించి మీరు చేయుతపక్రియలు మిగుల స్వల్పమని యెరిగిఇకమీదట ఏమి సత్క్రియలను చేయబోవుచున్నారని యోచించి చూడగల వారలు

5 జ్యో. 5 ప్రి. త్రిత్వ. చెప్పుట
స్వామీ పాతాళమునుండి మిమ్ము........
* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని... (13 పుటచూడు)

---

# 13-వ తేది.

## ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచేయునది జేసుక్రీస్తునాధునికి మిగుల ప్రియముగలపుణ్యా మని చూపించెడు వర్తమానము.

# ధ్యానము

జేసుక్రీస్తునాధస్వామి నిజమైన సర్వేశ్వరుడుగనుక, పోయినధ్యానములలో చెప్పిన న్యాయములన్ని వారికి చెల్లు ననుటకు సందేహము లేదు, మరియు వేరేకొన్ని ముఖాంతర ములనుగొని ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచేయు నది వారికి ఎంత ప్రియముగల పుణ్యమని కొంచెముసేపు ధ్యానించి చూడవలసినది.

1 ది :—జేసునాధస్వామి చెడిపోయిన మనుష్యులను రక్షించ ఏమిచేసినారని కొంచెము తలంచి చూడండి. సర్వ శక్తిగల స్వామి తామే మనుష్యుడుగా జన్మించ చిత్తమై, ఇల్లువాకిలి లేక సహాయముచేయువారు లేక, ఒక గుహలో పుట్టి, సకలవిధ కష్టయుపద్రవములలో పెరిగి, నింద అవమాన ములకులోనై, అతిశయమైన దారిద్రములో ముప్పది సంవత్స రములు గడపిన పిమ్మట, మహాప్రయాసంతో ఎచ్చటనుతిరిగి, లెక్కలేని అద్భుతములనుచేసి, తమయుపదేశమును అందరికిని బోధించిన పిమ్మట స్వమనసుతో తమ్ము తామే శత్రువులచే తిలో ఒప్పగించి, మాటలయందును తలంపునందును అణగని అవమానములను పాట్లను అనుభవించి భారమైనశిలువలో కొట్ట బడి. కఠినమరణము పొంది తమదివ్యరక్తమును చిందినారు గదా ? ఇవియన్ని చేయుటయందును అనుభవించుటయందు ను జేసునాధుడు తలంచి వెదకిన ఫలమేమి ? ఆత్మలను పాప మునుండిన్ని, నిత్యనరకమునుండిన్ని రక్షించి మోక్షపేరింపము నకు చేర్చుకొవలయుననుటే వారుతలంచి వెదకిన ఫలముగాక వేరుకాదు. ఇది ఇట్లుండగా, ఆయాత్మలు మోక్షమును పొం

దిన పిమ్మటమాత్రమే జేసుక్రీస్తునాథస్వామి కోరి వెదకినఫలము సంపూర్ణముగా నెరవేరుననుట నిశ్చయము.

అయితే ఉత్తరించు ఆత్మలు మోక్షమునకు పోవుటకు, వారలు దేవనీతికి చెల్లించవలసిన పరిహార అప్పు ఒక విఘ్నముగానుండుటచేత, ఈ విఘ్నము తొలగునంతవరకు స్వామితలంచిన ఫలము సరిగా పొందుటలేదు. అందుచేత వారు వెదకి పొందిన రక్షింపుకు ఒక కొరతయున్నట్టు మనసు నొచ్చుదురని చెప్పతగును. ఇది యిట్లుండగా, జేసుక్రీస్తునాథునిమీద భక్తిగలవారలు తమ చేతనయినమట్టుకు ఆయాత్మలు చెల్లించవలసిన పరిహార అప్పునుతీర్చి, వారలను మోక్షమునకు చేర్పించినట్టయితే, స్వామి వెదకిన రక్షింపును, వారుతలంచి కోరినఫలమును, నెరవేరునని చెప్పగలవారలము.

ఈ విషయము అధికముగా తేటయగునట్టు అపోస్తులైన అర్చ్య. చిన్నప్పగారు చెప్పెదానిని వినండి. "జేసుక్రీస్తు నాథుని తిరుపాటులకు కొరతగా నున్నవాటిని వారికి జ్ఞానశరీరమైన తిరుసభనుగురించి నాయందు నెరవేర్చుచున్నాను" అనిరి. ఆవిధముగానే జేసుక్రీస్తునాథుని జ్ఞాన అవయవములైన ఈ ఉత్తరించు ఆత్మలనుగురించి ప్రయాసపడువారలు, స్వామి పడిన పాటులకు కొరతగానుండు వాటిని తీర్చుకొనులాగు ఉన్నారని చెప్పవలయునుగదా ?

2 ది :—సర్వలోకములకు ఏలినవారైన జేసుక్రీస్తునాథుడు, ఈలోక కడపటిదినమందు సకలమనుష్యులను తీర్పుచేయుటకువచ్చి, మంచివారలను తమకుడిపార్శ్వమునందును, చెడ్డవారలను తమ ఎడమపార్శ్వమునందును నిలుపుదురు. అపుడువారు తమకుడిపార్శ్వమునన్ను మంచివారలనుచూచి

వచనించునది: "నా పితచేత ఆశీర్వదించ బడినవారలారా, రాండి, లోకారంభమునుండి మీకు సిద్ధపరచ బడియున్న రాజ్యమును స్వతంత్రపరచుకొనరాండి. ఎందుకంటే: ఆకలితోనుంటిమి, అప్పుడుమాకు భోజనము నిచ్చితిరి; దాహముతోనుంటిమి; అప్పుడు మాకు పానమునిచ్చితిరి; పరదేసిగానుంటిమి, అప్పుడు మమ్మును ఆదరించితిరి; వస్త్రములు లేక ఉంటిమి, అప్పుడు మాకు వస్త్రములనిచ్చితిరి; వ్యాధిగా నుంటిమి, అప్పుడుమమ్మును సంధించితిరి; చెరసాలలోనుంటిమి, అప్పుడు మాయొద్దకు వచ్చితిరి" అనుదురు.

అప్పుడు మంచివారలు వారికిప్రత్యుత్తరముగా చెప్పునది: 'ఏలినవారా మీరు ఆకలిగానుండేదిచూచి మేముమీకు భోజనము పెట్టినదన్ని, దాహముగానుండేది చూచి మేము మీకు పానమిచ్చినదిన్ని ఎప్పుడు? మరియు మీరు పరదేసిగానుండేదిచూచి మేము మిమ్ము ఆదరించినదిన్ని, లేకవస్త్రము లేకనుండేది చూచి మేము మీకు వస్త్రము లిచ్చినదిన్ని ఎప్పుడు? మీరు వ్యాధిగా, లేక చెరసాలలోనుండేదిచూచి మేముమిమ్ము దర్శించినది ఎప్పుడు? అనుదురు. అందుకు ఏలినవారైన జేసుక్రీస్తునాథస్వామి ప్రతియుత్తరముగా: "ఈ మాచిన్నవారలలో ఒకనికి మీరు అలాగుచేయునపుడంతయు మాకేచేసితిరని నిశ్చయముగా మీకుచెప్పుచున్నాము" అనుదురు.

క్రీస్తువులారా! జేసుక్రీస్తునాథుని గూర్చి చేయబడిన ఉపకార సహాయమువంటిటిని స్వామి అంతగా పొగడి, అవి తమకుచేయబడినట్టుగానే ఎంచి, వాటికి సంభావనగా మోక్షరాజ్యము నిచ్చుచున్నారే. ఇట్లుండగా నాశనమైపోవు శరీర

మునకు చేయబడు సహాయములకువారు అలాగుచేయుచున్నప్పుడు, చెడని ఆత్మలకు వారినిగురించి చేయబడు ఉపకార మేలులకు అధికముగా సంతోషపడి మేలైన సంభావన దయచేయుదు రనుటకు సందేహపడువారలుగలరా ? కాబట్టి ఉత్తరించుస్థల ఆత్మలకొరకు చేయునదంతయు స్వామికి అధికప్రియపడి మను ష్యునికి అధిక మేలు రప్పించుననుట నిశ్చయము. అయితే శరీ రమునకు సంబంధించిన ముందు చెప్పబడిన సత్కృత్యముల న్నియు సర్వేశ్వరుని గురించిచేసి వాటిని ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించినట్టయితే అధిక ఫలమును ఎక్కువ ప్రయోజనమునై యుండును. దీనినంతయు తగిన గవనముతో యోచించిచూ చినట్టయితే, ఉత్తరించు ఆత్మలమీద మీకు అధికభక్తి కలుగు ననుటకు సందేహము లేదు.

మరియు జేసుక్రీస్తునాధస్వామి ముందుచెప్పిన ప్రకార మే మంచివారలను ఆశీర్వదించి పొగడి వారలకు మోక్ష రాజ్యమును కట్టడచేసిన పిమ్మట, చెడ్డవారలను చూచి: "మీరు ముందుచెప్పబడిన సత్క్రియలనుచేయక పోయినందు న శపించబడి నిత్యనరకమునకు పోండి" అనుదురు. శరీర సం బంధమైన సత్కృత్యములను చేయని వారలను గురించి స్వామి నిత్యనరకమునకు త్రోసివేయునపుడు, ఆత్మసంబంధ మైన సత్కృత్యములను చేయనివారలకు ఏమి ఆజ్ఞాపించు దురు ? ఇది యిట్లుండగా, మీరు ఉత్తరించు ఆత్మలనుగురించి ఏమిన్ని చేయకనుందురేని స్వామియొద్ద ఏమి లెక్క చెప్పు కొనుదురో తలంచు కొనండి.

3 ది:—పరమదేవుడైన జేసుక్రీస్తు నాధస్వామి, సకల ఆత్మలను రక్షించి శ్లీవలో కొట్టబడి, పడరాని పాట్లుపడి, తమ

ధివ్య జీవమును సమర్పించబోవు సమయములోనే “ దాహాము గా నున్నాము ” అనిరి. స్వామి అనుభవించిన ఈ దాహాము నీళ్ల దాహామో ? వేరేదాహామో ? వారు అనుభవించిన దాహాము వారు ఆత్మలరక్షణమునుగూర్చి అనుభవించిన మితి లేని ఆశను కనుపరచుచున్నదని వేదశాస్త్రులు అందరు నిశ్చ యించి చెప్పుచున్నారు. జేసుక్రీస్తునాధునియొక్క దివ్యహృద యములో రగులుకొని మండు ఈ గొప్ప ఆశ ఉత్తరించు ఆత్మలు రక్షించబడి మోక్షపేరింప గృహాములో తమ యొద్ద కు చేరిరావలయునను ఆశేయని చెప్పతగును. ఆయాత్మలు తమయొద్దకు చేరువరకు వారి ఆశ తృప్తిపొందదు. మీకు ఎరుకలేని భిక్షకుడొకడు దాహాముగానున్నానని మీ యొద్ద కొంచెము నీళ్లు తిరిపె మడిగినట్టయితే దయతో నిచ్చుచున్నా రుగదా ? మీరక్షకుడుగాను, మిమ్మును అత్యంత స్నేహాము తో ప్రేమించెడువారుగాను, మీకు తీర్పువిధించెడువారుగా నున్న మీకర్తయైన స్వామి, ఉత్తరించు ఆత్మలరక్షణముమీద దాహాముగా నున్నానని మీయొద్ద చెప్పునపుడు మీరు వారి దాహామును తీర్చుటకు ఏమిన్ని చేయకనుందురో ? చేయవల యునన్నట్టయితే, మీజపతప దానధర్మములచేత, ఆయాత్మల కు ఉపకార సహాయమును చేయగలవారలు.

క్రీస్తువులారా, ఒకతోటలో మంచి వాన కురిసిన పిమ్మట పైరుచెట్లన్ని ప్రోడిగా పెరుగునుగదా ? ఇపుడు చెప్పిన న్యాయములు ఒక అదృష్టమైన వర్షమువలె మీ హృదయము లోపడి, దానిలో సుకృతపైరులైన ఉత్తమపుణ్యములు మొలి పించను, పండించను చేయవలసినది.

మొదటిది:-మిమ్మును కలిగించిరక్షించిన జేసునాధుని

మీద విశేషభక్తిపక్షము మీకుండినట్టయితే, వారు ఆశించిన ప్రకారము ఉత్తరించు ఆత్మలను మీ జపములవల్లను, దాన ధర్మములవల్లను రక్షింప ప్రయాసపడుదురు. దానినిచేయకుండాను దానిమీద ఆశలేకుండా నుండువాడు స్వామిమీద పక్షముగలవాడనియు, వారిశిష్యుడనియు, బిడ్డయనియు, చెప్ప వచ్చునో ? చెప్పకూడదు.

రెండవది:-ఎంతోమంది తాము రక్షణము పొందుదుమో లేదోయని సందేహపడి పరితపించుచున్నారు. మోక్షము పొందుదుమనెడు ధృఢమైన విశ్వాసమును వీడని నమ్మికయు నుకలుగుటకు ధర్మముచేయునది ఉత్తమమార్గమగును అయితే చేయకూడిన ధర్మములలోగా, ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయునది మేలైనధర్మము గనుక ఆయాత్మలమీదగల భక్తియగునది మోక్షమునకు పోవుటకొక తప్పని అడియాలమగును.

మూడవది :—స్వామి శ్లీవను మోసుకొని కపాలకొండకు పోవునపుడు వారికి సహాయముగా శిరేనూరి సిమయోనుడు తోడుపడినాడే. మరియు భక్తిగలస్త్రీ వెరోనికమ్మ, వారి తిరుముఖమును తుడిచెనే. వారలను భాగ్యముపొందిన అదృష్టశాలులని మీరు పొగడుదురుగదా ? అయితే మీరు ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచేయు వారలగుదురేని, వారలకంటే, మీరు భాగ్యవంతులని చెప్పవలసియున్నది. కాబట్టి యేసుక్రీస్తునాధునిమీద ఎంతభక్తిగలవారలుగా నుండెదరో అంత ఉత్తరించు ఆత్మలమీద భక్తిగలవారలుగా నుండవలయునని ఎరుగగలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృత జపము.

జేసునాథుని దివ్యహృదయమా! ఉత్తరించు ఆత్మల మీద దయగా నుండండి. (300 దినముల ఫలము.)

## జపము.

భారమైన తిరుశ్లీవలో మిమ్మును నిత్యపితకు యోగ్య బలిగా సమర్పించిన సద్గురువైన జేసువా! మృతిపొందిన మిత్రాణులయొక్కయు, గురువులయొక్కయు ఆత్మలను కృప తో చూచి ఉత్తరించుస్థలమునుండి వారలనురక్షించి సకల భాగ్యములను అనుభవించ వారలను మీయొద్దకు చేర్చుకొన వలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీ.... ఆమేన్ జేసు.

## అద్భుతము.

రాజైన దిమోట్లీసనువాడు మూర్ఖపతితుడుగానుండి, స్వరూపవందనము చేయరాదని క్రీస్తువులను నానా ఇబ్బంది పరచిన పిమ్మట, మరణ సంకటములోమాత్రము మనసు తిరిగి తనపాపములకు ఉత్తమమనస్తాపపడి పాపసంకీర్తనము చేసి కొంచి మరణముపొందెను. అయితే తాను చేసినపాపములకు తనుసుచేత తగిన పరిహారము చేయనందున, ఈపరిహార అప్పు ను ఉత్తరించుస్థలములో బహువేదననొంది చెల్లించవలసివచ్చి నది.

వానిభార్యయైన తెయోదోరాయను రాజ్ఞి, సత్యవేద ములో కొంచెమైనను తప్పులేక భక్తిగల పుణ్యాత్మురాలుగా నున్నందుచేత, తన భర్త మనసుతిరుగ మిగుల ప్రయాసపడు చువచ్చినది. రాజు చనిపోయిన పిమ్మట, వానియాత్మము ఉత్త రించు స్థలములో సహించరాని అబ్బలను అనుభవించుచున్న

దని ఎరిగి, ఆయాత్మకు ఊరట రప్పించేటట్లు, తాను విస్తార కన్నీళ్లు రాల్చి జపములు జపించినదిగాక, రాజ పరివారమందరును రాజు ఆత్మనిమిత్తము ప్రార్థింపచేసినది. మరియు కొంస్తాంతినోపిలు మహానగరమునందుగల సకల సన్యాసమఠముల యందును జపములనును పూజలనును తక్కిన వేడుదలలనును చేయకల్పించినది. అదియునుగాక ఆపట్టణపు అతిమేత్రాణులైన అర్చ్యు-మెత్రోదియుస్ అనువారు అన్ని గుళ్ళయందును పొత్తుజపప్రార్థనలు నడిపించునట్లు కల్పించిరి. మరియు రాజ్ఞి ఆయాత్మ నిమిత్తము దరిద్రులకు దానముచేసిన ద్రవ్యము ఎంతయని చెప్ప నలవికాదు.

ఇన్ని జపములకును, ధర్మక్రియలకును, దివ్య పూజలకును సర్వేశ్వరుడు చిత్తముకరిగి వారికోపము చల్లారి, రాజుయొక్క పరిహార అప్పుతీరి అతని ఆత్మము మోక్షమునకు పోయినది. ఆక్షణములోనే అతిమేత్రాణివారు పెద్దగుడిలో సమస్తజనుల సమేతమున జపముచేయుచుండునపుడు ఒక దేవదూతవచ్చి వారికిచెప్పినదేమనిన: అతిమేత్రాణివారా! మీరు చేసిన జపములు వినబడినవి. రాజుయొక్క ఆత్మము, మన్నింపునుపొంది మోక్షమునకు చేరినది" అనెను. అదే సమయములో రాజ్ఞియైన తెయోదోరా యనునామె ఒకదర్శనమునుగని, తాను చేసిన జపముల వల్లను, గురువులుచేసిన పూజలవల్లను రాజుయొక్క ఆత్మము ఉత్తరించు స్థల నిప్పునుండి రక్షింపబడి మోక్షమునకు పోవునట్టుగా ఎరిగినది. ఈ సంతోష సమాచారమువల్ల మనసుతేరి, రాజ్ఞియును అతిమేత్రాణివారును, ఆ గొప్ప నగరపు నివాసులందరును సర్వే

శ్వరునికి మే లెరిగిన స్తోత్రముగా జపములు చేసి బహు ఉత్సాహామును కొనియాడిరి.

క్రీస్తువులారా! ఇప్పుడు చెప్పిన రాజ్ఞి తన పురుషుడైన రాజుయొక్క ఆత్మనిమిత్తము అన్నిజపములు చేసి, ద్రవ్యములను ధర్మముగానిచ్చి, అన్ని దివ్యపూజలను ఒప్పగించ చేసినదే. మీరు చనిపోయిన మీవారల ఆత్మలనుగురించి అన్ని జప ధర్మపూజలను చేయజాలరనుటనిజమే. అయితే ఆయాత్మలను మరువక, వారలనిమిత్తము ప్రతిదినమును జపముచేసి మీ అంతస్తుకు తగినలాగు ధర్మమిచ్చి. సంవత్సరములో రెండు మూడు సారులైనను దివ్యపూజ ఒప్పగించ చేయ వలయునని ఎరుగ గలవారలు.

5 జో- 5 ప్రియ- 5 త్రిత్వ... చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని...(13పుటచూడు)

---

## 14 వ- తేది.

ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచేయునది దేవమాతకును, ఇతర మోక్షవాసులకును ప్రియముగలపుణ్యమని చూపించెడు వర్తమానము.

## ధ్యానము

మన ప్రియులైన జేసుక్రీస్తునాధస్వామి, మన నిమిత్తము పడరాని పాట్లుపడి, శిలువలో కొట్టబడి మృతి పొందబోవు సమయములో తమ దివ్యమాతను మనుష్యులకు తల్లిగా నిచ్చినారనియు, మనుష్యులను ఆమెకు బిడ్డలుగా ఆజ్ఞాపించినారని

యు అందరికి తెలిసిన పరమ సత్యముగా నున్నదిగదా ? అప్పుడు మరణము పొందబోవు సర్వేశక్తులైనస్వామి, తమ దివ్యమాత హృదయములో మనుష్యులమీద మితిలేని ప్రేమ నును పక్షమునును ఉంచినారనుటకు సందేహము లేదు.

కాబట్టి ఏకాలమును, ఏదేశమును, ఏజాతియును, ఏవయ సుగల క్రీస్తువులందరును ఏకోపించి ఒకేవార్తగా దేవమాత తమకు తల్లియని ఆమెను కొనియాడి, పొగడి, స్తుతించి, స్నే హించుకొని వచ్చుచున్నారు. ఆమెయోయనిన : మనుష్యు లందరు తమ బిడ్డలని వారలను ప్రేమించి పోషించి వారలకు ఏవిధ యుపకారములనును చేసుకొని వచ్చుచున్నదనుట అంద రికిని బట్టబయలుగా తెలిసిన విషయమగును. తల్లి తానుకనిన బిడ్డను మరచునో ఏమి ? ఆమె తన బిడ్డను మరచి పోయినప్ప టికి దేవమాత తమబిడ్డలైన మనుష్యులను ఒకనాటికిని మరువ నేరదు, వారలకు మేలు చేయకుండాను ఉండదు.

మనుష్యులందరికి దేవమాత తల్లియనేటప్పుడు, ఉత్త రించు ఆత్మలకు విశేషముగా ఆమెయే తల్లియని ఎంచవలసినది; చెప్పవలసినది. అది ఏలాగనగా: ఆ యాత్మలు సర్వేశ్వరునికిని జేసునాధునికిని మిగుల ప్రియపడి, ఇష్టప్రసాదముచేత నింప బడిన ఆత్మలు గనుక, వాటిని దేవమాతమిగుల స్నేహించు చున్నదనుట తప్పదు. మరియు తల్లి కష్టముచే సంకట మను భవించుచున్న తన బిడ్డకు అధిక పక్షము చూపించును గదా ? అది యిట్లుండగా ఎవ్విధ వేదనలనును అనుభవిం చుచున్న ఉత్తరించు ఆత్మలకు దేవమాత అధికపక్షము దయ చూపించునని చెప్పవలయును గదా ? ఆయాత్మలో యనిన తాము అనుభవించు అధిక బాధలలోనుండి, తమ తల్లియైన

దేవమాత శరణమునకు అభయధ్వనిచేసి మహాభక్తి నమ్మక ముతో ఆమెతమకు సహాయముగానుండ వలయునని ప్రార్థించి బలిమాలుకొనుచురు. వారలు దేవమాతయొక్క ప్రతాపము గల నామధేయమును ఉచ్చరించు నపుడు వారలకష్టములు ఉపశమించును, వేదనలుతగ్గును, అజ్ఞలు నివర్తించును, మోక్షపేరింపము ఆరంభమగును.

దేవమాత ఉత్తరించు ఆత్మలమీద పెట్టినపక్షము వ్యర్థపక్షము కాదు. ఈ పక్షమునిమిత్తము తమవల్లభముగల మనవిచేత, సర్వేశ్వరుడు ఎరిగిన విధముగా లెక్కలేని ఆత్మలను ఉత్తరించుస్థలమునుండి ఆమె బయలుదేర చేయునని వేదశాస్త్రులు నిశ్చయించి చెప్పుచున్నారు. అయితే ఇతర లెక్కలేని ఆత్మలు దేవనీతికి విశేష పరిహార అప్పును చెల్లించ వలసియున్నందు చేత, ఈ పరిహార అప్పుతీరిన పిమ్మట మాత్రము ఉత్తరించు స్థలమును విడిచి కడతేరుదురు. మనుష్యులు ఈ అప్పుకు ఉత్తరవాదము చేయకూడినందున, దానికి తగినట్టు తమ జపతప దానధర్మములను ఒప్పగించువారలగుదురేని, అది దేవమాతకు ఎంత ప్రియముగానుండును? అది ఎంతయనగా, ఏదోకడు వ్యాధిగాపడి కష్టపడుచున్న చిన్నవానికి మందుయిచ్చి, ఆచిన్న వానిని స్వస్థపరచినట్టయితే వాని తల్లికి ఎంతప్రియముగానుండునో, అంత ఆత్మలయొక్క పరిహారఅప్పును తీర్చవలసినవాటిని చేయుదుమేని, దేవమాతకు అధిక సంతోషము కలుగును. కాబట్టి ఉత్తరించు ఆత్మలమీద ఎంత అధికముగా భక్తినుంచుదుమో అంత కధికముగా దేవమాత మనమీద దయగా నుండుననుటకు సందేహము లేదు.

పరలోక భూలోకమునకు రాజ్ఞిగానుండు దేవమాత,

ఉత్తరించు స్థలమునకును రాజ్ఞిగానున్నదని చెప్పవలయునుగ దా ? అయితే ఆమె ఆవేదనలునిండిన రాజ్యములో, చెల్లించు కొనివచ్చు అధికారము, దండనవిధించుటకుకాదు, కృపచేయు అధికారమగును. కఠినజ్వరముతో ఆరాటపడువారలకు చల్లని నీళ్లు ఎంత ఆరుదలగానుండునో, కష్టపడు ఆయాత్మలకు దేవ మాతయొక్క దయ అంత ఆరుదలనిచ్చును. తమప్రతాపమైన పండుగలలో ఆమెయే ఉత్తరించుస్థలమునకుదిగి అనేక ఆత్మ లను తమయొక్క మనివివల్లను, పుణ్యఫలములవల్లను, సుకృత సహాయమువల్లను, రక్షించి మోక్షమునకు గొనిపోవునని పేరుపోయిన శాస్త్రిర్తైన జెరోన్సీయూసనువారు చెప్పియు న్నారు. తమమీాద అధికభక్తి నమ్మకమునుంచి తమ ఉత్తరీ యమునుధరించి దానితోచచ్చినవారల ఆత్మలను విశేషముగా తామసములేక ఉత్తరించు స్థలమునుండి బయలుదేర చేయునని, మూడవ ఇనోస్నెన్సియూసను అర్చ్యపాపుగారు వ్రాసిపెట్టిరి.

పూర్వవేదములో రాణియైన ఎస్తేరనునామె, కఠిన దండన తీర్పుకులోనైయున్న తమ జనులను రక్షింప, గొప్ప రాజుగానుండిన అస్సుయేరుస్ అనువానియొద్ద చనువు మా ట్లాడవచ్చినది; ఆమెను జూచి రాజు సంతోషపడి చెప్పినదేమ నిన: "రాణియైన ఎస్తేరా ! నీకుకావలసినదేది ? దేనినడిగినను ఇచ్చెద" ననెను. అపుడు ఎస్తేరమ్మరాణి: తన జనులకు విధిం పబడిన అన్యాయ ఆజ్ఞలోనుండి వారలను కాపాడి రక్షించ వలెనని ప్రార్థించినది. ఆమె మనవికి రాజు కనికరించి ఆజనులను రక్షించి కాపాడినాడని, వేదపుస్తకములో వ్రాయబడియున్న ది. ఆ ప్రకారముగా రాజ్ఞియైన దేవమాత, రాజాధిరాజైన తమ దివ్యకుమారుని ప్రార్థించి తమప్రజలైన ఉత్తరించు

15

ఆత్మలను, వారలకు విధించబడిన ఆజ్ఞలలో నుండి కాపాడి రక్షించుచునని చెప్పవలయునుగదా ?

మరియు దేవమాతను జూచి: కష్టిపడువారలకు ఆధరుగా! యని ప్రతిదినము ప్రార్థనలో అందరును కొనియాడుచున్నారే. అట్లుండగా ఉత్తరించు ఆత్మలు కష్టిపడులాగు ఈ లోకములో కష్టిపడువారలుగలరా ? లేరనినట్లయితే, దేవమాత ఆ యాత్మలకు విశేష ఆధరువుగానుండి ఓదార్పు రక్షించుచురని చెప్పవలయునుగదా ? కాబట్టి ఆమెనుజూచి : "వలినరాలా ! రాజ్ఞీ ! తల్లీ ! మేము ఉత్తరించుస్థలములో పడియుండునపుడు మాకు ఆధరవుగా నుండురని నమ్మికగా నున్నాము " అని చెప్పుదురుగాక.

కడసారి మోక్షవాసులును, కావల్గిగానుండే సన్మనసులును ఇతర సన్మనసులును ఉత్తరించు ఆత్మలను మిగుల స్నేహించు చున్నారనుటయును, వారల వేదనలు ముగుపేబహుగా ఆసించుచున్నారనుటయు నిశ్చయము గనుక తమ చేతనయినవరకు ఆయాత్మలకు సహాయము చేయుదురు. కాబట్టి ఇంకా ఈ లోకములో సంచరించెడు మనము ఆయాత్మల పరిహారఅప్పును మన ప్రయాసచేత తీర్చి వారలను మోక్షమునకు చేర్చ ప్రయాసపడుదుమేని ఆ మోక్షవాసు లందరును ఎంత సంతోషపడుదురనిన్ని మన మీాద ఎంత దయగా నుందురనిన్ని చెప్పసాధ్యముకానేరదు. కాబట్టి ఆ యాత్మల నిమిత్తమై మనము చేయునదంతయు దేవమాతకును అర్చ్యశిష్టవారలకును ప్రియపడునదిగాక వారల విశేష ఆధరువును మనకు రక్షించునని ఎరుగగలవారలు.

అనుగడుగుకు చెప్పవలననీసుకృతి జపము.

జేసునాథుని దివ్యహృదయమా! ఉత్తరించు ఆత్మల మీాద దయగానుండండి. (300 దినముల ఫలము)

## జపము.

మా సత్య సర్వేశ్వరుడగు జేసువా! నిత్యజీవమునిచ్చు తిరుశ్లీవ వల్లభముచేతను, మోక్షరాజ్ఞియగు దేవమాతయొక్క వేడుదలవల్లను మామీాద దయగానుండి మమ్ము కాచి రక్షించండిస్వామీా. నిత్యజీవ్యముయొక్క నమ్మికతోను చచ్చిన వారల ఆత్మలను కృపతో తలంచుకొని వారలను మీాయొద్దకు చేర్చుకొనవలయునని మిమ్ము ప్రార్థించుచున్నాము స్వామీా.

ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలను గురించి క్ష్మాపారసమంత్రము చెప్పుట.

## అద్భుతము.

రోమాపురమహానగరములో పత్రీసి అరుళప్పయనే ఒక ప్రభువుండెను. అయన మహా ధర్మిష్ఠుడగనుక దరిద్రులకు విస్తార ధర్మముల నిచ్చుచుండెను. పిమ్మట మంచివయసులో భాగ్యమైన మరణము పొందెను. అయిచే ఆయనయొద్దకొన్ని స్వల్పతప్పితములు ఉన్నందుచేత ఆయన ఆత్మము ఉత్తరించు స్థలమునకు పంపబడినది.

అప్పుడు గురుస్వాముల వారొకరు, అర్చ్య-శశీల్యమ్మ గారి దేవాలయములో ఒక దర్శనమును కనిరి. మోక్షరాజ్ఞియైన దేవమాత లెక్కలేని సన్మనస్కుల చేత పరివేష్టించబడి వాకుకందని ప్రతాపముతో ఒక ఉన్నత సింహాసనమున కూర్చుండియుండినది. పరమ నాయకియొక్క

మహిమనుగని అందరును పూజించి మౌనముగానుండునపుడు ఒక భిక్షుకురాలువచ్చి దేవమాతముందు సాష్టాంగముగాపడినది. ఆమెవస్త్రములన్ని చినిగిన చీలికెలుగానుండినను ఆమె భుజము మీద వెలహెచ్చైన దొకమంచి కప్పడముండినది. ఆభిక్షుకు రాలు మోక్షరాజ్ఞినిచూచి విస్తారమైన కన్నీళ్లురాల్చి చేసిన విన్నపమేమనిన: ఏలినరాలా! రాజ్ఞీ! తల్లీ! ఇప్పుడు చనిపో యిన పత్రీచ్చి ఆరుళప్పగారిని కృపాకటాక్షముతో చూడనవ ధరించండి. వారు ఉత్తరించుస్థలములో అనుభవించెడు వేదన లలోనుండి వారిని రక్షించండి. నేను వేసుకొనియుండు ఈ మం చికప్పడమును మిమ్ముగురించి ఏలినరాలా! ఈయనే నాకు దయచేసియున్నాడు. నే నపుడు చలిచేత బహుకష్టపడుచున్నం దుచేత ఈపచ్చడమునాకు గొప్పసహాయమైనది. మిమ్ముగురిం చి చేయబడిన సహాయముచేత ఆయనకు ప్రయోజనములేకుం డా ఉండవచ్చునా? కాబట్టి కృపనిండినతల్లీ! ఆయన యిపుడు ఉత్తరించుస్థలములో బహువేదన అనుభవించుచున్నాడనుట చేత ఆయనకు సహాయముగానుండండి. ఆయన నాకు మీపేరు చెప్పి ఈమంచి దుప్పటినిచ్చినట్టు ఆయనకు నిత్యమహిమభా గ్యమును కట్టడచేయవలయునని ప్రార్థించుచున్నాను. అనినది.

ఆ భిక్షుకురాలు మూడుమారులు ఈ విన్నపమును చేయగానే, కూడనుండిన సన్మనస్కులును అర్చ్యశిష్టవారలును మోక్షరాజ్ఞినిచూచి, ఏలినరాలా! ఈ విన్నపమును అంగీకరిం చి ఆమె అడుగుకొనులాగుననే ఉత్తరువు కావలయుననని, ప్రార్థించిరి. అపుడు దేవమాత, పత్రీచ్చి ఆరుళప్పగారిని తీసు కొనిరాను ఆజ్ఞాపించినది. అరుళప్పగారు భారమైన సంకెండ్ల చేతకట్టబడి, అధిక వేదననొందు విధముగా దేవమాత సింహా

సనము యొద్దకు తీసుక బాబడి అంగలార్చుచునిలిచెను. వెంటనే దేవమాత భిక్షుకురాలు అడిగినలాగే కానిమ్మని చేతితో సైగ చేయగానే, అరుళప్పగారి చేతులకు కట్టబడియున్న సంకెండ్లు ఊడి, వారిదుఃఖము మహిమగా మారి మోక్షవాసుల ప్రతాపముతో కనిపించిరి. వారిని మోక్షరాజ్ఞి కుమారునివలె కౌగలించి, అర్చ్యశిష్టులు వారిని తమకు తోడుగాను, సహోదరుడుగాను కొనియాడి అందరును ఒడ్డోలకముగా మోక్షపేరింప రాజ్యమునకు వేంచేసిపోయిరి. ఇదియంతా ముందుచెప్పబడిన గురుస్వాములవారు చూచినపిమ్మట దర్శనము మరుగై పోయినది.

క్రీస్తువులారా! దేవమాతనుగురించి చేసినధర్మము అంత బలముగలదనిచూచి, ఉత్తరించు ఆత్మలనుగురించి పరిశుద్ధకన్యక పేరుచెప్పి అడుగడుగుకు భిక్షాదానముచేయండి.

"మిమ్మును నిత్యగుడారములలోకి చేర్చుకొనునట్లు, ఈలోకద్రవ్యములగుండా మీకు స్నేహితులను సంపాదించుకొనండి" అని స్వామి వచనించియున్నారే. మోక్షపేరింపమును పొంద ఆశించే మీరు ధర్మములను విస్తారముగా చేయుదురుగాక. దేవమాత ఉత్తరించుస్థలమునకు రాజ్ఞిగనుక ఉత్తరించు ఆత్మలనుగురించి ప్రయాసపడునదే ఆమెకు మిగుల ప్రియమని ఎరిగి ముందుచేసినదానికంటె అధికముగా చేయవలయునని ఎరుగగలవారలు.

5 జ్యో-5 ప్రియ-5 త్రిత్వ...చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని (18 పుటచూడు)

# 15-వ తేది.

## ఉత్తరించు ఆత్మలను గురించి ప్రయాసపడునది మహిమ గల పుణ్యమని చూపించెడు వర్తమానము.

## ధ్యానము.

ఉత్తరించు ఆత్మలమీద అధికాధికముగా మీకు భక్తి కలిగేటట్టు ఆ యాత్మల మహిమ ఎంతయని కొంచెమైనను చూపించవలసియున్నది. ఈ మహిమ కనిపట్టుటకు మొట్ట మొదట మనుష్యునియొక్క ఆత్మము ఎటువంటిదన ఎరుగవలసినది. సకలలోకములను కలిగించినవారును, సకలమును నాశనము చేయ వల్లభముగలవారునై యుండెడు సర్వేశ్వరుడు ఆ యాత్మను తమ రూపముగా కలిగించినదిగాక, ఆయాత్మము తమకుగల సకలమేలులను మితిలేక, ముగింపులేక, తమయొద్ద అనుభవించునట్టు కలిగించిరి. సూర్యుడు, చంద్రుడు, నవగ్రహములు మొదలైన సకల నక్షత్రములనును, భూమండలము నందుగల సకలమునును సర్వేశ్వరుడు మనుష్యుని నిమిత్తమయ్యే సృష్టించి నారనుటచేత, అన్నిటికంటె హెచ్చైన మహిమను మనుష్యుడు గొనియున్నాడని చెప్పవలయునుగదా ?

మరియు వాని ఆత్మయొక్క మహిమను అధికముగా కనిపట్టునట్టు ఆయాత్మనురక్షించ జేసునాధస్వామి చేసినదిని పడినదిని ఇంకా కొంచెము యోచించవలసినది. సత్యముగానే ఆయాత్మను రక్షించ వారు నిజమైన దేవుడుగానుండి మనుష్యుడుగా జనియించి, మితిలేని ఫలముగలదైన శ్రాముపడిన నింద అవమానములనును, బాధవేదనలనన్ని పూర్ణముగా

దానికి వెలలగా నిచ్చినారుగదా? మైకము లేక, చీకటి లేక, తేటైన దర్శన జ్ఞానము గలవారైన స్వామి, ఈలాగు ఆత్మను గమనించినపిమ్మట, మేము దాని ఘనమునుచూపించ వేరొక న్యాయము వెదుకవలసినదా? కాబట్టి మితిలేనిఘనముగల తమ పాటులను ఒక ఆత్మకు క్రయముగా ఏలినవారు స్వయిచ్ఛగా నిచ్చియుండగా, మనము దానిని మతించునట్లు అధికముగా వివరింప సాధ్యముకాదు.

మనుష్యునియొక్క ఆత్మమహిమ సాధారణ విధముగా అతులనుండగా, ఉత్తరించు ఆత్మలఘనత అందుకు మించినదనే చెప్పవలసినది. అది ఏలాగనగా, ఆత్మయందుండవలసిన వరములలోగా, ఇష్టప్రసాదమనునది అన్నిటికిమించిన వరమనుట నిశ్చయము. ఆయాత్మలన్ని ఇష్టప్రసాదముతో మృతిపొంది, దేవస్నేహమందు తప్పిపోక, నిలవరము గొనియున్నారుగదా? వారలు చెల్లించవలసిన పరిహార అప్పు తీరినతోడనే సర్వేశ్వరుని ప్రత్యక్షదర్శనముపొంది, మోక్షపేరింప రాజ్యములో సూర్యకిరణమువలె ప్రకాశించి, రాజులవలె ప్రతాపకిరీటము ధరింపబడి, సంతోషప్రవాహములో మునిగి సదా వర్ధిలుచుందురనుట తప్పనిసత్యమగును. ఇట్లుండగా ఇటువంటి ఆత్మలకొరకు వేసుకొన ప్రయాసపడునది మహా మహిమయునిన్ని చెప్పవలయునుగదా?

మనుష్యులు ఈలోకమందు చేయతగు యుద్యోగములలోగా గురువులుచేయు ఉద్యోగమే మేలైన ఉద్యోగమని అర్చ్య-గ్రేగోరియుసనే పాపుగారు వచనించియున్నారు. అదేమనగా, ఇతర యుద్యోగములన్ని నశించిపోవు శరీరసంబంధమైన యుద్యోగములై యుండగా, నాశనములేని ఆత్మలను

విచారించు ఉద్యోగము గురువుల ఉద్యోగమగును. జేసు నాథస్వామి చేసిన ఉద్యోగమును ఈ ఉద్యోగమును ఒకటే యగును. గురువులు అందరికిని బుద్ధిమతులు చెప్పి, ఆత్మ చెడిపోకుండుటకు పాపమును నిషేధించనును, పుణ్యము ను చేయనును బోధించుకొని వచ్చుచున్నారు. మరియు ఆత్మయొక్క పలు అవసరములకు స్వామిచేత స్థాపించబడిన (ఏడు) దేవద్రవ్య అనుమానములనును ఇచ్చుచున్నారుగదా ? మరిన్ని జేసునాథస్వామి పొందిన మతిలేనిఫలముగల దివ్యమరణముచేత రక్షింపబడిన ఆత్మలు మోసముజెందకుండునట్లు, అనేక గురువులు స్వదేశము, ఇల్లువాకిలి, ఆస్తిపాస్తిని విడిచిపెట్టి సకలమును త్యజించి, సకలకష్టములకును, చావుకు సహా తెగించి, అన్యదేశములకు పోయికూడా మిగుల ప్రయాసపడుచున్నారుగదా ? అయితే వారలుతలంచిన ఫలము సరిగా చిక్కునో చిక్కదో సందేహము. అది ఏలాగనగా, మనుష్యుడు ఈలోకములో నున్నంతమట్టుకు చేయగల, చేయరాని మనస్వతంత్రము గలవాడై యుండుటచేత, సన్మార్గములో దృఢముగా నెలకొని మోక్షము పొందునో, లేక బుద్ధి చెడి పుణ్యమార్గమును విడిచి నిర్భాగ్యముగా చచ్చునోయని తెలియని సంగతిగానున్నది. అందువల్ల ఈలోకములోగల ఆత్మలనుగురించి ప్రయాసపడునది మంచిదైనను, మనకీప్రయాస ఫలముగలదైనను, ఈప్రయాస ఆయాత్మలకు ప్రయోగించునో ప్రయోగింపదో తెలియదు. అయితే ఉత్తరించు ఆత్మలను గురించి ప్రయాసపడునది ఆలాగుకాదే. ఆయాత్మలు ఇష్టప్రసాదమునందును దేవస్నేహమునందును స్థిరపడి నిలకడయను పరమ వరమును గొనియున్నారనుటచేత ఒకనాటికిని పాప

ము చేయనేరరు, ఒక నాటికిని చెడిపోనేరరు. ఉత్తరింపు తీరి నపిమ్మట నిత్యమోక్షములో సదా వర్ధిలుచుందురనుట నిశ్చయముగనుక, వారలను గురించి చేయునదంతయును చేసినవారలకు ఫలించుటయేగాక, ఆయాత్మలకును ప్రయోగించుననుట తప్పని సత్యమగును.

మరియు సువిశేషములో వ్రాయబడినలాగు మనరక్షకుడైన జేసునాథస్వామి తమస్నేహితుడైన లాజరుని మరణమును గురించి ఏడ్చిరి. పిమ్మట వీరు లాజరుని స్థాపితముచేసిన సమాధి దగ్గిరకుపోయి దానిని మూసియున్న రాయిని తీసివేయమనిచెప్పి "లాజరా లేచి బయటికిరమ్ము" అని బిగ్గరగా చెప్పిరి. ఆక్షణమే నాలుగురోజులనాడు చనిపోయియున్న లాజరుడు జీవముతో సమాధినుండి లేచివచ్చెను. స్వామి ఆలాగుచేసినది గొప్ప అద్భుతమనినను మనము ఉత్తరించుస్థలములో నుండువారలకు చేయుసహాయము అంతకంటే అధికమైనదిగా తోచును. ఏలాగనగా: ఈ ఆత్మలమీద భక్తిగా నుండువాడు వారలు చెల్లించవలసిన పరిహారఅప్పును తన ప్రయాసవల్లతీర్చి వారలను పిలిచి "మీరు చెరబడియుండు స్థలములోనుండి బయులుదేరి, నిజమైన జీవమైన నిత్య పేరింపమునకుపోండి" అనులాగు వాడు యోచించ తగినదిగానున్నది. ఆయాత్మలోయనిన ఉత్తరించుస్థలమునువిడిచి మిగుల సంతోషముతోనును, మహాప్రతాపముతోనును మోక్షమునకు పోవునపుడు, తమ్మును ఉత్తరించుస్థల అవధినుండి విడిపించిన వానిని పొగడి కొనియాడి దీవించి, వానికొరకు ఏలినవారిని ప్రార్థించుదురుగదా? లాజరనువారు జేసునాథస్వామిచేత, జీవింపబడియున్నను, వారుకొన్నియేండ్లకు తరువాత

మరల చనిపోయిరి. రక్షింపబడిన ఉత్తరించు ఆత్మలోయనిన, సదాకాలము కొరతలేక, ముగింపులేక వర్ధిలి తృప్తిపొంది, భాగ్యమంతటిని అనుభవించి సర్వేశ్వరునియొద్ద జీవించు కొనియుందురు. ఉత్తరించు ఆత్మలమీాద భక్తిగలవారలారా! మీారు చేయునది ఎంత గొప్పకార్యమని దీనివల్ల తెలుసుకొనండి.

కడసారి యేసునాథస్వామి శిలువలో కొట్టబడి మృతిపొంది నతోడనే, వారి ప్రతాపముగల తిరు ఆత్మము, పాతాళస్థలము నకుదిగి, అక్కడనున్న పుణ్యాత్ములకు తమ్మును చూపించి అక్కడనుండి వారలను విడిపించి, తనుతో కూడా మోక్షము నకు తీసుకొని పోయినారుగదా? ఇదిగో మనము ఉత్తరించు ఆత్మలను రక్షించునపుడు చేయు ఉద్యోగమును అదే. దీనికి మించిన ఉద్యోగముగలదో చూడండి. అయితే దానికిని దీని కిని ఒక గొప్పవ్యత్యాసముందుననుట నిజమే. మనచేత రక్షిం చబడిన ఆత్మలు పేరింపగృహమునకు పోవునపుడు మనము ఈ కన్నీటి కనమలో క్రూర శత్రువులమధ్య చిక్కుకొనియున్నా మే. అయితే పరితాపమునిండిన ఆయాత్మలు పేరింపముగా వర్ధిలునపుడు తమ్మును రక్షించినవారలను మరచుదురా? మరచిపోవడము ఈ భూలోకములో నున్నదేగాని, పరలోక ములో లేదు. కాబట్టి మోక్షవాసులైన ఆయాత్మలు మనలను తలంచి చేయెత్తి తమయొద్దకు చేర్చుదురనుట దృఢముగా నమ్మతగిన విషయమతాను. కాబట్టి ఆయాత్మలమీాద అధికా ధికముగా భక్తినుంచవలయునని ఎరుగగలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

యేసునాథుని దివ్యహృదయమా! ఉత్తరించు ఆత్మల మీాద దయగానుండండి. (300 దినముల ఫలము)

# జ ప ము.

జీవితులకు జీవమును, మృతిపొందినవారలకు నమ్మికమును, మిమ్మును విశ్వసించువారలకు రక్షణముగా నుండెడు సర్వేశ్వరా! స్త్రీ పురుషులైన విశ్వాసులయొక్క ఆత్మలు, తాముచేసిన తప్పితములకు మన్నింపునుపొంది, దేవమాత సహాయమువల్లను, సకలమోక్షవాసుల వేడుదలవల్లను, నిత్య ప్రకాశమునును, నిత్యసమాధానమునును గైకొనచేయవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమేన్.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలను గురించి ముప్పదిమూడు పూసల జపమును చేయుట.

# అ ద్భు త ము.

అర్చ్య. తెరేసమ్మ ఉత్తరించు ఆత్మలమీద మహాభక్తిగలదిగా నున్నందుచేత, ఆ యాత్మలకు విశ్రాంతిని రప్పించేటట్లు, అనేకజపములను తపసులను చేసుకొనివచ్చునదిగాక, తానుకలిగించిన సభకులోపడిన కన్యాస్త్రీలందరును ఆయాత్మలకొరకు ప్రయాసపడవలయునని ఆజ్ఞాపించినది.

ఒక సంవత్సరము ఉత్తరించు ఆత్మల పండుగనాడు ఆమె, ఆయాత్మలను గురించి జపముచేయునపుడు, మనుష్యులకును సర్వేశ్వరునికిని శత్రువుగానున్న దుర్మనప్పిశాచి ఆమెకు పలుపరాకులను రప్పించ యత్నించినది. అయితే ఆపుణ్యవతియైన కన్యాస్త్రీ దేవకృపనుగొని పిశాచిని పారదోలి జపమును కొరతలేక ముగించినది. జపము ముగిసినతోడనే ఆ

జపములకు ఫలితముగా అనేక ఆత్మలు ఉత్తరించుస్థలమునుండి రక్షింపబడి మోక్షమునకు పోవుటను చూచినది.

మంౡడేసా యనెడు ఒకప్రభువు వల్లదోలిత్తనెడు పట్టణములో, దేవమాతపేరట అర్ప్య. తెరేసమ్మ తమసభకు చేరిన మఠమొకటి స్థాపించునట్లు, ఆమెకొక మంచియిల్లున్ను, అలంకారమైన తోటనున్ను ఇచ్చియుండెను. మరియు ఆప్రభువు తనకేదొక హానిసంభవించునో ఏమోయని భయమొంది, ఆమఠమును శీఘ్రముగా ముగించునట్లు అడుగుకొనియుండెను. ఈ భయము ఆయనకు సర్వేశ్వరునినుండి వచ్చినదని తలంచదగినదిగా నున్నది. ఎందుకంటే కొన్ని రోజులకు పిమ్మట దూరములో నుండునపుడు గురువులు లేని స్థలములో, పాపసంకీర్తనను అవస్తాభ్యాంగమును లేక, అకస్మాత్తుగా చనిపోయెను. ఆయన అధిక ఆస్తిమంతుడుగాను, కీర్తిమహిమగలవాడుగాను, ఈలోక చెల్వ భాగ్యమును వెదకువాడుగాను ఉండినదిగాక, ఆయన నడత మంచిక్రీస్తునికి తగిననడత కాదు. కాబట్టి అర్ప్య-తేరేసమ్మ ఆయన చచ్చిన సమాచారమును విని, సర్వేశ్వరుడు ఆయనకు మంచితీర్పుయిచ్చినారో, లేదో, ఎరుగనందుచేత బహుకష్టినొంది, ఆయన ఆత్మము నిమిత్తము విస్తార కన్నీళ్ళు రాల్చి జపము చేసినది. ఆమె జపముచేయునపుడు జేసునాథస్వామి ఆమెకు కనిపించి, అదొర దేవమాత పేరట ఒకమఠమును ఏర్పరచ కావలసిన వాటిని యిచ్చియున్నందుచేతను, దేవమాత వానికొరకు వేడుకొని యున్నందుచేతను, వాడు చనిపోవు సమయములో ఉత్తమ మనస్తాపపడి నిత్య నరకమునకు తప్పినాడనియు, అయితే ఆ మఠములో మొదటిపూజ చేయబడేవరకు వాడు ఉత్తరించు స్థలములో

బహుVేదన అనుభవించతీర్వ విధించబడినాడనియు ఎరిగించిరి. దానిని అర్చ్య-తెరేసమ్మవిని, అమఠము శీఘ్రముగా ముగియు నును, దానిలో దివ్యపూజ తామసము లేకుండా చేయబడ నును బహు ప్రయాసపడుచువచ్చినది. ఆమె ఎంత ప్రయాస పడినను పని శీఘ్రముగా ముగియలేదు. అపుడు జేసునాథుడు ఆమెకు దర్శనమై ఆయాత్మము ఉత్తరించుస్థలములో బహుగా బాధపడుటచేత, మేము కట్టడ చేసినదానిని శీఘ్రము నెరవేర్చ వలయుననిరి. అపుడు కన్యాస్త్రీయమ్మ, మఠముయొక్క గుడి యింకా ముగువక పోయినను, ఒక అరలో పీఠమును తయారు చేసి, దానిలో దివ్యపూజచేసి ఒప్పగించచేసినది. ఆమె దివ్య సత్ప్రసాదము తీయుసమయములో ముందు చెప్పబడిన దొర యొక్క ఆత్మము మిగుల మహిమ సంతోషముతో ఆమెకు కనిపించి మేలెరిగిన మనసుతో స్తోత్రము చెప్పి తానుమోక్ష మునకు పోవుచున్నట్టుగా ఆమెకు ఎరిగించినది. దానినిగని ఆ అర్చ్యశిష్టురాలు, సంతోష ప్రవాహములో మునిగి అంత దయచేసిన సర్వేశ్వరుని మిగులస్తుతించినది.

క్రీస్తువులారా, అర్చ్యశిష్ట వారలందరును ఉత్తరించు ఆత్మలమీద భక్తిగలవారలై యున్నారే. మీరును అలాగే యుండవలసినది.

దేవమాతనుగురించి చేసినధర్మముచేత, ముందుచెప్పబ డినదొర, నిత్యనరకమునకు తప్పినాడని వినియుంటిరే. మీరును నిత్యనరకమునకు తప్పించుకునేటట్టు, దేవమాతమీద భక్తిగా నుండేదిగాక, ఆమెను గురించి కొన్ని ధర్మములను చేయ వలసినది.

పైచెప్పిన దొరయొక్క ఆత్మము దివ్యపూజ జరిగిన

పిమ్మటమాత్రమే ఉత్తరించుస్థలమునుండి రక్షింపబడి నిత్యాపే రింప గృహమునకు పోయినది. ఇందుచేత ఆత్మలనుగురించి చేయకూడిన సకల సత్క్రియలలోను, దివ్యపూజ అధికరించి నదిగా నుండుటచేత, మీచేత నయినంతమట్టుకు అడుగడుగుకు దివ్యపూజ ఒప్పగించ చేయవలయునని ఎరుగగలవారలు.

5 జ్యో- 5 ప్రియ-5 త్రీత్వ... చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని (13 పుటచూచు)

---

# 16-వ తేది.

ఉత్తరించు ఆత్మలు మనకు స్వాంతమైన ఆత్మలని చూపించెడు వర్తమానము.

## ధ్యానము.

ఉత్తరించు ఆత్మలమీద భక్తిగానుండవలయుననుటకు, ముందు చెప్పిన, న్యాయములు బలమైన న్యాయములుగానుండి నను, అనేకమంది క్రీస్తువులు వీటిని గవనముగా విచారించిచూ డక, ఆయాత్మలను మరచిపోయి వారల అవధిని తగ్గించ ఏమి నిచేయక నుంటున్నారు. ఆలాగు ఉత్తరించు ఆత్మలను మరచి వారలనిమిత్తము ఏమిని చేయకనుండునది ఎంత గొప్పక్రూర త్వమని ఇపుడు చూపించెదము. ఏదొకడు తన స్వాంతమైనవా రలను విచారించక పోయినట్టయితే, వాడు సత్యవేదమును విడిచి అజ్ఞానికంటె చెడినవాడుగానున్నాడని అర్చ్య-చిన్నప్ప గారు తిమోత్తేయు రెండవనిరూపము అయిదవ అధ్యాయము

ఏడవవచనములో వ్రాసియున్నారు. ఉత్తరించు ఆత్మలు మనకు స్వంతమైన ఆత్మలని చూపింతెదమేని, వారలను విచారించక పోవునది గొప్పద్రోహమనియు గొప్ప క్రూరమనియు ఒప్పించి నట్టగునుగదా?

1 ది:—సకల ఉత్తరించు ఆత్మలును మనతండ్రియైన సర్వేశ్వరుని చేతకలిగింపబడి, వారిప్రతాపముగల రూపమును ధరించి వారి యిష్టప్రసాదముతో మరణముపొంది, సదాకాలము వారితోవర్థిల నియమించబడియుండగా ఆయాత్మలు మనకు సంబంధములేని ఆత్మలని చెప్పకూడునో? తలంచకూడునో? మరియు మన ఏలినవారుగాను రక్షకుడుగాను, సహోదరుడుగానున్న శేసుక్రీస్తునాధునియొక్క దివ్యరక్తముచేత ఆయాత్మలు రక్షింపబడి, వారి జ్ఞాన అవయవములుగానుండి, వారితో దేవస్నేహముచేత పీడని బాధనముగా నేకీభవించి, వారితో కూడా నిత్యమునందు ఏవిధ భాగ్యములనును అనుభవించ తెలుసుకొనబడియుండగా, ఆయాత్మలనుమీకు దూరమైన ఆత్మలనిమెదరో? సంబంధములేని ఆత్మలని తలంచెదరో? మరియు సకలమైన క్రీస్తువులకు సర్వేశ్వరుడు ఒకేతండ్రిన్ని, శేసునాధుడు ఒకేరక్షకుడును, దేవమాత ఒకే తల్లిన్ని, జ్ఞానస్నానము ఒకే జ్ఞానముద్రయును, తిరుసభ ఒకే జ్ఞానమందయును, మోక్షభాగ్యము ఒకేగతియు నైనందుచేత, అందరును ఒకే జ్ఞానకుటుంబమును, ఒకే జ్ఞానశరీరమును, ఒకే ఆత్మయునైయున్నారే. ఇది ఇట్లుండగా, చచ్చినవారల ఆత్మలను బ్రతికియుండే వారలమైన మనము అన్యుల ఆత్మలని చెప్పవచ్చునో? సంబంధములేని ఆత్మలని తలంచవచ్చునో? వారలమీద దయలేక ఉండవచ్చునో? వారలకు సహాయములేక, ఊరటలేక

వారలను కష్ట స్థితిలో విడిచిపెట్టవచ్చునో? వారలను ఆలాగు విడిచిపెట్టినట్టయితే, అది గొప్పఅన్యాయమును బలమైన క్రూరత్వమని మీకు తెలియదో?

2 ది:—ఉత్తరించు ఆత్మలను ఈలాగు మొత్తము మీద చూచినట్టయితే మీకు స్వంతము కాని వారలన్నను, ఆ యాత్మలలోగా ఎన్నో ఆత్మలు మీకు అధికసంబంధమును, అధిక బంధనమును, అధికస్వంతమును గలవారలైయున్నారని చూడండి. మీ దేశస్థులు, ఊరివారలనును, స్నేహితులు ఉపకారులనును, బంధువులనును, ఉపాధ్యాయులు ఉపదేశులనను గురువులనును మైత్రాణులనును మీకు సంబంధములేని వారలని తలంచకూడునో? ఆలాగు చెప్పను తలంచను కూడదనినట్టయితే, వారల ఆత్మలనిమిత్తము ఏదైనను చేయ ప్రయాసపడవద్దా? మిమ్మును గురించి మీగురువులును, ఉపదేశులు ఉపాధ్యాయులును, ఎంతకష్టపడి, మిమ్మును మోక్షమునకు పోవుమార్గములో నడిపించుచున్నారని ఎరుగనేరరో? మీ బంధువులు ఎప్పుడును మీతోనుండి, శుభా శుభముల యందు మీకు తోడుపడినారనియు, ఎంతసహాయముచేసినారనియు తలంచకయున్నారో? మీరుపడిన కష్టసంకటములలో, మీ స్నేహితులు ఉపకారులును మీకు ఎంత పక్షమును చూపించి, ఎన్నియుపకారములను చేసుకొని వచ్చినారని మీకు తెలియకుండునో? మీ ఊరి వారలు దేశస్థులును, మీతో ఒకజాతియును, ఒక వంశముగానున్నందుచేత మీకు అన్నిటియందును ఉపకరించినారని యోచించక యున్నారో? నిజముగానే సత్యముగానే, వీరలందరును మీకు మిగుల స్వంతమనియు, బంధుత్వమనియు, బాధనమనియు, చుట్టరికమనియు

చెప్పవలయునుగదా ? ఇదినిజమనినట్టయితే వారల ఆత్మలను మరచిపోక, వారలను ఉత్తరించుస్థలమునుండి రక్షించ మీా జపతప దానధర్మములవల్ల ప్రయాస పడవలయుననుటకు సందేహము లేదు.

3 ది :——మీా తలి దండ్రులనును, బిడ్డలనును, పెనిమిటి భార్యనును, అన్న దమ్ములనును, అక్క చెల్లెండ్లనును, అత్తమామలనును, తాతఅవ్వలనును, బావమర్దులనును మీాకు మిగుల స్వాంతమనియు దగ్గిర బంధుత్వమనియు తగిన బంధనమనియు కొంచెమైనను ఒప్పుకొనెదరు. అయితే, వారలుచచ్చిన పిమ్మట కొంచెముపడ్చి, పిమ్మటవారలను బొత్తిగామరచినట్టు వారల ఆత్మఎడల బహు అశ్రద్ధగా నున్నారనుట అందరికి తెలిసిన విషయము. వారలు జీవముతోనున్నపుడు ఏదొకవ్యాధిచే కష్టపడుచుండుటగాని, ఇల్లుచెడి అప్పలు పడుచుండుటను గాని, లేక ఏదొకకీడు నిమిత్తము కష్టిపడుచుండుటను గాని మీారు చూచినట్టయితే, పడరాని ప్రయాసలుపడి, చేయరాని ఖర్చులుచేసి, దేనికి భయపడక వెనుకు దీయక, వారలను కాపాడను ఆదరించను తేర్చను మిగుల పాటుపడితిరిగదా ? అయితే ఇపుడువారలు ఉత్తరించుస్థలములో అధికకష్టమును అధిక కష్టియును అధిక వేదనయును అనుభవించు చున్నారని మీారు ఎరిగియున్నప్పటికి వారలకు ఆరుదలయును విశ్రాంతియును రప్పించ ఏమియునుచేయక నుందునదెట్లు ? ఆయాత్మలకు మీాచేతకూడినదంతయు చేయకపోయినట్టయితే, మీారు తోడేలు ఎలుగు పులి మొదలగు దుష్టమృగములకన్న అధిక కూ్రరత్వముగలవారలని చెప్పవలసినది. మీారు వాసముచేయు ఇల్లున్ను, ధరించియున్న వస్త్రములున్ను, దున్నెడు కొరము

ట్లున్ను పండించెడుభూమిన్ని, వడ్డీకియిచ్చియున్న పైకమున్ను, చేయు ఉద్యోగమున్ను, అనుభవించెదు ఆస్థిన్ని మీతలిదండ్రి, తాతముత్తాలు సంపాదించి యిచ్చి పోయిన వేగనుక, వీటినన్ని టినిని చనిపోయిన వీరలపేరుసహా, మీ అప్పునును, రాత్రిం బగలు మీకు ఎడతెగక జ్ఞాపకపరచు చున్నదిగదా? ఇది యంతా మీకు తెలియక పోవునా? మరియు మీ ఊరి పొలిమేరలోనుండు సమాధులలోనుండి ఒక శబ్దము బయలు దేరులాగు "మామీద దయగానుండండి, దయగానుండండి" అని చచ్చిన వారలు మిమ్ముచూచి అభయధ్వనిగా కూయు లాగు తలంచుకొనండి. ఈ అభయశబ్దమువలనకూడా మీరు మనసు కరుగని కఠిన చిత్తులుగా నున్నట్లయితే ఇకమీదట మీకు ఏమిచెప్పగలము? అర్చ్య. చిన్నప్పగారు వచనించి నట్లు, మీరు మీవారల ఆత్మలను తలంచని దానినిగురించి సత్యవేదమును విడిచిపెట్టినలాగు, అజ్ఞానులకంటెమీరు చెడి పోయిన వారలనియు, క్రూరత్వముగలవారలనియు, మిమ్ముచు చెప్పవలసినది.

క్రీస్తువులారా! అర్చ్య. చిన్నప్పగారు వ్రాసిపెట్టిన ఈ భయంకరమైన వాక్యము మీకు తగలకుండునట్లు, సకల ఉత్త రించు ఆత్మలమీదను, విశేషముగా మీవారల ఆత్మలమీదను మహాకనికరముగానుండి వారలను ఒకనాటికిని మరువక, వార లనుగురించి జప తప దానధర్మములనుచేసి, తిరుసభ ఫలము లను పొంది, దివ్యపూజలను అప్పటప్పటికి ఒప్పగించచేయువ లసినది. అలాగుచేయుదురేని మీకుగల ఒక బలమైనఅప్పును తీర్చుకునేదిగాక మీకు అవసరమైన అనేక ఆత్మశరీర మేలులను సంపాదించు కొనుదురని ఎరుగగలవారలు,

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసునాథుని దివ్యహృదయమా! ఉత్తరించు ఆత్మల మీద దయగానుండండి. (300 దినములఫలము)

## జపము.

మట్టులేని కృపగల సర్వేశ్వరా! మేముచేసెడు దీనత గల జపములను కృపాకటాక్షముతో చూడనవధరించండి. దేవరవారిని ఎరిగి నమ్మి స్తుతించుచువచ్చిన, మాబంధువులయొక్కయు, సహోదరులయొక్కయు, ఉపకారులయొక్కయు, స్నేహితులయొక్కయు ఆత్మలకొరకు మేము ఒప్పగించెడు ఈ మాజపములను గైకొని వారల పాపములను ఓర్చి, వారలను మీయొద్దకు చేర్చుకొనవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాముస్వామీ...ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

సమాధుల స్థలమునకుపోయి ఉత్తరించు ఆత్మలనుగురించి మోకాళ్ళమీదయుండి 10 జ్యో-10 ప్రి - 10 త్రి-లను చెప్పుట.

## అద్భుతము.

జర్మానియాదేశమునందుగల ఓరుమ్స్ నెడు పట్టణము సమీపమునందున్న విస్తారమైన అరణ్యములో, బలమైన రెండు సేనలకు కఠినయుద్ధము జరిగినది. ఆ యుద్ధములో విస్తారమైన వీరభటులు మడసి, ఆయడవిలోనే పూడ్చబడిరి. కొన్నిరోజులకు పిమ్మట ప్రతిరాత్రియందును ఆకాశములో గొప్పయుద్ధము జరిగినట్టు కేకలును, తుపాకి ఫిరంగుల శబ్దమును వినబడుచున్నందున ఆదేశస్థులందరును ఇది ఏమోనని బహుగా భయ

పడుచుండిరి. తెల్లవారగానే ఆసందడియంతయు నిలిచిపోవును. ఆ యడవికి దగ్గిరగా సన్యాసుల మఠ మొకటి యున్నందు చేత, దానిలో వినబడిన ఈ భయంకర శబ్దమునకు సన్యాసులు తమ జపధ్యానములను సరిగా నెరవేర్చకూడదని వారలై యుండిరి. అందుచేత మిగుల పుణ్యవంతుడుగానుండిన ఒక సన్యాసివారును, ఇంకా వేరేకొందరు సన్యాసులును, ఇది ఏదో తెలుసుకొనవలయునని, ఆ యడవికి బయలుదేరిపోయిరి. తమ నమ్మకమునంతా సర్వేశ్వరునిమీదనుంచి జపములను జపించుచునే ఆస్థలమునకుపోయిరి. పోయిన తోడనే విస్తారమైన యుద్ధసేవకులు గొప్ప హుంకారములతో తమలోగా యుద్ధముచేయ యత్నించియున్నట్లుచూచిరి. ముందుచెప్పబడిన పుణ్యవంతుడైన సన్యాసి బహుగా భయపడినను, అర్చ్యశిష్ట త్రీత్వముయొక్క పేరుచెప్పి "మీరు ఎవరు" అనియు, మీకు కావలసినదేమి "యనియు అడిగిరి. ఆసేవకులలో నొకడు ప్రతియుత్తరముగా: మేము జీవముగల సేవకులము కాదు, ముందు ఈ స్థలములో చచ్చిపడిన యుద్ధసేవకుల యొక్క ఆత్మలగుదుము. మా ప్రేతములు ఈ స్థలములో పూడ్చబడినను మాయాత్మలు ఉత్తరించుస్థలములో నున్నవి. మమ్మును కాల్చిదహించు నిప్పులను మీరు చూడకనుండినను ఆ నిప్పులచేత సహించకూడని వేదనలు అనుభవించుచున్నాము" అనెను. అందుకు సన్యాసివారు వణకుచు, 'ఈఆపత్తుగల సమయములో మేము మీకు చేయవలసిన సహాయమేదో చెప్పుడనిరి" అందుకాసేవకుడు "మీరు మామీద కరికరించి, మాకు ఆదరదలయును రక్షింపును కలిగించేటట్టు సర్వేశ్వరుని చిత్తప్రకారమే మీరు చూచినదిని వినినదినైన ఇవియున్న

జరుగుచున్నవి. సకలము విడిచిపెట్టిన సన్యాసులైన మీ జప మును తపమును విశేషముగా మీరు ఒప్పగించెదు దివ్యపూజ యును, మమ్మును కష్టదశనుండి కాపాడకూడును. మేము మా అవధితీర ఏమిన్ని చేయకూడదనిదానిని గురించి, మా పరి హార అప్పు తీరునంతవరకు మేము కాలవలసినదేసరి, కాబట్టి మీరు మామీాద దయగానుండ మిమ్ము ప్రార్థించుచున్నాము' అనెను. ఆయాత్మము ఆలాగుచేప్పిన తోడనే, కూడనుండిన విస్తారసేవకులందరును 'గురువులారా, సన్యాసులారా, తంద్రు లారా మాకొరకు వేడుకొనండి, వేడుకొనండి" యని అర్భ టించిరి. ఆక్షణములోనే వారలందరును ఆకాశములో అగ్ని మయముగా మరుగైపోగానే దగ్గరగానున్న ఒక కొండమీాద, గొప్ప నిప్పులగుండ మొకటి కనుపడినది. సన్యాసులోయనిన అధికాధికముగా భయపడి, తమ మఠమునకు తిరుగావచ్చి ఆ యుద్ధవీరుల ఆత్మలనుగురించి బహుజపములను తపములనుజేసి అనేక దివ్యపూజలనును ఒప్పగించిరి. దానికి పిమ్మట ఆగొప్ప హుంకారముల రోధయును నిలిచి పోయినది.

క్రీస్తువులారా! ఈ యమ్బుతమును వినిన మీరు, మీ వారల ఆత్మలు సమాధిలోనుండి బయలుదేరి, దేవచిత్తప్రకా రము మీకు కనిపించినట్లయితే ఏమిచెప్పుదురని తలంచు కొనండి. నిశ్చయముగానే తమమీాద దయగా నుండునట్టు మిమ్మును ప్రార్థించుకొనుదురు. అందుచేత ముందుచెప్పబడిన సన్యాసులు, ఈ సేవకులనుగురించి జపతపము పూజలు ఒప్ప గించినలాగే, మీరును మీవారల ఆత్మలనుగురించి చేయువల యునని ఎరుగ గలవారలు.

౬ జోఫ్రె-ఏప్రిల్-ఏస్త్రీ లనుచెప్పుట.

. స్వామీ పాతాళమునుండి మిమ్ము...
* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని (18 పుటచూడు)

# 15 వ-త్రేది.

ఉత్తరించు ఆత్మలు విడిచెడు ప్రళాప శబ్దములనును మొఱ బాటులనును కనుపరచెడు వర్తమానము.

## ధ్యానము.

పితాపిత్రుడైన జోబనువారు సమస్తులవల్లను చైవిడువబడి, ఆస్తి బాస్తి మందలు బిడ్డలు యావత్తును పోగొట్టుకొని, సర్వాంగములును వ్రణమైపుచ్చి కంపుబట్టి, తన్ను సంధింపవచ్చిన ముగ్గురు విశేష స్నేహితులకు తాను అనుభవించు అవధి ఆపత్తులను దుఃఖముతో వివరించి నంతట, నిట్టూర్పు విడిచి చెప్పినది: "దేవుని హస్తము నన్ను దండించుట చేత నా స్నేహితులైన మీరయినను నామీద దయగానుండండి" యనిరి. ఉత్తరించు ఆత్మలు అందరి వల్లను మరచి పోబడి, తమకు ఆరుదలగా తామే ఏమిన్ని చేయ కూడక, నిప్పులో సర్వాంగములయందును వేదననొంది పితాపిత్రుడైన జోబనువారు నిట్టూర్పు విడిచిచెప్పిన ప్రళాపవాక్యములవలె మిమ్మును జూచి మిగుల దుఃఖముతో ఉచ్చరించు నట్టుగా తలంచుకొనండి. అదేమనగా? "సర్వేశ్వరుని హస్తము మమ్మును దండించుచున్నదనుటచేత మా బంధు మిత్రులైన మీరు మా మీద కొంచెమైనను దయగా నుండండి, దయగా నుండండి"

"మాజ్ఞానసహోదరులైన సమస్త క్రీస్తువులారా! మా మీద దయగానుండండి, దయగానుండండి, ఎందుచేతనంటే: భూమండలములో నుండకూడిన సకల కష్టబాధ నొప్పియుప ద్రవ సంకటములకంటె, అధిక వేదననొంది, అఘోరముగా మండు అగ్ని నిప్పులలో కాలి, ఏదొక విశ్రమము లేక, ఊరట లేక, మనోవాక్కులకందని వేదనలను అనుభవించుచున్నామే. మా నిమిత్తము మీరు కొంచెము జపముచేసి, ఏదొక తప క్రియసల్పి, ధర్మమిచ్చి మమ్మ ఓదార్చి రక్షించునది మీవల్ల కూడిన సహాయమగును. వీటినిచేయుదురని మాకుగలనమ్మిక మేగాక, వేరేనమ్మికము లేదు. ఓ! సహోదరులారా, ఏలిన వారి తిరుముఖమునుచూచి, మీరు కొంచెమైనను మా మీద దయగానుండండి, దయగానుండండి" యనుదురు. పుణ్యా త్ములైన క్రీస్తువులారా! ఉత్తరించు ఆత్మల ప్రలాపశబ్దముల నువిని వారల వేదనతీర మీరు దేనిని చేసితిరి? లేక దేనిని చేయ ఆశగానున్నారో తలంచిచూడండి.

"మా ఊరివారలు దేశస్థులును, స్నేహితులు ఉప కారులును సమీపబంధువులునైన వారలారా! మీరైనను మా మీద దయగానుండండి, దయగానుండండి. ఎందుచేత నంటే, మేము ఎవ్విధబాధ వేదన యుపద్రవములను, ఏదొక ఆధరువు లేక అనుభవించుటయేగాక, మట్టులేని ప్రేమతో స్నే హించి కోరు సర్వేశ్వరుడే మమ్మును కోపముగా దృష్టించి దూరముగా త్రోసి, అఘోరముగా దండించి బాధించుచు న్నారే. మేము మీతోకూడా భూలోకములో సంచరించు నపుడు మీరు మాకు ఎంతో పక్షమును చూపించితిరి, ఎంతటి సహాయము చేసితిరి, ఎన్ని యుపకారములను చేసితిరి?

అప్పుడు మామీదనున్న పక్షము ఇపుడు లేక పోయినదో? మీదయ మారిపోయినదో? మీదయాళిమ క్రుపించి నశించినదో? మా నిర్భాగ్యము తీర కొంచెము ప్రయాసపడకూడదో? మా నిమిత్తము ఒక మంత్రమైనను వేడుకొనకూడదో? ధర్మ మివ్వ మీకు డబ్బులు లేవా? కొంచెము తపసు చేయ శక్తి లేక పోయినదో? చెప్పండి. ఓ సహోదరులారా! ఏలినవారు మమ్మును కోపముగా దండించుటచేత మీరైనను మామీద దయగానుండండి, దయగానుండండి,, అనుదురు. పుణ్యాత్ములైన క్రీస్తువులారా! ఉత్తరించు ఆత్మలయొక్క ఈ అభయశబ్దమునువిని వారల అవధితీర దేనిని చేసితిరి?

"నా బిడ్డలారా! మీతండ్రియైన నామీద దయగా నుండండి, దయగానుండండి. ఎందుకంటే, ఇపుడు నిప్పు నిండియున్న ఈ చెరసాలలో బంధింపబడి మాటలయందును తలంపునందును అణగని వేదనలను అనుభవించు చున్నాను. మోక్షమేరింప మునకు పోవలయునని తీరని ఆపేక్ష యుండి నను నేను దానికి పోకుండునట్టు ఆటంకింప బడి, అధిక దాహము చేత తపించెడు మనుష్యుడు నీళ్లు దొరకనందుచేత కష్టపడుదానికంటె నేను అధికముగా బాధపడుచున్నాను. నాప్రియబిడ్డలారా! మీతండ్రియైన నన్ను మరచిపోతిరో? మిమ్మును కనిపెంచి, మీ నిమిత్తము పడరాని పాటుపడి మీరనుభవించెడు ఆస్తిబాస్తిని నేనేమీకు సంపాదించి పెట్టితిని. మీకు ఏదొక కస్తి ఆపద వ్యాధినొప్పి సంభవించినపుడు మిమ్మును ఆదరించను స్వస్తపరచను కాపాడను రేయుంబగలు అలసి ప్రయాసించి చేయవలసిన దానినంతటిని చేసియున్నానే. అయ్యయ్యో! మిమ్మును విస్తార ఆస్తిమంతులనుగా చేయవల

యుననిన్ని, మీ భాగ్యము మహిమ అధికరించవలయుననిన్ని నాకుగల అత్యాశచేత, అనేక అప్పులకులోనై తప్పితములను కట్టుకొనియున్నానే. ఇందునిమిత్తము పలు అన్యాయ అబద్ధ పాపములలో పడియున్నానే. నేను మిమ్మును అధికముగా ప్రేమించినందుచేతనేగదా ఇపుడు దండించబడుచున్నాను. నా బిడ్డలైనమీరు, నాయాస్తినంతటిని స్వతంత్రించుకొనియుండే మీరు, నేను కట్టిపెట్టినయింటిలో కాపురముండేమీరు, నేను మీకు సంపాదించియిచ్చిన అన్నమును తినుచుండేమీరు నన్ను మరచి పోవునదేలాగు ? నాయాత్మముయొక్క నిర్భాగ్యమును తీర్చి, నన్ను మోక్షపేరింపములో చేర్చుటకై, దరిద్రులకు ఏదైన దానధర్మముచేయుటకును, గుడికి ఏమైన కానుక చెల్లించుటకును, కొన్నిపూజలనైన చేపించుటకును మీచేతిలోఏమిన్ని లేదనుదురో ? మీకుగల సొత్తు ద్రవ్యమంతా నాదనుటను మరచిపోతిరో ? అయ్యయ్యో ! ఏలినవారిహస్తము నన్ను అఘోరముగా దండించుటచేత నాబిడ్డలైనమీరైనను నామీద దయలేక నిరాధరువుగా విడిచిపెట్టెదరోయని తండ్రి ఈవిధముగా తన బిడ్డలమీద మొరపడి ప్రలాపించును. పుణ్యాత్ములైన క్రీస్తువులారా ! ఈప్రళాపముగల వార్తలనువిని, ఉత్తరించు ఆత్మల అవధితీర దేవిని చేయకనుందురు ?

"ప్రియబిడ్డలారా ! మీతల్లినినేనే. మీ రయినను నామీద కొంచెము దయగానుండండి. దయగానుండండి. ఎందుకంటె, నేను మిమ్మును తొమ్మిదిమాసములు నాగర్భమున మోసుకొనియుండి, మహాకష్టముతో కనియున్నాను. మీకు రెండుసంవత్సరములదాకా నాచనుబాలనే త్రాపితిని, మిమ్ము నాచేతులలో ఎత్తుకొని, నాయొడిలోపెంచి విసుగులేక కాపా

దుకొనివచ్చితినే, మీరు వ్యాధిగానుండునపుడు ఏదొక విశ్రమములేక రాత్రియందు సహితము మేలుకొని పగలునందు పనిచేసి మిమ్మును ఊరడించి మీకు కావలసిన సంరక్షణయంతటిని చేసియున్నానుగదా ? అప్పుడు నామీద ఎంత పక్షముగానుంటిరి! ఇప్పుడు దానినంతటిని మరచిపోయిన లాగుననును, నేను మీకొక పరాయిదాననుగా యుండులాగుననును నన్ను కూడా తలంచుటలేదు, నేనుపడుకష్టములను చూచుటలేదు, నాకొక ఉపకారసహాయమును చేయుటలేదు, నాకుమారుడా! నాకుమార్తే ! ఆలాగుచేయునది మీకు న్యాయమా, మంచిదేనా ? మీతల్లియైన నేను ఇంతకష్టవేదనలను అనుభవించుచుండునపుడు మీరు సంతోషముగా ఆట పాటలయందును, వేడుక వినోదములయందును, విందు భోజనములయందును భోగసుఖములయందును కాలక్షేపముచేయవచ్చునా ? ఓకొడుకా, ఓకూతురా, నామీద దయగలిగి నన్ను కాల్చి దహించు నిప్పును చల్లార్చునట్టు కొంచెము కన్నీళ్ళను రాల్చండి, నా నిర్భాగ్యమును తీర్చ భిక్షకులను పిలిచి వారలకు అన్నము పెట్టండి, నా పరిహార అప్పును చెల్లించ ఒక్కప్రొద్దుగానుండండి, నన్ను మోక్షమునకు ఎక్కించ దేవమాతను వేడుకొనండి, ఏలినవారియొక్క కోపము నామీదనున్నందుచేత నాబిడ్డలైనమీరు, మీతల్లియైననామీద కొంచెమైనను దయనుంచండి, దయనుంచండి, యని తల్లి తనబిడ్డలనుచూచి పరితపించిచెప్పును. పుణ్యవంతులైన క్రీస్తువులారా ! ఇటువంటి ప్రలాపములనువిని ఉత్తరించుస్థల ఆత్మల ఆపదతీర దేనిని చేయకనుందురు ?

"తల్లిదండ్రులారా ! మేము మీబిడ్డలముగనుక, మీ

రైనను మామీద కొంచెము దయగానుండండి. ఎందుకంటె మీరు మామీద నెప్పుడును పక్షముగానుండి మహాదయతో మమ్మునునడపించి, చెప్పరాని మేలులను మాకుచేసియున్నారే. అయ్యయ్యో! మేము చిన్నవయసులో చచ్చియుండినను, అనేక తప్పితములను పాపములను కట్టుకొని మరణము పొందితిమి. ఈపాపములకు పరిహారముగా, అనేక సంవత్సరములు మేము ఈ అఘోరనిప్పులో కాల మాకు తీర్పువిధించబడియున్నది. ఈ ఆపత్తులో మాకు సహాయముచేయ ఎవరిని వెతుకుదుము? తల్లిదండ్రులైన మీరు మమ్మును విసర్జించి త్రోసివేసినట్టయితే ఎవరి శరణమునకు పోదుము? మీబిడ్డలమైన మేము ఇంత అవధి అనుభవించునదిచూడ, మీకు కనికరము లేదో? మేము ఈ అఘోరనిప్పులో కాలునపుడు మీకడుపు నొచ్చుటలేదో? ఓ అయ్యా! ఓ అమ్మా! మీకు మామీదనున్న పక్షమునుచూచి మీబిడ్డలమైన మమ్మును చేయివిడువకండి, ఏలినవారి హస్తము మమ్మును ఖండితముగా దండించుటచేత కొంచెమైనను మామీద దయగా నుండండి, దయగానుండండి, యని బిడ్డలు తలిదండ్రులనుచూచి ఏడ్చి ప్రళాపించుచున్నారే. భక్తిగల క్రీస్తువులారా! ఇటువంటి దుఃఖకర వార్తలనువిని ఉత్తరించు ఆత్మల అవధినితీర్చ దేనిని చేయకనుందురు?

ఈలాగే పెనిమిటి భార్యనుచూచిన్ని, భార్య పెనిమిటిని చూచిన్ని ప్రళాపించి నిట్టూర్పువిడిచి మొరపడునట్టుగా భావించుకొనండి.

క్రీస్తువులారా! ఇపుడు చెప్పిన ప్రళాపములనును మొరబాటులనునువిని ఉత్తరించు ఆత్మలమీద కనికరముంచవలసిన

దిగాక, వీరల అవధితీర మీరు ఇంతవరకు చేసినది చాలదని బాగా కనిపట్టి ఇకమీదటదేనిని చేయబోవుచున్నారని దృఢముగా తీర్మానించవలయునని ఎరుగగలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము

జేసునాథుని దివ్యహృదయమా! ఉత్తరించు ఆత్మల మీద దయగానుండండి. (100 దినముల ఫలము)

## జ ప ము .

దయజూపను, మన్నింపునొసగను, ఎప్పుడును స్వాభావికమైన సర్వేశ్వరా! స్త్రీపురుషులైన మాబంధువులు స్నేహితులు ఉపకారులయొక్క ఆత్మలను కృపాకటాక్షముతో చూచి, వారల సకలపాపములనును మన్నించ నవధరించండి. ఈఆత్మలన్ని ఉత్తరించుస్థల వేదనలలోనుండి రక్షింపబడి నిజమైన జీవ్యమగు మీయొద్దకు చేర దీయవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

చనిపోయిన మీ దగ్గరిబంధువులలో ఫలాని ఫలాని వారలను తలంచి వారలనిమిత్తము పూజచేయించుట, లేక వారల ఆత్మ నిమిత్తము పూజకని ఒప్పగించుటలో 5 జో-5 ప్రి-5 త్రిత్వాలను వేసుకొనుట.

## అ ద్భు త ము .

ఇతాలియా దేశమునందుగల మిలాన్ నగరములో, ముక్తిభాగ్యమునొందిన అర్థాంజలమ్మ యనునామె ఒక కన్యాస్త్రీల మఠమునకు శ్రేష్ఠురాలుగా నుండినది. ఉత్తరించు ఆత్మలమీద భక్తియును, కనికరమును గలదిగానున్నందు చేత

వారల అవధితీర అడుగడుగుకు ఒక్క ప్రొద్దుగా నుండును, అనేక జపములుచేయును, కూడినమట్టుకు ధర్మము నిచ్చును. ఆకాలములో ఆమె మిగుల ప్రేమించియుండిన ఆమె తండ్రి చనిపోయెను. ఆమె తక్కిన ఆత్మలకు సహాయముగా ముందు చెప్పినవన్ని జేయుచువచ్చినను, ఏ ముఖాంతరమువల్లనో తన తండ్రిఆత్మను మరచిపోయినది. అనేక రోజులు గడిచినపిమ్మట ఉత్తరించు ఆత్మల పండుగనాడు, ఆమె తన చిన్న అరలో ధ్యానము చేయుచుండునపుడు, ఆమె కావలి సన్మనస్కు ఆమెకు దర్శనమై ' నావెంబడి రమ్ము ' అని ఆమెను ఉత్తరించుస్థలమునకు తీసుకొనిపోయిరి. అక్కడ వేదన యనుభవించుచున్న ఆత్మలలోగా, ఆమెతండ్రియొక్క ఆత్మము అఘోర వేదనలను అనుభవించు దానిని ఆమెకు చూపించిరి. ఆమె తండ్రియో యనిన కుమార్తెను చూచినతోడనే అభయశబ్దమిడిచి " నా కుమార్తె ! నా కుమార్తే ! ఇంత వేదనలలో నీతండ్రియైన నన్నుమాత్రము ఇంతకాలము కష్టపడ విడిచిపెట్టితివి ? పరుల ఆత్మలమీద మిగుల కనికరముగా నున్నావు , నీవేడుదలవల్ల అనేక ఆత్మలు రక్షింపబడి ఈ నిర్భాగ్యమైన చెరసాలనుండి బయలుదేరుటను చూచితిని. నీతండ్రియైన నామీదమాత్రమే కనికరములేక నన్ను మరచి పోతివా " యనెను.

ఈ దుఃఖకర వార్తలనువిని అర్థాంజలమ్మ బహుగా ఏడ్చి వణకుచు " ఇకమీదట నా ప్రియతండ్రిగారా ! నేను మిమ్మును ఈస్థలమునుండి రక్షించునంతవరకు ఏలినవారిని ప్రార్థించుదును " అని వాగ్దత్తముచేసినది. పిమ్మట తన కావలైన సన్మనస్కునుచూచి: "సన్మనస్కుగారా, నేనునాతండ్రిని మరచిపోయిన ముఖాంతరము ఏదో తెలియపరచుడు " అని

నది. అందుకు కావలిదైన సన్మనస్కు ప్రత్యుత్తరముగా, "నీతండ్రి బ్రతికియుండేటప్పుడు తన ఆత్మకార్యమును అసడ్డ చేసి వచ్చినందుచేతను, చురుకులేక సర్వేశ్వరునికి ఊడిగము చేయుచు వచ్చినందుచేతను, దండనగా దైవసంకల్పము చేత అతనిని మరచిపోతివి. దేవకార్యములలో తన ఆత్మమెడల అసడ్డగా నుండువారలకు ఆలాగేసంభవించును. తమ ఆత్మను తలంచక ఈలోక చెల్వ భాగ్యములను మాత్రమే వెదకుచు వచ్చువారలు, తమ పాపములకు పాపసంకీర్తన మూలముగా ఓర్పుపొందినను ఆ పాపములకు ఘనమైన యొక పరిహార అప్పును వారలు తీర్చవలసినదిగానున్నది. ఆ యప్పును భూమిలో చెల్లించనట్టయితే నూరు పాళ్లు అధికముగా ఉత్తరించు స్థలములో తప్పక చెల్లించవలసినది" అని చెప్పి మరుగై పోయిరి.

ముక్తిభాగ్యము పొందిన అర్థాంజలమ్మా యనిన తన తండ్రియొక్క క్రూర వేదనలను కండ్లారచూచినట్టు, కడుదుఃఖముతో ఎడతెగక ఏడ్చుచు, సదా జపము చేయుచుండును, తన శరీరమును దండించి గాయపరచును, తనతండ్రి దేవనీతికి చెల్లించవలసిన అప్పును ఏవల్లనైనను తీర్చ ప్రయాసపడును. ఈలాగు అనేకదినములు చేసినపిమ్మట తనతండ్రియొక్క ఆత్మము మిగుల సంతోషముతోను మహిమ ప్రతాపముతోను మోక్షమునకు పోవుటను చూచినది.

క్రీస్తువులారా! మీరును మీ ఆత్మకార్యములలో అసడ్డగా నుందురేని ముందుచెప్పిన మనుష్యునికి సంభవించిన లాగు మీకును సంభవించును. చనిపోయిన మిమ్మును, మీ బిడ్డలు మరువక, ఉత్తరించు స్థలమునుండి మిమ్మును కాపాడ

వలయునని ఆపేక్షయున్నట్టయితే మీముందు చనిపోయిన వారలను మరచిపోకండి.

ఒకనాడుమీరు భోంచేయ తప్పిపోయినను, ఉత్తరించు ఆత్మలనిమిత్తము ఒక చిన్న జపమునైనను జపించ, ఒకనాటికిని తప్పి పోకూడదని ఎరుగ గలవారలు.

5 జ్యో-5ప్రి-5 త్రిత్వ-లనుచెప్పుట.

స్వామీ పాతాళముసుండిమిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని (13 పుట చూడు)

# 18 వ-తేది.

ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచేయునది మనకుమిగుల ప్రయోజనముగల కృత్యమని చూపించెడు వర్తమానము.

## ధ్యానము.

ముందుచెప్పిన ధ్యానములను ధ్యానించుటవల్ల, ఉత్తరించు ఆత్మలమీద అధికభక్తి మీయొద్ద కలిగియుండవచ్చునని నమ్ముచున్నాము. ఈభక్తి అధికాధికముగా వృద్ధిపొందునట్టు ఉత్తరించు ఆత్మలనుగురించి ప్రయాసపడుటచేత, మనకు అనేక ప్రయోజనములు కలుగుచున్నవనుటను గురించి ఇపుడు ధ్యానించుదుముగాక.

"కనికరముగలవారలు భాగ్యవంతులు, ఎందుకంటే వారలు కనికరముపొందుదురు, అని మనపలినవారైన జేసునాథస్వామి వచనించియున్నారు. కాబట్టి ఉత్తరించు ఆత్మలమీద కనికరముగానుండి వారలకు ఆరుదలనును విశ్రాంతినిని తమ చేతకూడినవరకు రక్షించ ప్రయాసపడేవారలు, దేవకృపను

ను దేవదయనును, దేవదయచేత కలిగెడు మేలులనును ఏలిన వారియొద్ద గైకొనుదురనుటకు సందేహముగలదా? ఏదొక నిమిాద ఒకరాజుయొక్క కృపయును, దయయును ఉండునేని, ఆమనుష్యునికి ఏకొరతయు నుండదుగదా ? కొరత లేదనినట్ట యితే, రాజాధిరాజైన సర్వేశ్వరునియొక్క కృపయును దయ యును, మనకుండినట్టయిన మనకు ఏకీడు ఏకొరతకలుగ కూడును ?

"దరిద్రముగా నున్న వారలమిాదను, పేదవారలమిాద ను, కనికరముగానున్న వాడు భాగ్యవంతుడు. ఎందుకంటే ఆప త్తుసమయములో ఏలినవారే వానిని కాపాడిరక్షించివానికి ఈ లోకభాగ్యమునిచ్చి, శత్రువులచేతిలో వాడు చిక్కకుండు నట్టుచేయుదురు. వాడువ్యాధిగా పడియుండునపుడు వానికి ఏలి నవారు సహాయముగా నుందురు, అని నలుబదియవ సంగీత ములో దావీదురాజు చెప్పియున్నారు. ఈలోకములోగల దరి ద్రులకు ఉపకార సహాయముచేయువారలను, దేవవాక్యము ఏలాగు పొగడి, ఏపాటిమేలులు వచ్చుచున్న వియని నిశ్చయిం చి చెప్పునపుడు ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచే యువారలకు ఇంకా అధిక మేలువచ్చుననియు, వారలు అధిక భాగ్యవంతులనియు నిశ్చయముగా చెప్పవలయునుగదా ?

ముందుచెప్పిన ధ్యానములలో ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచేయునది, సర్వేశ్వరునికిని, జేసుక్రీస్తునా థునికిని, దేవమాతకును, యితర మోక్షవాసులకును ఎంతప్రి యమైన పుణ్యమని తేటగావివరింపబడియున్నది. ఈ లోక ప్ర భువులకు యోగ్యమైన కార్యములను చేయువారలు అనేక మారులు వారలవలన తగిన బహుమానము చేయ నేరరనుట

నిజము. అయితే సర్వేశ్వరునియొద్దను మోక్షవాసులయొద్దను ఆలాగు నడచుటలేదు. వారలనుగురించి ఒకే స్వల్పపుణ్యమైనను కొంచెము ధర్మమైనను కొంచెముతపసైనను చేయుచువచ్చుదుమేని మన కనేక సంభావనలను వారలు దయచేయుదురనుట తప్పదు. కాబట్టి ఉత్తరించు ఆత్మలమీద భక్తిగలవారలకు సర్వేశ్వరుడు విశేషకృపజూపి వారలకు విశేషఉపకారములను చేయుదురనుట తప్పని సత్యమగును. వారు వీరలను అనేక కీడులలోనుండి రక్షించి, వారలు పిశాచి శోధనలలో చిక్కకుండునట్టు వారలను కాపాడి, లోకకార్యములలో మొదలుగా వారలను ఆశీర్వదించుదురు.

ఉత్తరించు ఆత్మలోయనగా, తమకుఉపకార సహాయముచేసిన వారలను మేలెరిగిన మనసుతో, తలంచి వారలనిమిత్తము సర్వేశ్వరునియొద్ద మహా ఆశతోను, ఎడతెగని పట్టుదలతోను వేడుకొనుదురని, వేదశాస్త్రులందరును చెప్పుచున్నారు. అది ఏలాగనగా, ఆ యాత్మలు ఉత్తరించు స్థలములో నున్నంతమట్టుకు తమకుతాము ఏదొక మేలురప్పించుకొన కూడకనుండినను, తమకు ఉపకారము చేసినవారలకొరకు వేడుకొన కూడుటయేగాక, వారలు సర్వేశ్వరునికి ఎడబాయని సంబంధపడినవారలుగా నున్నందుచేత, వారల వేడుదల అనుకూలమై వారలు అడుగునదంతయు ఇవ్వబడునట దృఢమైన నమ్మికయగును.

బొలోన్యాయనెడు అర్చ్యశిష్ట కేథరేనమ్మ "నేను దేనినైనను నిత్యపితయొద్ద పొందకోరునప్పుడు, దానిని నానిమిత్తము అడుగుటకు ఉత్తరించు ఆత్మలను వేడుకొనుదును. ఆలాగే నేను ఆశించునదంతయు తప్పక పొందుదును" అనినది. భక్తి

గల ఒక స్వాములవారు " నేను ఏదోక విశేషసహాయమును పొందవలసినదిగా నున్నప్పుడు ఉత్తరించు ఆత్మలనుగురించి పూజచేయుదును, అలాగే నేను ఆశించునదంతయు అనుకూలమగు చున్నది " యనిరి. ఈ సింధుదేశమునందు సహాగా, అనేక భక్తిగల క్రీస్తువులు తాముచేయబోవు ఏదోక ప్రయాణము మోసములేక సురక్షితముగా చేయుటకైనను, తమ పైరుపంటలు కొరతలేక ఫలించుటకైనను, ఒక ఫిర్యాదు ఒక వ్యాజ్యములో తాను జయముపొందుటకైనను ఒక వ్యాపారములో లాభము పొందుటకైనను, ఒకవ్యాధి, ఒక అపాయము తొలగుటకైనను, ఒకపెండ్లి అనుకూలముగా ముగియుటకైనను, ఇంక ఏకార్యమైనను సఫలమగుటకుగాని ఆశించునపుడు ఉత్తరించు ఆత్మలనుగురించి ఒకటి రెండు పూజలనుచేయించి, ధర్మమిచ్చి, గుడిలో కానుక చెల్లించుకొని వచ్చుచున్నారని ఎరుగుదుము. వారలే తాము తలంచిన కోరిక అనుకూలమగుటకు ఆలాగు చేయునది నిశ్చయమైన మార్గమని దృఢముగా చెప్పుచున్నారు. నీడవంటి ఈ లోకమునకును, నాశనమైపోవుశరీరమునకును సంబాధించిన కార్యములలో అట్లుండగానేని, పరలోకమునకును, ఆత్మకును సంబంధపడిన జ్ఞానకార్యములలో అధిక అనుకూలము కలుగుననుట తప్పదు.

దరిద్రముగా నుండువానిమీద దయగానుండి వానికి సహాయము చేయువాడు సర్వేశ్వరునికే అప్పు యిచ్చుచున్నాడు. వారును రెట్టికి రెట్టి ఉత్తరించుదురని వేదపుస్తకములో వ్రాయబడియున్నది. ఇట్లుండగా ఉత్తరించు ఆత్మలవలె ఈలోకములో దరిద్రము పొందినవారలును, అవసరములో నున్నవారలును, కష్టపడువారలును మరెవ్వరును లేరుగదా? కాబట్టి ఈ

ఆత్మలకు ఉపకారసహాయముగా చేయునదంతయు సర్వేశ్వరు నికిచ్చిన ఒక అప్పువలెనుండుననియు, సర్వేశ్వరుడు తిరుగావడ్డి తోకూడా ఆయప్పును ఉత్తరించునపుడు ఒకటికి నూరు అధిక ముగానిచ్చుదురనియు యోచించవలసినది. ఇది ఇట్లుండగా క్రీస్తువులారా! మీరు ఏదొక మంచి వ్యాపారము చేయవలసినట్టయితే, మీరనుసరించు పుణ్యామంతయు, చేయుధర్మమంతయు, నడపించు దేవకార్యమంతయు, పడెడు కస్తియుపద్రవమంతయు ఉత్తరించు ఆత్మలను గురించి సర్వేశ్వరునికి ఒప్పగించవలయును. వీటిని ఆలాగు ఒప్పగించినట్టయితే ఆయాపుణ్యాము నకును, ధర్మమునకును, సత్క్రియలకును కలిగెడు పుణ్యాఫలమంతయు ఇంతంతగాక, పరస్నేహమును దేవస్నేహము ను, ఉత్తమ విధముగా నుండునుగదా? అందుచేత ఇవియన్నియు సర్వేశ్వరునికి అధికప్రియపడును, మీకును అధిక ముగా ఫలించునని వేద శాస్త్రులు నిశ్చయముగా చెప్పుచున్నారు. ఉత్తరించు ఆత్మలమీద నుంచెడు భక్తియగునది అన్నిటియందును ప్రయోగించునని ఎరిగి, మీరు అధిక మధికముగా ఆయాత్మలమీద విశేషభక్తినుంచ వలయునని ఎరుగ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసునాథుని దివ్యహృదయమా! ఉత్తరించు ఆత్మల మీద దయగానుండండి. (300 దినముల ఫలము)

## జపము.

పితయైన సర్వేశ్వరాస్వామీ! దేవరవారికి ప్రియ కుమారుడుగాను మాకుకర్తగానునుండే జేసుక్రీస్తునాథుడు ఇన్ని పాటులను అనుభవించినారే. వారి పాటులనును, రక్త

ణమునును, శ్లీవనును, మరణమునును, స్థాపితమునును, దుఃఖ మునును, వారి తిరుగాయములనుండి ఒలికి చిందెడు రక్తము నును జూచి, ఉత్తరించు ఆత్మల వేదనను తగ్గించి, వారలను మీ తిరుసన్నిధానమునకు రాదీయ కృపచేయ వలయునని మిమ్ము ప్రార్థించుచున్నాముస్వామీ. ఆమేన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

మీరీదినముచేయు క్రియలనన్నిటిని ఉత్తరించు ఆత్మ లను గురించి శుద్ధతలంపుతో చేసి సర్వేశ్వరునికి ఒప్పగించుట.

## అద్భుతము.

పూర్వవేదకాలములో తమప్రజలకు సహాయముగా నుండనును, వారల శత్రువులను చెదరగొట్టనును సర్వేశ్వ రుడు సన్మనస్కులను పంపినారని వేదపుస్తకములో వ్రాయ బడియున్నది. ఆలాగే ఈకాలములోనును ఉత్తరించు ఆత్మల మీాద భక్తిగానుండేవారలకు సహాయముచేయను, వీరల శత్రువులనుండి వీరలను రక్షించను సర్వేశ్వరుడు ఉత్తరించు ఆత్మలను కొన్నిసమయములలో పంపినారని దృష్టాంతరముగా తెలియును. దానికి నిదర్శనముగా నడచిన ఒకసంగతిని వినండి.

సర్డీనియా యనేడు దీవికి రాజుగానున్న ఉసేబియూస నువారు ఉత్తరించు ఆత్మలమీాద మహాభక్తి పట్టుదలగానుండి ఆయాత్మలను గురించి విస్తార ధర్మములను చేయుదురు. ఆయా త్మలకు సహాయముగా ప్రతిదినము దివ్యపూజలనుచేసి ఒప్ప గించ అనేకగురువులను ఏర్పరచి నియమించియుండిరి. వార లకు కావలసిన వాటిని విచారించను యితరధర్మములను నడి పించను ఒకపట్టణములోవచ్చు పగుది (పన్ను) రూకల

నన్నిటిని దానికిగురించి విడిచియుండిరి. కాబట్టి ఆ పట్టణము దేవపట్టణమని చెప్పబడును. సిసిలియా ద్వీపమునకు రాజైన అస్తోర్నియుసనువాడు పిశాచి మాత్సర్యముచేత ప్రేరేపించబడి అనేక సేనలతో ఉసేబియూసనువారితో యుద్ధము చేయవచ్చెను. అస్తోర్నియుసనువాడు ముందుచెప్పిన పట్టణమును ముట్టడివేసి దానిని పట్టుకొనినాడు. ఉసేబియూసనువారు ఈసంగతి విని తమ దండునుచేర్చి వానికి ఎదురుగా పోయిరి. అయితే శత్రుసైన్యము బలముగలదిగా నుండినందుచేతను, తమదండు కొంచెమైనదిగా నుండినందుచేతను జయము కలుగునో లేదో యనివెరచి సర్వేశ్వరుని ప్రార్థించుకొనియుండిరి. ఇదిగో యుద్ధము ఆరంభమగు సమయములో, తెల్లని వస్త్రములుధరించి, తళతళమెరయు ఆయుధములను చేతబట్టుకొని, తెల్లని గుఱ్ఱములమీద నెక్కియున్న రాణువవారలును, కాల్బలములును తమకు సహాయముగా వచ్చుటనుచూచెను. రాజు వీరలను చూచి "మీరెవరు" అని యడుగగా 'మేము పరమరాజు యొక్క దళముగనుక మీరు భయపడవద్దు. మీశత్రువులతో యుద్ధముచేయను మిమ్మును కాపాడనువచ్చితిమి' యనిరి. ఈ అతిశయమైన సేనలనుగని అస్తోర్నియుసనువాడు మిగుల భయ మొంది సమాధాన ఓర్పునడిగి, రప్పించిన నష్టమును పరిహారించి, తానుపట్టుకొనిన ముందుచెప్పిన పట్టణమును తిరుగానిచ్చిచేసి తొలగిపోయెను. ఉసేబియూసురాజోయనివ, సర్వేశ్వరునికి మేలెరిగిన మనస్సుతో స్తోత్రముచేసి, తమకు సహాయముగా వచ్చిన సేనకు ఉపచారముచేసి, మీరువచ్చినది ఏలాగు? చెప్పుడని ప్రార్థించిరి. ఇందుకు ఆ సేనయొక్క అధిపతి ప్రత్యుత్తరముగా, "రాజా! మీ ప్రయాసచేత రక్షింప

బడిన ఆత్మలు మేమేయని కనిపట్టండి. ఏలినవారు మిమ్మును ఈ ఆపత్తుగలసమయములో ఆదరించునట్లు ఇక్కడికి మమ్మును పంపించిరి. ఉత్తరించు ఆత్మలమీద ఎప్పుడును ఆలాగేభక్తిగా నుండవలసినది" అనియు, మీరు రక్షించిన ఆత్మలన్నియు మోక్షములో మీకు స్నేహితులుగాను ఆధరువుగలవారలు గాను ఉందురనియు" చెప్పి ఆసేన అధిపతియును తక్కిన యుద్ధబటులును మరుగైపోయిరి. దానిని గనినరాజుమోకాళ్ల మీదయుండి, తన్ను కాపాడిన సర్వేశ్వరుని పొగడి స్తుతించి ముందుకంటె అధికముగా ఉత్తరించు ఆత్మల మీద భక్తి గలవారైరి.

క్రీస్తువులారా ! మన జీవ్యకాలము యుద్ధస్థలమేగదా? లోకము, పిశాచి, శరీరమనెడు ఈమూడుశత్రువులవల్ల మీకు మోసము రాకుండునట్లు ఉత్తరించు ఆత్మలయొద్దనుండి మీకు సహాయము రాకూడునని ఇప్పుడు చెప్పిన అద్భుతమువల్ల కనిపట్టి, ఆయాత్మలమీద అధికాధికముగా భక్తినుంచవలయు నని ఎరుగ గలవారలు.

5 జ్యో-5-ప్రి-5-త్రీత్వ లను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము.....

* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని (13 పుటచూడు)

# 19 వ-తేది.

ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయుటవల్ల మనకు మూడు విశేష మేలులు కలుగుచున్నవి యని చూపించే ప్రసంగము.



# ధ్యానము.

ఉత్తరించు ఆత్మలకు మనచేత కూడినమట్టుకు ఉపకారసహాయము చేయునది ఎంత ప్రయోజనముగల పుణ్యమని పోయిన ధ్యానములో సామాన్యముగా చూపించితిమి. ఈ సుకృతభక్తిచేత, మూడు విశేష గొప్పమేలులు వచ్చుచున్నవియని ఇపుడు వివరించి ఒప్పించవలసినది. మనుష్యుడు పాపమన్నింపునను, మంచి మరణమునును, మోక్షమునకు పోదుననెడు దృఢమైన నమ్మకమునును ఈ మూడు గొప్పమేలులను ఆశించుచున్నాడుగదా? ఈ మూడు మేలులను పొందుటకు ఉత్తరించు ఆత్మలమీదనుంచిన విశేష భక్తియైనది ఉత్తమ మార్గమనుటకు సందేహములేదు. అది యేలాగనగా:

1 ది—స్పిరుతు సాంక్తుచే ప్రేరేపించబడి, అర్చ్యియాగప్పగారు చెప్పినదేమనిన: "తప్పిపోయెడు పాపాత్ముని త్రిప్పువాడు, వాని ఆత్మ చావకుండునట్టు కాపాడుటయేగాక, తన పాపాధిక్యమునును అగుపడకుండ మూయుచున్నాడు" అనిరి. ఇదిగో, మీ పాపఋణమంతా నివర్తించి, స్వామి సముఖములో పరిశుద్ధులగుటకు ప్రయాసపడునది, స్పిరితు సాంక్తువల్ల నిరూపించబడిన మార్గమగును. అయితే, ఒక పాపాత్ముని మనసు త్రిప్పుదానికంటె, ఒక ఆత్మను ఉత్తరించు స్థలమునుండి రక్షించి, మోక్షమునకు చేర్పించునదే గొప్ప కార్యమగును. కాబట్టి ఆలాగుచేయునది, మీపాపఋణమును తీర్చుటకు ఉత్తమ ఉపాయమని చెప్పవలయునుగదా?

మరియు దీర్ఘదర్శియైనదానియేలు, నబుఖొదొనోజోర్ రాజునుజూచి చెప్పినవాక్య మేమనిన: "రాజా, భిక్షచేతమీ

పాపమును పరిహరించుకొనండి, దరిద్రులకు ధర్మమిచ్చి మీ అక్రమములను తీర్చుకొనండి ” యనిరి. వేదపుస్తకములో ఇంకొక చోట: ధర్మము పాపములను ఎదిరించి అంటుకించునని వ్రాసియున్నది. ఇదిగో భిక్షుధర్మము పాపములను పోగొట్టు చున్నదనియు దృష్టాంతముగా కనుపడే సత్యముగానున్నది. ఈ లోకములోగల నిర్భాగ్యులకుచేయు భిక్షాధర్మము, ఆలాగు పాపములను పరిహరించ శక్తిగలదిగా నుండునపుడు ఉత్తరించు స్థలములో వేదనయనుభవించే ఆత్మలకు చేయు సహాయము ఆ మాత్రము శక్తిగలదిగా నుండదాఏమి? ఉత్తరించు ఆత్మలు యిష్టప్రసాదములో నిలకడనొంది, సర్వేశ్వరునికి అధికముగా ప్రియపడి యుండుటచేతను, ఆయాత్మలు అధిక వేదన యనుభవించుట చేతను వారలకుచేయు ఉపకార సహాయము యీావత్తు భిక్షాధర్మములయందు మించినదిగా నుండుటచేత ఈ యుపకార సహాయమువలన మనపాపములు అధికముగా తీరుననియు, అధికముగా పరిహరింప బడుననియు, అధికముగా ఓర్వబడుననియు తలంచవలసినది. చెప్పవలసినది. క్రీస్తుపులారా! మీరు కట్టుకొనిన పాపములను తలంచునపుడు మిగుల భయపడు చున్నారే. ఇదిగో! మీ పాపములు తీరనును, మీ సంశయములో లగనును ఉత్తరించు ఆత్మలమీద భక్తిగా నుండుటది ఉత్తమ యుపాయమగును.

2 ది.—మంచి మరణమగునది సకలమేలు నిండిన మోక్షమునకు పోవు మార్గమగును. అదియే పేరింపరాజ్యమునకు వాకిలియైనందున దానినిపొందఅందరును ఆశించుదురు గదా ? ఈ అదృష్టము తమకుకలిగేటట్టు, అనేకజపములను చేసినప్పటికిని, అనేక అర్చ్య శిష్టులను ప్రార్థించి

నప్పటికిని, కొన్ని ఉత్తరియ సభలలో చేరినప్పటికిని ఈ మొదలగు సత్కృత్యములను చేసుకొని వచ్చుచున్నారే ఇవియన్నియు మంచివేయగును, ప్రయోజనముగలవియేయగును. అయినను తాము కోరిన మంచిమరణము పొంద ఉత్తరించు ఆత్మలమీద భక్తిగానుండడమే నిశ్చయమైన మార్గమన వచ్చును. అది ఏలాగనగా, ఇష్టప్రసాదముతో నుండెడు మనుష్యుడు దేవకృపనుగొని చేయుసత్కృత్యములన్నియు ఫలముగలవి యగుటచేత, వాడు చేయు జపధర్మములవల్లను పొందిన తిరుసభ ఫలములవల్లను, చేయించిన దివ్యపూజలవల్లను అనేక ఆత్మలు ఉత్తరించు స్థలమునుండి రక్షింపబడి మోక్షదరి చేరియుందురనుటకు సందేహము లేదు. మోక్షపేరింపములో మునిగియుండు ఆయాత్మలుతమ్మును ఆస్థలమునకుచేర్చిన మనుష్యుని మీద మహా దయగలిగియుందురు. పక్షము స్నేహమేయగును. పక్షముగలవాడు స్నేహితుడేయగును. కాబట్టి రక్షింపబడిన ఆయాత్మలను మనకు నిజమైన స్నేహితులని చెప్పవలయును. నిజమైన స్నేహితుడు ఎప్పుడును స్నేహించుననియు, విశేషముగా ఆపత్తుగల సమయములలో సహోదరుడుగా కనిపించుననియు వేదపుస్తకములో వ్రాయబడియున్నది. చావు మోక్షమునకైనను, నరకమునకైనను, హేతువుగనుక, దానిని అన్ని ఆపత్తులకంటె అధిక ఆపత్తైన సమయమని చెప్పవలయునుగదా? అట్లుండగా మోక్షములో వర్ధిలుచుండు మన స్నేహితులైన ఆత్మలు ఈ ఆపత్తుసమయములో మనలను చేవిడుచుదురా? సహాయముచేయక నుందురా? ఆసమయములో పిశాచి శోధనలను తొలగించక నుందురా? ఆయాత్మలు మనమీదనుంచిన పక్షమునుగురించి

మనమరణసమయములో విశేషముగా వారలసహాయము కలుగు ననుట నిశ్చయము. ఎన్ని ఆత్మలను మన ప్రయాసచేత ఉత్తరించుస్థలములోనుండి రక్షించియుందుమో, అన్ని ఆత్మలు భయంకరమైన మరణసమయములో మనకు సహాయముగా నిలిచి, మనకుఅదృష్టమైన మరణము లభించ తోడుపడుదురనుట దృఢమైన సత్యము. అందుచేత చచ్చినవారల ఆత్మలును, మనమును కడతేరునట్లు, ఆయాత్మలకు ఆరుదలగా చేయకూడిన దంతయు అసడ్డలేకుండా మనము కష్టపడియైనను చేయగలవారలమని అర్చ్య-క్రిసొస్తోమ్ అరుళప్పగారు వచనించిరి. ఇది యిట్లుండగా, ఉత్తరించు ఆత్మలమీదనుంచిన నిజమైన భక్తియైనది మంచిమరణమునును మోక్షపేరింపమునును పొందుటకు ఒక తప్పని దృష్టాంతమగునని వేదశాస్త్రులు నిశ్చయించి చెప్పుచున్నారు.

3 ది ;—ఆత్మలమీద భక్తిగలవారలు మోక్షమునకు పోదురని దిట్టమైన నమ్మకము కలిగియున్నదనుట నిశ్చయము. ఎందుచేతనంటే, న్యాయతీర్పు దినములో సకలలోకములకును పలినవారైన జేసుక్రీస్తునాథు ప పలుధర్మములను చేసిన వారలకు నిత్యపేరింపమును సంభావనగా దయచేయుదురు గదా? అయితే ముందుకనుపరచినలాగు ఉత్తరించు ఆత్మలకు చేసిన ఉపకారసహాయమంతా అన్నిధర్మములకంటె మేలైనది గనుక, అటువంటి ధర్మములను చేసినవారలకు మోక్షప్రతాపముగల రాజ్యము నిశ్చయముగానే యివ్వబడుననుటకు కొంచెమైనను సందేహముండవచ్చునా? మరియు మిమ్మును నిత్య గుడారములలోకి చేర్చుకొనునట్లు మీకు స్నేహితులను సంపాదించుకొనండి, అని స్వామే వచనించియున్నారు. అలాగే

మనలను మోక్షమునకుచేర్చ, తగిన స్నేహితులు మనచేత రక్షింపబడిన ఉత్తరించు ఆత్మలేగదా? ఆయాత్మలు తమసహాయముచేతను, సర్వేశ్వరునియొద్ద తమయొక్క వేడుదలవల్లను మనకు సహాయముగా నిలిచి, మన ఆత్మము మోక్షదరిచేరు వరకు మనలను చెయివిడువ నేరరనుటనిశ్చయము.

పితాపిత్రుడైన తోబ్యాసనేవారు, తమ కుమారునికి బుద్ధిమతి చెప్పునపుడు వచనించినదేమనిన: "నీ సంపాద్యమును దరిద్రులను దానముచేయగలవాడవు, ఏదొక బీదవానిని నిరాధారముగా త్రోసివేయవద్దు; ఆలాగు చేయుదువేని ఏలినవారు నిన్ను నిరాకరించి త్రోసివేయరు. అందుచేత కష్టకాలములో నీకు తోడుపడు గొప్ప బొక్కసమును సంపాదించి పెట్టుకొనుదువు. అది ఏమనగా, భిక్షాధర్మము సకలపాపములనుండిన్ని, మరణమునుండిన్ని, నిన్ను రక్షించునదిగాక, అంధకారస్థలములలోకి నిన్ను పోనివ్వదు" అనిరి. ఈ వేదవాక్యములో పాపమన్నింపును, మంచి మరణమును, రక్షణము యొక్క నమ్మికయునైన ఈ మూడు విశేషవరములు ధర్మముచేత కలుగుచున్నవని తేటగా కనిపించుచున్నది. అందుచేత ఈ మూడు విశేష వరములను ఆశించేవారు, అన్నిధర్మములకంటె మేలైనధర్మమైన ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయు ధర్మమును చేయవలయునని ఎరుగ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

జేసునాథుని దివ్యహృదయమా! ఉత్తరించు ఆత్మలమీద దయగానుండండి. (300 దినముల ఫలము)

## జపము.

ముగ్గురు పరిశుద్ధయవ్వనులను అగ్ని అవమునుండి కా

పాడినవారును, దీర్ఘదర్శియైన దానియేలనువారిని సింహముల గవిలోనుండి రక్షించినవారును, సకలవేదనలలోను వేదసాక్షు లను స్థిరపరచినవారునై యుండెడు సర్వేశ్వరా! మేము మీ సన్నిధానములో చేసెడు జపములను కృపతో చేకొని, ఉత్త రించుస్థల నిప్పునుండిన్ని, సకలవేదనలనుండిన్ని, మృతిపొం దిన వారల ఆత్మలను రక్షించి ప్రతాపముగల మీసన్నిధాన మునకు వారలను రాజేయవలయునని దేవరవారిని ప్రార్థించు చున్నాముస్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి ఏదాకరోజు ఒక్కప్రొద్దు గానుండుట.

## అద్భుతము.

శాస్త్రిలలోగా పేరుపోయిన పరోనియూసనేవారు వ్రాసిన చరిత్రమేమనిన: రోమాపురిలో ఒక పుణ్యవతి ఉత్త రించు ఆత్మలమీద బహుభక్తిగానుండి వారలకు ఆరుదల రప్పించ బహుప్రయాస పడుచుండినది. ఆమె వ్యాధిగాపడి అవస్థగానున్న సమయములో, దుర్మన పిశాచి భయమును అపనమ్మకమును కలకమును ఈ మొదలగు శోధనలు ఆమెకు రప్పించినది. అందుచేత ఆమె కలంగి వణకి ఏమిసంభవించు నోయని అధికముగా భయపడి యుండునప్పుడు, అదిగో! మోక్ష మునుండి తనకు సహాయముగా అనేకవేలమంది వచ్చుటను చూచినది. వచ్చినవారలు ఆమెమంచముచుట్టు సంతోషముఖ ముతో నిలిచి, "భయపడకు, జయముగొనుదవు" అని ఆమెను ఊరడించుచుండిరి. ఆక్షణములో దుష్టపిశాచి పారిపోగానే ఆమె

మిక్కుట సంతోషముతో: వచ్చినవారలను చూచి: " మీరు నాకు ఇటువంటి సహాయముచేసినందుకు కారణమేమి " చెప్పుడని యడుగగా, వారలు: " నీవేడుదలవల్ల ఉత్తరించు స్థలమునుండి రక్షింపబడి మోక్షమునకుపోయిన ఆత్మలుమేమే. మాకృతజ్ఞత నీకుచూపించను, నీయాత్మను మోక్షమునకు తీసుకొనిపోనును వచ్చితిమి" యనిరి. ఈ వార్తలను విని ఆ పుణ్యవతి సంతోషప్రవాహములో మునిగి, మోక్షభాగ్యమును అనుభవించ నారంభించినట్లు నవ్వుముఖముతో యింపముగా మృతిపొంది తన్నుగొనిపోవవచ్చియున్న ఆత్మలవెంట పరలోకమునకుపోయినది అని ముందుచెప్పిన శాస్త్రి నిశ్చయముగా వ్రాసిపెట్టిరి.

రోమా పురిలో ప్రభలప్రఖ్యాతివహించిన అర్చ్యష్టి లిప్పునేరియనువారు, సకల ఉత్తరించు ఆత్మలమీద భక్తిగానుండునదిగాక,తమవిచారణలో నున్నవారల ఆత్మలను విశేషముగా తలంచుచుందురు. వారి విచారణలో నున్న ఆత్మలును వారికి అనేమారులు కనిపించి, తమనిమిత్తము వేడుకోవలయునని అడిగినదిగాక, వారికి అనేక సహాయములనునుచేయుదురు. మరియు ఆయాత్మలు మోక్షమునకు పోయినపిమ్మట మరల వారికికనబడి మేలెరిగిన మనసుతో స్తోత్రము చెప్పుదురు. ఈమహా అర్చ్యశిష్టవారు చనిపోవునపుడు ఆ యాత్మలు పెద్ద పతాలముగావచ్చి పరివారముగా నిలిచి, వారిని మోక్షమునకు పిలుచుకొని పోయిరి. వారు చని పోయిన పిమ్మట భక్తిగల ఒక సన్యాసివారు వారు మోక్షములో చెప్పరాని మహిమప్రతాపముతో ప్రకాశించుటనును, వారికి మహిమగా వారివలన మోక్షముపొందిన ఆత్మలు వారినిచుట్టుకొని యుండుట

యును చూచినారని అర్చ్యి- పిలిప్సు నేరిగారి చరిత్రములో వ్రాయబడియున్నది.

క్రీస్తువులారా! ఉత్తరించుస్థల ఆత్మలమీద నుండిన విశేషభక్తిచేత ఎంతప్రయోజనము కలుగుచున్నదని ఈరెండు అద్భుతములచేత కనిపట్టి ఆయాత్మలకు ఉపకార సహాయము చేయ అధికాధికముగా ప్రియపడుదురుగాక.

5 జో- 5 ప్రి- 5- త్రీ లను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని...(13పుటచూడు)

# 20-వ తేది.

ఉత్తరించు ఆత్మలమీద నుంచిన భక్తి, మనము ఉత్తరించుస్థలములో ఉత్తరించునప్పుడు మనకు సహాయపడుననుటను చూపించే వర్తమానము.

## ధ్యానము.

ఉత్తరించు ఆత్మలమీద భక్తిగానుండి వారలకు ఉపకారసహాయముచేయునది సర్వేశ్వరునికి ప్రియముగల పుణ్యమనియు, మనమీదమోసిన గొప్ప అప్పనియు, మనకు మహాప్రయోజనమునిచ్చు భక్తియనియు తేటగా వివరించి చూపితిమి. ముందువివరించిన ధ్యానములను చక్కగా యోచించి చూతుశేసి ఆ సుకృతభక్తి మీయొద్ద అధి కాధికముగా వృద్ధిపొందునని నమ్మియున్నాము. అయితే ఈ విషయములో పిశాచియొక్క శోధనవల్లను, పతితులు మొదలైన దుర్జన

సహవాసముయొక్క తగనిబుద్ధిచేత నయినను కొంతమంది క్రీస్తువులయొక్క మనసు తత్తళించి, అది ఏమోయని అసడ్డగానున్నారని ఎరుగుదుము. ఇటువంటి వారలు మేమిపుడు చెప్పుదానిని గమనముగా వినిసరిగాయోచించిఆలోచన చేయ గలవారలు.

సత్య స్వరూపిగానున్న జేసుక్రీస్తునాథుడు తమ తిరు వాకు తెరచి కూడియున్న విస్తారజనులకు వచనించిన పరమ వాక్యమేదనిన: "ఇవ్వండి అప్పుడుమీకు యివ్వబడును. అది మి పట్టిపోసెడుమంచికొలత మీ యొడిలో పోయుదురు. ఎందుకంటే మీరు ఏకొలత కొలిచెదరో ఆ కొలతతోనే మీకునుకొలవబడును" అనిరి. ఏలినవారు వచనించిన ఈ వాక్యమును గవనించి ధ్యానించవలసినది. అది ఏలాగనగా, ఎచ్చు తక్కువ మనుష్యులందరును ఉత్తరించు స్థలమునకు పోదురనియు, దానిలో దీర్ఘ కాలము పడియుందురనియు ముందు చెప్పిన న్యాయములవల్ల తేటగా తెలిసియున్న దే. అదియిట్లుండగావివేకముగల మనుష్యుడు తనకును యీలాగుసంభవించు నవియెరిగి ఏమిచేయ వలయుననగా, తానీలోకములో జీవించి యుండునపుడే మరులోకములో తనకు సంభవించబోవు నిర్భాగ్యమును నివర్తించుటకైనను, దానికఠినమును తగ్గించుటకైనను, దానికాలమును కొరతపరచుటకైనను తగినప్రయత్నము చేయునుగదా? ముందుగానే భిక్షాధర్మముచేసి, జపధ్యానము సలిపి, తపమొనర్చి, ఇతర సత్కృత్యములను నెరవేర్చి, వీటి యొక్క పుణ్యఫలములను తనకుముందు ఒక బొక్కసమును చేర్చి పంపినట్లు మరులోకమునకు పంపును. అయితే వాడు దేవనీతికి చెల్లించతగిన పరిహార అప్పు బలమైన అప్పు గనుక,

వాడు తనకు చేసినదంతయు చాలక మిగుల కొరతగా నుండు ననుటకు సందేహము లేదు. ఇందుకు ఏమిచేయవలసినదనగా, ఏ కొలతతో కొలిచెదరో ఆ కొలతతోనే మీకు కొలవబడు ననిస్వామి వచనించియున్నారే. దీనికి అర్థమేమనగా: మీరు జీవముతోనుండునపుడు ఉత్తరించుస్థల ఆత్మలకు ఏకొలతగుం డాఉపకరించ ప్రయాసపడి యున్నారో, ఆ కొలతగుండానే సర్వేశ్వరుడుమీకు మన్నింపునిచ్చేదిగాక, మీరు ఉత్తరించుస్థ లములో కష్టపడునపుడు ఆ కొలతగుండానే ఇతరులు మీకు సహాయము చేయుదురని అర్థమగునట్లు వేదశాస్త్రులు నిశ్చ యించి చెప్పాదున్నారు. ఉత్తరించు ఆత్మలనుగురించి అధిక ముగా చేయవలయునను ఆశచేత విస్తారజప తప దానధర్మము లను సలిపి, అధికపుణ్యఫలములను సంపాదించి, అనేకసారులు దివ్యపూజలు చేయించి వచ్చుదురేని మీరు ఉత్తరించుస్థలము లో అవధిపడునపుడు అలాగే మిమ్మును గురించిన్ని చేయబ డును. అధికముగా యిచ్చినవానికి అధికముగా యివ్వబడును, కొద్దిగా యిచ్చినవానికి కొద్దిగా యివ్వబడుననుట వేదవాక్య మగును. ఇప్పుడు చెప్పినదంతయు వేదవాక్యములకును బుద్ధి న్యాయమునకును సరిపడియున్నట్టు కనిపించుటయేగాక లెక్క లేని అద్భుతములవల్లను చరిత్రములవల్లను అది సత్యమని ఒప్పించిన కార్యమగుచున్నది.

“ కనికరము లేని వానిమీద కనికరము లేని తీర్పువచ్చు ను” అని అర్చ్య. యాగప్పగారు వ్రాసి పెట్టిరి. మరియు జేసుక్రీస్తు నాథుడు ఒకొకడు యితరులమీద కనికరముగానుండి, వారల తప్పితములను సహించవలయునని ఒక ఉపమానముచేత కను పరచిన పిమ్మట, “కనికరము లేని వానిని వానియజమాని

కోపించి అప్పుయావత్తు చెల్లించునంతవరకు వానిని తలారుల వశములో ఒప్పగించెను, మీలోయొకడు తన సహోదరుని పూర్ణ మనసుతో మన్నించనట్టయితే, అలాగే నాపరమ పిత యును వానికి చేయుదురు, అని వచనించిరి. ఇదిగో కనికరము లేని వానికి కనికరములేని తీర్పువచ్చుననియు, కనికరములేని వాడు తన అప్పుయావత్తు చెల్లించువరకు ఉపాధించబడుననియు జేసుక్రీస్తునాథుడును, వారి అపోస్తుడైన అర్చ్యి-యాగప్ప గారును చెప్పుచున్నారు. కనికరములేనివాడు ఎవడనగా, ఉత్తరించు ఆత్మలమీాద కనికరములేనివాడే యగును. బిడ్డలు తమ తలిదండ్రులనును, తలిదండ్రులు తమబిడ్డలనును, పెనిమిటి తన భార్యనును, భార్య తన పెనిమిటినిని, స్నేహితులు తమస్నేహితులనును, బంధువులు తమ బంధువులనును మరచి వారలు ఉత్తరించుస్థలముయొక్క కఠినవేదనలలో ఆరుదలలేకుండా, సహాయములేకుండా అఘోరముగా ఉపాధించబడుటను ఎరిగియుండిన్ని వారలను మరచి చేయివిడిచి ఒక సహాయమును చేయక పోయినట్టయితే వీరవే కనికరములేనివారలు. వీరలకే కనికరములేని తీర్వసిద్ధించును. వీరలే తమ యప్పుయావత్తు తీరువరకు ఆభయంకరమైన చెరసాలలో ఉపాధింపబడుదురు. నిజముగానే నిజముగానేమనము ఉత్తరించు ఆత్మల అవధిని తగ్గించను నివర్తిచేయను దేనినిచేయుచున్నామో అలాగే మనకును చేయబడును. ఆయాత్మలమీాదమనకు కనికరము లేనట్టయితే మనముఉత్తరించునపుడు మనమీాద యొకరును కనికరించకుందురనుట తప్పునిసత్యమగును.

"మీారు చచ్చినవారలకు ఏలాగు కృపచేయుదురో, అలాగే మీాకును సర్వేశ్వరుడు కృపచేయుదురుగాక" యని

టూ త్తనెదు వేత గ్రంథముయొక్క మొదటి అధ్యాయము ఎని మిదవ వచనములో వ్రాయబడియున్నది. మరియు జగడములో చచ్చిన సౌలురాజును, వాని కుమారుడైన జోన తానను వానినిని పాబేస్కాలాదనెదు ఊరివారలు మంచి స్థాపితము చేసినదానిని దావీదురాజు ఎరిగి వారలను పొగడినదిగాక, "అందునిమిత్తము సర్వేశ్వరుడుమీకు కృపచేయుదురు" అని చెప్పి పంపించిరి. చచ్చినవారలను స్థాపితముచేయుట మంచిదైనను, వారల ఆత్మకు కనికరించి మంచిస్థలమైన మోక్షమునకు వారలను చేర్పించునది అధికమేలైనదనుటకు సందేహపడు వారలుగలరా? కాబట్టి మనుష్యుడైనవాడు ఏలాగు ఆయాత్మలకు దయ చూపించియుండునో, ఆలాగేవానికిని దయచూపించబడును. ఉత్తరించుఆత్మలమీద భక్తిగలవాడు భాగ్యవంతుడు. ఎందుకంటే వాడాయాత్మలకు కృపచేసినలాగు వాడును కృపపొందును. ఉత్తరించు ఆత్మలమీద భక్తిలేనివాడు నిర్భాగ్యుడు. ఎందుకంటే వాడాయాత్మలకు కృపచేయక పోయిన లాగు వాడును కృపపొందబోవునదిలేదు. దేవనీతికివాడు చెల్లించవలసిన అప్పుయావత్తు తీరునంతవరకు వాడు ఉత్తరించు స్థలములో పడియుండుననుట తప్పదు.

క్రీస్తువులారా! దీనినంతయు మీరు వినినపిమ్మట మీకు ఉత్తరించు ఆత్మలమీద బహుకనికరమును భక్తియును కలుగునని తలంచుచున్నాము. ఆత్మలకు విస్తారమైన ఉపకారసహాయము చేయునది మనకు బలమైన ఆదాయమగును. అది యేలాగనగా, మనము ఆత్మల కొరకు ఒప్పగించేతంతా, మనకే పుణ్యఫలముగా తిరిగి వచ్చేదిగాక, చావుకుపిమ్మట ఒకటికి నూరుగా మనకివ్వబడును అని అర్చ్య-అమృతనాథులు వచనిం

చిరి. ఇది ఇట్లుండగా ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయునది అన్నిటికంటే మహా ప్రయోజనము గలదని కనిపట్టి ముందువెనుకు యోచింపక మీచేత కూడినవాని నన్నిటిని వీరలకు చేయవలయునని తీర్మానించ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిద సుకృతజపము.

జేసునాథుని దివ్యహృదయమా! ఉత్తరించు ఆత్మలమీద దయగానుండండి. (300 దినముల ఫలము)

## జ ప ము.

మృతిపొందిన వారల ఆత్మలకు నిత్య జీవ్యమును దయ చేయువారును, వారల శరీరములను మరల లేపెడువారుగా నుండెడు సర్వేశ్వరా! పాపాత్ముల మనవులకు కనికరించ చిత్తముగా నున్నారే. మృతిపొందిన స్త్రీ పురుషులయొక్క ఆత్మలనుగురించి పాపాత్ములమైన మేముచేయు జపములనును చిందు కన్నీళ్ళనును మహాకృపతో చూడ నవధరించండి. ఆయాత్మలు ఉత్తరించు వేదనలనుండి రక్షించబడి మోక్షము యొక్క మారని కాంతిమహిమను ధరించి పేరింప ప్రవాహ ములో మునిగి మీయొద్ద సదాకాలము జీవించవచ్చుటకు చేయవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఒక వ్యాధిగ్రస్తుని సంధించి వానికి ఆరుదల మాటలు చెప్పి ఆపుణ్యమును ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించుట.

## అ ద్భు త ము.

ముక్తిభాగ్యము పొందిన లీద్వీనమ్మ సకలపుణ్యాము

లకు తేటమైన అద్దముగానుండినను ఆమెయొద్దగల ఓర్పు అను పుణ్యము అధికముగా ప్రకాశించునట్లు; సర్వేశ్వరు డామెకు కఠినవ్యాధిని పంపిరి. మరియు నామె ఉత్తరించు ఆత్మమీద మహాభక్తిగలదిగా నుండినందుచేత ఆయాత్మలు ఎంత వేదన అనుభవించు చున్నారని సర్వేశ్వరు డామెకు పలుమారు కనుపరచిరి. దానినిగని ముక్తి లిద్వీనమ్మ పలువ్యాధులవల్లను, పలు వ్రణములవల్లను, తనకువచ్చిన కష్టమంతటిని ఆ యాత్మ లకు ఆరుదలగా ఒప్పగించును. సర్వేశ్వరుని సముఖములో ఆమె రెండుకన్నులనుండి రక్తకము కారువరకు కన్నీళ్లుచింది ఆయాత్మలకొరకు వేడుకొనును. దానికి అధికరించి కఠిన తపక్రియలను నడిపించును. ఆమె దీనినంతయు చేసుకొనివచ్చు టచేత ఉత్తరించు స్థలమునుండి లెక్కలేని ఆత్మలను రక్షించి మోక్షమునకు పంపినదని ఆమె చరిత్రములో వ్రాయబడి యున్నది.

ఆమె ఇదియంతా చేయుచుండునపుడు ఆమెతల్లి చని పోయినది. ఆమె ఆత్మకొరకు ముక్తి-లీద్వీనమ్మ తాను అంత వరకు అనుభవించిన కష్టములన్నిటిని ఒప్పగించినదిగాక, ఆ యాత్మకొరకు ధర్మముచేయ తనయింటిలోనున్న గృహోప కరణములన్నిటిని అమ్మివేసినది. ఆమె చనిపోవునపుడు ఆమె చేత రక్షింపడిన ఆత్మలు ఆమెకు మహా ఆరుదలరప్పించి ఆమె ను మోక్షపేరింప రాజ్యమునకు తీసుకొని పోయిరి.

ఫ్రాన్సుదేశములో ఆర్సనెదు చిన్నయూరిలో ఒక స్వాముల వారు సకలపుణ్యములను సలిపి అనేకఅద్భుతములను చేసిన పిమ్మట 1859 సంవత్సరములో అర్చ్యశిష్టవారుగా మృతిపొం దిరి. వారును ఉత్తరించు ఆత్మలమీద ఎడతెగని భక్తియుంచి

ఆయాత్మలకు ఉపకార సహాయముచేయ ఎప్పుడును ప్రయా సపడుదురు. వారుచేయు అరుదైన కృత్యములనును పడెడు పలుప్రయాసలనును, నడపించెడు తపక్రియలనును మూడు భాగములుగా విభజించి, తమపాపముల కొరకు ఒక భాగమునును, పాపాత్ముల పాపముల కొరకు ఒక భాగమునును, ఉత్తరించు ఆత్మలకొరకు ఒక భాగమునును చేసి ఉంచుకొనుదురు. పాపాత్ములు మనసు తిరుగునట్లు పగలునందు పాటు పడనును, ఉత్తరించు ఆత్మలు కడతేరునట్లు రాత్రియందు పాటుపడనును సర్వేశ్వరునియొద్ద అడుగుకొనియుండిరి. ఆలాగే దేవచిత్తమువల్ల సంభవించినది. రాత్రియంతాజ్వరముతో కాలి, దగ్గుతో కష్టపడి, పిశాచిచే కొట్టబడి ఒక గంటసేపైనను మంచినిద్ర చేయకూడక, చెప్పరాని వేదన యనుభవించుచు వచ్చిరి. వారాలాగు చేసుకొని నచ్చునపుడు వారుమనసు త్రిప్పిన పాపాత్ములు ఎందరనియు, రక్షించిన ఉత్తరించు ఆత్మలుఎన్నియనియు లెక్కించ కూడదు.

క్రీస్తువులారా ! ఇప్పుడు చెప్పబడిన ఇద్దరుపుణ్యాత్ములు ఉత్తరించు ఆత్మలను గురించి చేసినదానినిగని అతిశయపడవల సినదిగాక, ఆ యాత్మలకొరకు మీరును. అధికముగా చేయ వలయునని ఎరుగుదురుగాక.

5 జ్యో. 5 ప్రియ. 5 త్రీ. లను చెప్పుట.
స్వామీ పాతాళమునుండి మిమ్ము.....
* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని (13 పుటచూడు)

---

## 21 వ-త్రేది.

ఉత్తరించు ఆత్మలకు ఏలాగు సహాయము చేయవచ్చు

నని చూపించెడు వర్తమానము.

## ధ్యానము

ఈ దినమువరకుచేసిన ధ్యానములవల్ల మీరందరును ఉత్తరించు ఆత్మలమీద భక్తిగానుండవలయుననిన్ని, ఆ యాత్మలకు ఉపకారసహాయము చేయవలయుననిన్ని తీర్మానించియుండుదురనుటకు సందేహములేదు. ఇపుడు ఆ ఉపకారసహాయము ఆత్మలకు ఫలించునట్లుగానును, మీకుపుణ్యఫలము లభించులాగునను అదేలాగుచేయవచ్చునని చూపించవలయును గదా? అదిఏమనగా, అనేకమంది ఆయుపకార సహాయమును తగినవిధముగా చేయకనుండుటనుగూర్చి వారలు చేయునదంతయు ఆత్మలకు ప్రయోజనములేకుండా పోవునదిగాక, చేయువారలకు సహితము ఫలములేక పోవుచున్నది. కాబట్టి ఇటువంటి ఘనమైన కార్యములో మీరు మోసపోకుండునట్లు మేముచెప్పుదానిని గవనముగా వినండి. మొట్టమొదట క్రీస్తువుడైన ఏదొకడు చనిపోయిన పిమ్మట, వానిప్రయోజనమునును వానిఆత్మనును తలంచవలసినది. క్రీస్తువుని శరీరము జ్ఞానస్నానమువల్ల అభిషేకింపబడి, భద్రమైన అభ్యాంగమువలన స్పిరితుసాంక్తు ముద్రనుపొంది, దివ్యసత్ప్రసాదమువల్ల అర్చింపబడి, ఆత్మతోఏకీభవించి సదాకాలము మోక్షములో వర్థిలనియమించబడి యున్నందుచేత, ఆశరీరమునకు ఆచార మర్యాదచేసి, దానినితగిన ఆరభారమహిమతో భూస్థాపితము చేయవలయుననుట తిరుసభయొక్క కట్టడ. అయితే ఆత్మ ఎడబాయునపుడైనను, ప్రేతమును స్నానముచేయించు నపుడైనను అజ్ఞానసాంగ్యము లేవియును చేయకూడదని మీకు చక్కగ

తెలియునే. క్రీస్తువులును, విశేషముగా క్రీస్తు ఆడవారలును, తగిన మేరమర్యాదకు విరోధముగా నేమిన్ని అనుసరించవద్దు ఇదిన్నిగాక, ఆ సమయములో తగిన అలంకారఆరభారము చేయునది మంచిదైనను, అదియంతయు తిరుసభ ఆచారప్రకారమే ఒకొకరి అంతస్తుకు తగినలాగు నడిపించవలయునేగాని, అందుకు మితముతప్పి చేసినట్టయితే ఉత్తబడాయి యనియు వ్యర్థ గొప్పతనమనియు చెప్పవలసి యుండును. మరియు క్రీస్తువునియొక్క స్థాపితము దేవసాంగ్యము గనుక, కూడిన స్థలములయందు తిరుసభలో వాడుకయగు సుకృతక్రమము లను అనుసరించ వలసినది సరియగును.

చచ్చిన వానిశరీరమును స్థాపితముచేయు అప్పుకలిగి యుండులాగు, వానిఆత్మమును విచారించ విశేష అప్పుగలదు. క్రీస్తువునికిగల ప్రధానఅప్పులలో తమవారల ఆత్మలను విచారించునది ఒక విశేషఅప్పునుట నిశ్చయమగును. అదేమనగా: చచ్చినవాని ఆత్మమునకు కావలసిన ఉపకారసహాయము ఆలస్యము లేకుండాను, కొరత లేకుండాను చేయవలసినది. కొంత మంది మంచిక్రీస్తువులు, తమలో నొకరి ఆత్మము ఎడబాయగానే తాము ఆయాత్మకొరకు వేడుకొని, ఉపదేశులు భిక్షకులు పరదేశులు మొదలగు వారలనును వేడుకొన చేయుటే గాక, బహుదూరమైననునడచి, గురుప్రసాదులయొద్దకు పోయి వెంటనే దివ్యపూజ చేయించుదురు. ఆలాగే అందరుచేయుదురేని, అదిగొప్ప పుణ్యమైయుండుటయేగాక, ఆత్మలకును బలమైనసహాయమగును. అనేకమంది క్రీస్తువులు ఏదొకకారణము లేకుండ ఆలస్యముచేసి, పదిరోజులకో, నెలకో, సంవత్సరమునకో ఒకపూజచేయించుదురు. అది సహించకూడని అసడ్డతన

మును. ఆత్మలవిషయములో ఒక గొప్ప క్రూరత్వమును అగు టచేత మీ వారల ఆత్మలకు కూడినంత త్వరలో కావలసిన ఉపకార సహాయము చేయవలసినది.

ఈయుపకార సహాయము ఏదని అడిగినట్టయితే, జప వేడుదలయును, భిక్షాధర్మమును, తపక్రియలును, తిరుసభ ఫలములును, ఉన్నతమైన దివ్యపూజయునైన ఈ అయిదు విశేష సహాయములే. వీటినన్నిటిని చక్కగా ఆయాధ్యాన ములలో వివరించు ముందే ఇవి తలంచిన ఫలము నిచ్చులాగు, ఒక పరమ సత్యమును బాగాయోచించి కనిపట్ట వలసినది. అయ్యయ్యో! అనేకులు ఈసత్యమును ఎరుగనందుచేతను, దానిని అనుసరించనందుచేతను, వారలు ఆత్మలకొరకు చేయు నదంతయు ఆత్మలకు ఫలించక పోవుటయేగాక, చేయువార లకు సహితము ఫలములేక పోవుచున్నదనుట నిశ్చయము. ఆలాగు ఆత్మల కొరకు మనము అధికముగా చేసినామని తలం చియుండునపుడు, కష్టపడెడు ఆయాత్మలు మనముచేసిన వాటి వల్లనేదొక ప్రయోజనమును పొందక, ఉత్తరించుస్థలములో రక్షింపులేక బాధపడుచునే యుందురు.

సత్క్రియలన్ని ఫలముగలవిగా నుండునట్లు, ఇష్టప్రసా దముతో చేసియుండవలయుననుట వేదసత్యమగును. అది ఏలా గనగా, శరీరమునకుజీవము ఆత్మయగును; ఆత్మకు జీవము ఇష్ట ప్రసాదమగునులని అర్చ్య-అగు స్తీన్ వ్రాసిపెట్టిరి. ఆత్మఎడబాసి పోయిన పిమ్మట శరీరము ఏదైనను చేయకూడునా? చేయ రాదు. ఆవిధముగానే చావైన పాపమువల్ల ఇష్టప్రసాదము ఆత్మనుండి తొలంగిపోయినపిమ్మట ఆత్మ చచ్చిన పీనుగవలెనె ఫలముగల సత్క్రియ ఒకటైనను చేయకూడదు. అటువంటి

సత్క్రియచేత ఒకటిన్ని పొందనేరదు. ఆసత్క్రియ చేసిన్ని చేయనిదానివలె వ్యర్థమైపోవును. అందుచేత పాపాత్ముల సత్క్రియలను సర్వేశ్వరుడు కృపతో చూచుటలేదు. చేకొనుటయును లేదుఅని వేదపుస్తకములో వ్రాయబడియున్నది. అట్లుండగా చావైనపాపముతో చేసిన సత్క్రియ ఏదియు నిష్ఫలముగా నుండుటచేతను, సర్వేశ్వరునివల్ల అంగీకరించ బడనిదిగా నుండుటచేతను, ఈసత్క్రియలవల్ల ఉత్తరించు ఆత్మలకు ఏదొక ప్రయోజనము కలుగుటలేదు; వారల వేదన తగ్గుట లేదు; ముగియుటలేదనునది నిశ్చయము.

మరియు రాజద్రోహియైనయొకడు రాజుకొరక మనివిచెప్పుకొనినట్టయితే, రాజు దానినివిని అంగీకరించునో చెప్పండి? ఆవిధముగానే పరమరాజైన సర్వేశ్వరునికి చావైన పాపముచేత మనము విరోధస్థులముగా నుండునపుడు, జపించుజపములను వారు ఒప్పుకొనుదురా? మనము ఆత్మలనుగురించి చేయు జపములకు చెవియిచ్చుదురా? ఇది మిగుల సందేహముగా నున్నది. ఇటువంటి వేడుదలవల్ల ఆయాత్మల భయంకర అప్పు కొంచెమైనను తీరనేరదు. ఇట్లుండుటవలన ఆత్మలనుగురించి మనము ఏదైనను చేయబోవునపుడు మనఆత్మమునందు ఏదొక చావైనపాపమున్నదోయని బాగావిచారించి, చావైన పాపముండినట్టయితే, మంచి పాపసంకీర్తనముచేయవలసినది. పాపసంకీర్తనముచేయ సమయము లేనట్టయితే ఉత్తమమనస్తాపమైననుపడవలసినది. అప్పుడుమనముచేయు సత్క్రియ ఫలముగలదై తలంచిన కార్యమునకు ప్రయోగించును.

ఇప్పుడు చెప్పినదంతయు తక్కిన సత్క్రియలకు అవసరమైనను దివ్యపూజకు అవసరములేదు. దివ్యపూజయొక్క ఫల

మైనది జేసుక్రీస్తు నాథునివల్ల వచ్చుటయేగాక, దివ్యపూజచే యు గురువువల్లగాని, దివ్యపూజచేయించు క్రీస్తువునివల్లగాని ఆఫలమువచ్చుటలేదు. అందుచేత దివ్యపూజ ఎప్పుడును మితి లేని ఫలముగలదిగా నున్నదనుట తప్పదు. అయితే, ఒకపాపా త్ముడు ఒక ఆత్మమునిమిత్తము దివ్యపూజ చేయించునపుడు, అట్టిపూజ ఫలమును ఇతడు తలంచిన ఆత్మకు సర్వేశ్వరుడు దయచేయుదురో, దయచేయరో యనునది సందేహముగా నున్నదని వేదశాస్త్రులు చెప్పుచున్నారు. ఎందుకంటే, వాడు సర్వేశ్వరునికి విరోధముగా నున్నందువల్ల సర్వేశ్వరుడు వాని అభిప్రాయమును నెరవేర్చినట్టయితే అది వారి విశేషదయచేత నెరవేరినదేగాని వేరుకాదు.

క్రీస్తువులారా! ఇపుడు చెప్పినదంతయు నిశ్చయముగను క, మీరు ఉత్తరించు ఆత్మలనుగురించి ఏదైనను చేయునపుడు చావైన పాపములేని శుద్ధమనసుతో దానిని చేయవలసినది.

ఒకసారి మీసకల సత్క్రియలనన్నిటిని ఆత్మలకు నిశ్చయముగా ప్రయోగించునట్టు మీరుతలంచిన ఆత్మలను చక్కగా గురించ వలసినదిగాక, ఆయా సత్క్రియలకును జపములకునుగల తిరుసభయొక్క ఫలములనును పొందవలయుననెడు తలంపుతో నుండవలయునని ఎరుగ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్ఘ్య. మరియమ్మగారి మధురమైన హృదయమా! నాకాధరువుగా నుండండి. (300 దినముల ఫలము)

## జపము.

కృపగల సర్వేశ్వరా! ఈ ఊరిసమాధులలో స్థాపితము చేయబడియున్న స్త్రీ పురుషులైన సకల క్రీస్తువులయొక్క ఆత్మ

లను కృపగాచూచి, వారల పాపములను మన్నించి, ఉత్త రించు చెరసాలలోనుండి వారలను రక్షించి, సదాకాలము మీయొద్ద జీవించుటకు ఆయాత్మలను మీయొద్దకు చేర్చుకొనవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీ. ఆ.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలను గురించి గుడికి మైనపువత్తిని కొని యిచ్చుట.

## అద్భుతము.

శాస్త్రిలలో తలైనవారుగాను, తిరుసభకు అలంకారముగాను, అర్చ్య. సామినాథులు కలిగించిన సభకు మహిమగానుండిన అర్చ్య. తోమాసనువారు ఉత్తరించు ఆత్మలమీద మహాభక్తిగా నుండునదిగాక, ఎడతెగని ప్రయత్నముతో తమ జపములవల్లను, తపక్రియలవల్లను దివ్యపూజలవల్లను వారలకు సహాయముచేయ ప్రియాసపడుదురు. వారు పారీస్ పట్టణములో, దైవీకశాస్త్రమును అందరును అతిశయించ బోధించునపుడు, కొద్ది రోజులకుముందు చనిపోయి యుండిన తమ సహోదరియొక్క ఆత్మను కనిరి. ఈ సహోదరి ఒక కన్యాస్త్రీలమఠమునకు శ్రేష్ఠురాలమ్మగానుండి అనేక సుకృత పుణ్యములను చేసియుండినను చచ్చిన పిమ్మట ఉత్తరించుస్థలములో త్రోయబడి దానిలో అఘోర వేదనలను అనుభవించుకొని యుండినది. అందుచేత సర్వేశ్వరుని ఉత్తరువు ప్రకారమే తన సహోదరుడైనతో మాసనేవారికి దర్శనమై, "నేనీ నిప్పులో అఘోరముగా బాధ పడుచున్నానే, నా మీద దయగానుండి నాకు ఉపకార సహాయము చేయవలయునని

ప్రార్థించుచున్నాను" అనినది. ఈప్రకారముగా అర్చ్య-శ్రీమాసనువారు ఆయాత్మను రక్షింప జపముచేసి, ఒక్క-ప్రొద్దుగానుండి, తపక్రియలనుచేసి, దివ్యపూజలు ఒప్పగించిరి.

అనేక దినములు జరిగినపిమ్మట, ఈ అర్చ్యశిష్టవారు రోమాపురిలో నుండునపుడు, తమసహోదరి మరల వారికికనిపించి, "నాఉత్తరింపు ముగిసినది, మీప్రయాసవల్ల నా అప్పంతయుతీరినది, సదాకాలము సర్వేశ్వరునియొద్ద విశ్రమము నొందబోవుచున్నాను" అనినది. అపుడు అర్చ్య-శ్రీమాసను వారు ఆమెనుచూచి: "మన సహోదరులిద్దరు చనిపోయియున్నారే, మరులోకములో వారలగతి ఏమిగానున్నదో నీకుతెలియునా"? అని అడిగిరి. అందుకామె: వారలలో నొకరైన అర్నాల్డూసనువారు, అర్చ్య-పాపుగారినిని తిరుసభనుసు అన్యాయముగా విరోధించిన బ్రెదెరెక్కూసనెను రాయునితో యుద్ధముచేసినందుచేతను, అందునిమిత్తము బహు శ్రమపడియుండినందుచేతను, వారి ఆత్మము మోక్షములో ఉన్నతమైన మహిమ భాగ్యమును పొందియున్నది. వేరొకరైనలందేల్ఫాసనువారు ఇంకా ఉత్తరించు స్థలములో వేదన అనుభవించుటచేత మీరు వారికి సహాయము చేయవలసినది. మీరోయనిన న్నాప్రియ సహోదరుడా! మీరు ఏలినవారికి స్తోత్రముగా కలిగించ నారంభించిన సుకృత పుస్తకములను త్వరగా ముగించి వేయండి, ఎందుచేతననగా, మాతో కూడా సదాకాలము మనోవాకుకందని చెల్వభాగ్యములను సుఖించి యనుభవించుటకు కొన్ని సంవత్సరములలోగా మోక్షమునకు పిలువబడుదురుఅనిచెప్పి మరుగైపోయినది. వీటినివిని అర్చ్య-శ్రీమాసను వారు సంతోషప్రవాహమునందు మునిగి ముందుకంటె అధిక

ముగా దేవయూడిగములో ప్రయాసించి, ఉత్తరించు ఆత్మల నిమిత్తము కష్టపడి సన్మనస్కులకు సమానముగా వర్తించి, సన్మనస్కులు నేడు మహిమగల పేరును పొందికడసారి భాగ్యమైన మరణము నొందిరి.

క్రీస్తువులారా! ఈగొప్ప శాస్త్రీయులైనవారు ఉత్తరించు ఆత్మలనిమిత్తము ప్రయాసపడినలాగే మీరును ప్రయాసపడినట్టయిన ఆయాత్మలవల్ల మీకు అనేక మేలులు కలుగునని ఎరుగ గలవారలు.

5 జ్యో- 5 ప్రియ- 5 తీర్థ- లనుచెప్పుట.
స్వామీ పాతాళమునుండి మిమ్ము........
* నిత్యపితా జేసుక్రీస్తునాథుని (వెనిలేని 13 పుటచూడు)

---

## 22 వ- తేది.

### ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయముచేయు మొదటిమార్గము జపమగును.

---

## ధ్యానము.

తగిన విధముగాచేయు. జపము సర్వబలముగలదియగుట చేత, దానివల్ల ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయవచ్చుననుటకు సందేహము లేదు. జపముయొక్క మితి లేనివల్లభమును కొంచెముసేపు ధ్యానించి చూచుదముగాక. అవసరమైన మేలులన్ని పొందకోరువారలు నా పితయొద్ద అడుగండి యనియు, అలాగు అడుగువాడు తాను అడిగిన దానిని పొందుననియు జేసుక్రీస్తునాథుడే పలుమారు సువిశేషములో వచనించియున్నారు. [illegible]

వేదశాస్త్రిలును పరీక్షించి, మహాసాక్షితో చేయుజపము పలినవారి సముఖమున సర్వవల్లభను గలదని వ్రాసిపెట్టిరి.

తమ వేడుదలవల్ల నేకదా జోజువనువారు సూర్యాయనమును నిలిపిరి. తమ వేడుదలవల్ల నేకదా ఎల్యాసనువారు వాన కురువకుండా గగనమును కట్టివేసిన పిమ్మట మరల కురిపించిరి. తమ వేడుదలవల్ల నేగదా! అర్చ్య శిష్టవారలు చచ్చినవారలను బ్రతికించి, వ్యాధులను స్వస్థపరచి. గుడ్డివారలకు దృష్టినిచ్చి, చెవిటివారలకు వినడమునున్ను, కుంటివారలకు నడుపునుకట్టడచేసి, లెక్కలేని ఆశ్చర్యమునకు తగిన అద్భుతములను కావించిరి. మరియు జపబలముచేత కొండలను కదలించను, రాళ్లు కరగను, అగ్ని చల్లబడను, దుష్టమృగములు సాధువులై లోపడను చేసినారని ఎరుగుదుము. కాబట్టి స్వయంజీవితులైన సర్వేశ్వరుడు తమస్వభావమువలన సర్వవల్లభముగలవారుగా నుండులాగునసే, తన వేడుదలవల్ల మనుష్యుడు సర్వవల్లభముగలవాడుగా నున్నాడని చెప్పతగును. కావున మనుష్యుడు తన జపవేడుదలచేత, ఉత్తరించు ఆత్మలకు సహాయమును ఊరటయును రక్షించకూడుననుట తప్పనిసత్యమగును. ముందు కనుపరచినలాగే పూర్వవేదమునందును, నూతన వేదమునందును, ఎప్పుడును ఎచ్చటను చచ్చినవారలకొరకు వేడుకొనెడు సుకృతవిధి ఏర్పరచబడియున్నది. ఆజపవేడుదలవల్ల ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము రాకుండినట్టయితే అలాగు చేయునది వ్యర్థకార్యమును అబద్ధవాదుకగా నుండునే. ఈలాగు తలంచ కూడదనుటచేత మన జపములవల్లను వేడుదలలవల్లను ఉత్తరించు ఆత్మలకు ఆదుదలయును సహాయమును రక్షించకూడుననుట పరమసత్యమగును.

దీనిలో నెరుగవలసిన విశేషమైనది. జపములో రెండు విధములుగలవు. ఎట్లనగా: ఒకొకడు వేరువేరుగా చేయుజపమును, అనేకులుకూడి మొత్తముగా చేయు జపమగును. వేరువేరుగా చేయుజపము మంచిదైనను, మొత్తముగాచేయు జపమునకు అధికఫలముగలదు. కాబట్టి భక్తివంతులు వేరువేరుగా జపించుకొనినను, మొత్తముగా చేయు జపవేడుదలకును ఏకీభవించియుండ ప్రయాసపడుదురు. ఇపుడుచెప్పినలాగే ఆత్మమీాద భక్తిగలవారలు ఆయాత్మలకొరకు వేరువేరుగా జపము చేయుటేగాక ఈ తలంపుతో అడుగడుగుకు పలు మనోసుకృతజపములనును చెప్పుకొనుదురు.

అందరు కలసి మొత్తముగా చెప్పుకొను జపవేడుదల ప్రత్యేకజపమునకంటె మించినదిగా నుండును. అది ఏలాగనగా, గుడిలోగాని, యింటిలోగాని, ముగ్గురు లేక నలుగురుకూడి, దేనినిపొంద ప్రార్థించుదురో దానిని పొందుదురని మనరక్షకుడైన జేసుక్రీస్తునాథుడే వచనించిరి. కాబట్టి మొత్తముగా కూడి చేయుజపము నిజముగానే సర్వవల్లభముగలదనుట తప్పనిసత్యమగును. మొత్తముగా కూడిచేయుజపము మూాడువిధములుగా చేయబడును. మొదటివిధము యేదనగా, అనేకులు కూడి చేయు జపమగును. రెండవవిధము: ఏదొక సభలో చేరినవారలు ఆసభలో ఏర్పరచబడియుండే జపములను ప్రత్యేకముగా జపించినను అవి సభయొక్క పొత్తుపజములు గనుక, అనేకులుకూడిచేయు జపమునకు సమానమగును. అయినందున ఉత్తరించు ఆత్మలను విశేషముగా విచారించెడు మంచి మరణాయత్తసభలో మీారు చేరినట్లయితే మంచిదగును. మూాడవవిధము: ఏసభలో చేరకనుండినను, అందరి

త్తములో కూడి జపముచేయుకుండినను, ఇట్టివాడు సాధారణ తిరుసభయొక్క జపములనును ధర్మపుణ్యములనును మనసులో ఆసించి ఇదియంతా నిజమైన ఆపేక్షతో తాను తలంచిన కార్యమును పొందేటట్టు సర్వేశ్వరునికి ఒప్పగించబడునును.

ఉత్తరించు ఆత్మలను యదార్థమైనపక్షముతో స్నేహించి వారలమీాద భక్తిగానుండువారలు ఈమూాడువిధజపముల గుండా వారలకు ఉపకారసహాయము చేయ ప్రయాసపడుదురు. మరియు ఆలాగు జపము వేడుదలవల్ల ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయునది అందరివల్లకూడిన కార్యమగును. చదువు తెలియని మోటువారలును, చేతిలో పైసాలేని పేదవారలును, మంచమునుండి కదలలేని వ్యాధిగ్రస్తులును, ముసలివారలును, ముండమోపులును సహా ఈకార్యమును నెరవేర్చునది అరుదుకాదు. ఇందుకొరకు రూకలు సెలవుచేయను, శాస్త్రము నేర్వనువలసినదా ? నీయింటిని విడిచి బయలుదేరకుండాను, నీపనిని కొరతపరచకుండాను, నీ సొత్తును పోగొట్టుకొని నష్టపడకుండాను చేయదగిన కార్యము ఇదిగదా ? దీనిని చేయక పోయినట్టయితే, ఆత్మలమీాద మీాకు ఆవంత స్మరణయును భక్తి స్నేహమును దయా కనికరమును మీామనసులో బొత్తిగా లేదని కనుపడుచున్నదే ?

ఇంకా ఈవిషయములో కొన్ని కార్యములను గమనించి ఎరుగవలసినది :—

1 ది :—సకలమైన ఉత్తరించు ఆత్మలనుగురించి జపము వేడుదల చేయునది మంచిదైనను మనుష్యుడు తనవారల

ఆత్మలను మొట్టమొదట తలంచి వారలకొరకు చేయవలసిన వాటిని చెల్లించవలెననుట న్యాయమును విధియునగును.

2 ది :—మంచితలంపులతోను, మంచిభక్తితోను, చేసి నజపముమంచిదిగా నుండినను, ప్రయోజనముగలదిగా నుండిన ను, తిరుసభ ఫలములను స్థాపించియుండు జపములను జపించు నదే అధిక యుచితమును, ఆత్మలకు అధిక ఫలమునుగలదని చెప్పవలసినది.

కూడిన తిరుసభలో చెప్పబడు జపము ప్రత్యేకజపము నకు అధికరించినది గనుక, చనిపోయిన మీవారలనుగురించి గుడిలో జనులు కూడునపుడు అడుగడుగుకు వేడుదల నడిపించ వలసినది.

4 ది :—గురువులును, సన్యాసులును, కన్యాస్త్రీలు ను, భిక్షుకులును, సర్వేశ్వరునికి అధిక ప్రియమైన వారలుగా నుండుటచేత, వారలజపములు ఉత్తరించు ఆత్మలకు అధికము గా ప్రయోగించుననుటకు సందేహములేదు. కాబట్టి మీకు సంబంధించిన ఆత్మలనిమిత్తము వారలజపములను విశేషముగా ఒప్పగించ చేయవలసినది.

5 ది :—ఉత్తరించు ఆత్మలనుగురించి సర్వేశ్వరుని సన్నిధిలో మీరు చక్కగా చేసిన జపములనేగాక, ఆయాత్మ లకు ఉపకార సహాయముచేయునట్లు అర్చ్య-దేవమాత, జోజ ప్పగారినిని తక్కిన మోక్షవాసులను వేడుకొనునది సుకృత వాడుకయగును.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య-మరియమ్మగారి మధురమైన హృదయమా! నాకాదరువుగానుండండి. (300 దినములఫలము)

# జ ప ము.

స్వయంజీవితులైన సర్వేశ్వరా! ఈదినములో మృతి పొందినవారల ఆత్మలనుగురించి దేవరవారి కృపను వేడుకొనుచున్నాము. ఆయాత్మలు భూమిలోనుండునపుడు చేసిన తప్పితములన్నిటిని దేవరవారుమన్నించి, వారలను నిత్యనరకమునకు త్రోసివేయకను, ఉత్తరించు స్థలములో బహుకాలము నిలుపకను, దేవరవారి ప్రతాపముగల సన్నిధానమునకు వారలను పిలుచుకొనవలయునని దేవరవారి మితిలేని దయాళమును జూచి మిమ్మును ప్రార్థించు చున్నాము స్వామీ. ఆమెన్ జేసు.

చేయువలసిన సత్క్రియ

ఈ దినము చనిపోయినవారల ఆత్మలనిమిత్తము జేసునాథస్వామి పంచగాయముల జపమును వేడుకొనుట.

# అ ద్భు త ము.

ప్రాన్సుదేశముయొక్క కర్పాందిరాసనెడు పట్టణములో, ముక్తిభాగ్యముపొందిన యొస్ ప్రీతమ్మ కీర్తివహించియుండినది. ఆమె సకలపుణ్యా సాంగోపాంగవతిగా నుండినను, ఆమెయొద్ద విశేషముగా మనోతాక్షియును, శాంతగుణమును ప్రకాసించుచుండినది. అందుచేత, ఆమె తపవేడుదల సర్వేశ్వరునికి అధికప్రియపడి అడిగినదంతా పొందుచుండెను. ఆమె సహాయమునడుగ, ఉత్తరించు ఆత్మలు అనేకమారులు ఆమెకు దర్శనమైనదిగాక, ఆమె వేడుదలవల్ల విస్తార ఆత్మలు ఉత్తరించు స్థలమునుండి విడుదలనొంది మోక్షమునకు పోయినట్టుగా ఆమె చరిత్రయందు వ్రాయబడియున్నది. ఆ పట్టణములో పెండ్లి చేసుకొనని మర్గరీతమ్మ యనెడు భక్తిగల ఒక స్త్రీ

యుండినది. ఆమెయును మెస్ బ్రీతమ్మయును ఒకరి కొకరు అన్యోన్య స్నేహముగనుండి, పుణ్యములో వర్తించునట్లు ఒకరి నొకరు ప్రోత్సాహపరచుకొని, నానావిధ పుణ్యములనును, ధర్మక్రియలనును, చేసుకొనుచువచ్చిరి. వీరలు ఈలాగు చేసు కొని వచ్చునపుడు, కొద్ది వయసుగలదిగానుండిన మర్గరీతమ్మ చనిపోయినది. ఈమె అన్ని పుణ్యములను ధర్మములను చేసి యుండినను, కొన్ని స్వల్పతప్పిదములను గురించి నీతిగల సర్వే శ్వరుని వల్ల ఉత్తరించు స్థలమునకుపోను తీర్వ విధించబడినది. ఆమె ఆత్మమునిమిత్తము ముక్తిపొందిన మెస్ బ్రీతమ్మ, జప ధ్యానము చేయునపుడు ప్రలాపశబ్దమును ఏడ్పుగొంతుగా వినబడి, "అయ్యయ్యో కాలుచున్నాను, నాప్రియమైన మెస్ బ్రీతమ్మా! నాకొరకు స్వామియొద్ద వేడుకొనుము" అనెడు వాక్యము ఈమె చెవులబడినది. దీనినివిని దిగులునొంది మెస్ ప్రీతమ్మ, "పో, పో, నాకు భయము పుట్టించవద్దు" అని గట్టిగా అరచిచెప్పినది. కొంతసేపటికి పిమ్మట ఆయాత్మ ము మరలవచ్చి ప్రళాపించి ఏడ్చుటను మెస్ బ్రీతమ్మ విని మనసుతేరి, "నీవెవరు, నిన్ను నాకు చూపించు, నీకు చేయవ లసినదేమి చెప్పు" మని అడిగినందుకు మర్గరీతమ్మయొక్క ఆత్మము; నిప్పుచేత మూయబడి సహించరాని వేదన యనుభ వించు విధముగా ఆమెకు తనను కనుపరచి, "నన్ను ఎరుగరా, మరణమైన మర్గరీతమ్మనునేనే. ఉత్తరించు స్థలములో బహు వేదన అనుభవించు చున్నానే, నన్ను ఆస్థలములోనుండి కాచిరక్షింప మీ జపములను సర్వేస్వరునికి ఒప్పగించ ప్రా ర్థించుచున్నాను" అని చెప్పి మరుగైపోయినది. మెస్ బ్రీత మ్మయో యనిన:-ఈ ఆత్మమునిమిత్తము కొన్నిరోజులుమహా

భక్తితో తానుచేయు జపములనును, తపక్రియలనును, సర్వే శ్వరునికి ఒప్పగించినపిమ్మట మర్గరీతమ్మ మోక్షమునకు పోయి నట్టుగా నిశ్చయముగా తెలుసుకొనివది.

వేరొక సమయములో ముప్పది సంవత్సరములకు ముందు చచ్చియుండిన ఒక గొప్ప సేనానాయకునియొక్క ఆత్మము ఆమెకు కనిపించి, “ ఇన్ని సంగతులు నేను ఉత్తరించు స్థలము లో వేదన అనుభవించు చున్నానే, నానిమిత్తమును స్వామిని వేడుకొవలయును ” అని ప్రార్థించినది. ఈ సేనానాయకుని యొక్క ఆత్మనుతలంచి అనేకమంది గురువులు దివ్య పూజలు చేసియున్నను, వాని బంధుజనులు అనేక దానధర్మములు చేసి యున్నను, ముప్పది సంవత్సరములకు పిమ్మట వానిఆత్మము ఇంకా ఉత్తరించు స్థలములో నుండినది. మెస్ర్తీతమ్మ ఈ నిర్భాగ్యమునకు కనికరించి అధికభక్తి విశ్వాసముతో వేడు కొన నారంభించినది. ఈమెజపములను సర్వేశ్వరుడు కృపా కటాక్షముతో గైకొని, ఈ సేనానాయకుని ఆత్మను మోక్ష పేరింపమునకు చేర్చుకొనిరి.

క్రీస్తువులారా ! భక్తి విశ్వాసముతో చేయుజపము అంత బలముగలదని యెరిగి ఎడతెగక ఉత్తరించు ఆత్మల నిమి త్తము వేడుకొనవలయునని ఎరుగ గలవారలు.

5-జ్యో-5-ప్రియ-5-ప్రీత్వ-లను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని (13 పుటచూడు)

# 23-వ తేది.

## ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయము చేయు రెండవమార్గము ధర్మమగును.

## ధ్యానము

ఉత్తరించుఆత్మలకు ఉపకారసహాయము రప్పించేటట్టు ధర్మముచేయునది సులభమైన మార్గమును, ఉత్తమమైన విధమును, తప్పని యుపాయమునగును. ధర్మముచేయుడము చేసినవానికిని ప్రయోగించును, చేయబడినవానికిని ప్రయోగించును. ఎవరికొరకు చేయబడునో వారికిని ప్రయోగించును. ధర్మము చేయువాడు తానుచేయు భిక్షచేత పాపబొర్పుకుతగిన దేవానుగ్రహమునను దేవకృపనుమః మోక్షపేరింపమునునుపొందును. భిక్షము పుచ్చుకొనువాడు భిక్షముచేత ఆదరుదలపొంది జీవించును, సంతోషపడి సర్వేశ్వరుని స్తోత్రించును, మేలెరిగి ప్రార్థించును! ఎవరికొరకు చేయబడునో వాడు దానివలనవచ్చు ఆదాయమువల్ల తన అప్పును తీర్చును, దేవనీతికి పరిహారించును, మోక్షభాగ్యమును పొందును. ఇట్లుండగా బహుఆస్తి సంపాదించుదానికంటే, ఒకొక కాసుగాచేర్చి పెట్టనించుటకంటే భిక్షాధర్మము చేయునది మహామంచిది. ఎందుకంటే, భిక్షాధర్మము చావునుండి రక్షించును, పాపములను తప్పించును, దేవకృప పొందచేయును, నిత్యజీవ్యమును రప్పించును, అని అతిదూతయైన అర్చ్య-రఫయేలు సన్మనస్కు- ఇతులో బ్యాసులకును ఎరిగించిరి.

మరియు మన ఏలినవారైన జేసునాధస్వామి, దర్శిద్రులు

గా నున్న వారలకును అవసరమైనవారలకును ధర్మముచేయవల యుననియు ధర్మముచేత ఎంతటి ప్రయోజనము కలుగుననియు, ధర్మముచేయు వారలకు మోక్షభాగ్యము దయచేయబడునని యు అనేకమారులు సువిశేషములో నిశ్చయముగా చెప్పినా రని ముందు వివరముగా చెప్పబడియున్నదే. అయితే ఉత్త రించు ఆత్మలవలె ఉపకార సహాయము అవసరమైన వారలు ఇంకెవరును లేరు, కష్టపడువారలు ఎవరును లేరు, అందుచేతవా రలను గురించి భిక్షాధర్మముచేయునది అన్నిధర్మములకంటె మేలైన ధర్మముగా నుండుటగాక, నీళ్లు నిప్పును ఆర్పివేయు నట్టు ఈ ధర్మమువల్ల వారలవేదనతగ్గి, వారలు దేవనీతికి చెల్లిం చవలసిన అప్పు తీరుననుట నిశ్చయము. అది ఏలాగు జరుగ కూడునంటే: ఉత్తరించు ఆత్మలు చెల్లించవలసిన పరిహార అప్పు ఒక అప్పగును. మనము భిక్షాధర్మము చేయునపుడు జేసుక్రీస్తునాథుడు దానిని తమకే అప్పగానిచ్చినట్టు చేకొను చురనుటచేత వారు మరల మనకు తీర్చవలసిన ఒక ప్రతియ ప్పుగానుండును. ఇపుడు స్వామిమనకు ఇవ్వవలసిన ఈయప్పును ఉత్తరించు ఆత్మలకు ప్రతియప్పుగా మనము ఒప్పగించుదుమేని దానివల్ల ఆయాత్మల అప్పు తగ్గునని చెప్పవలయునే.

ముందు కనుపరచినలాగే ఏపుణ్యమునందును ఏధర్మ మునందును మూడుఫలములు కలుగుచున్నవి. ఎట్లనగా: పుణ్య ఫలమును, వేడుదలఫలమును, పరిహారఫలమును ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించవచ్చుననుట నిశ్చయము గనుక, ధర్మము చేయువారలు, ఈ రెండుఫలములను ఆయాత్మలకు ఒప్పగించు చున్నారు. అప్పుడు వారలకు ఎంత ఊరట సహాయము కలు గుననియు, వారల వేదన ఎంత కొరవడుననియు, వారల కష్ట

ములు ఎంత తగ్గుననియు చక్కగా తలంచుకొనవలసినది. ఇది యిట్లుండగా, మీరు ధర్మము చేయునపుడంతా ఆ ధర్మము సర్వేశ్వరునికి అధికముగా ప్రియపడునట్టున్ను, మీ కధికము గా ప్రయోజనము రాతగినట్టున్ను ఆ ధర్మములను ఉత్తరించు ఆత్మలను గురించి చేయవలసినదేసరి.

ఇపుడు ఆ భిక్షాధర్మము ఉత్తంచు ఆత్మలకు అధికము గా ప్రయోగించునట్టు వాటిని తగినవిధముగా చేయవలసినది.

మొదటిది :—ముందుకను పరచినలాగే భిక్షాధర్మము న్ను,తక్కిన సత్క్రియలును ఫలించి, తలంచినఫలమును పొందు టకు యిష్టప్రసాదముతో వాటిని చేసియుండవలసినది. మను ష్యుడు చావైన పాపముతో చేసిన ధర్మమునకు ఫలము లేనం దుచేత, ఆధర్మము ఉత్తరించు ఆత్మలకు ప్రయోగింప నేరదు. ఎంతోమంది ఈ పరమసత్యమును గ్రహించక, తాము చేయు ధర్మమునకు ఏదొక ఫలమును తాము పొందకపోవునదిగాక, తాము గురించిన ఉత్తరించు ఆత్మలకును ప్రయోగింపక ను న్నది. అందుచేత మీరు ఏదొక ధర్మమును చేయుతలంచి యుండునపుడు చేసిన పాపములమీద ఉత్తమ మనస్తాప పడి యైనను దానిని నెరవేర్చ వలసినది.

రెండవది :—భిక్షాధర్మము చేయునపుడంతయు వ్యర్థ బహుమానమునును కీర్తినిని వెదకక, సర్వేశ్వరుని గురించి మాత్రమే చేయవలసినది. అది ఏలాగనగా, "మీరు మను ష్యుల కన్నులకు అగుపడేకొరకు వారలఎదుట మీసత్క్రియ లను చేయకుండునట్టు హెచ్చరికగా నుండండి. లేనట్టయితే పరలోకములో నుండెడు మీ పితయొద్ద వాటికితగిన సంభా వన పొందనేరరు. కాబట్టి నీవు ధర్మముచేయునపుడు డంభ

భక్తులు మనుష్యులచేత పొగడబడుటకు, దేవాలయమునందు ను, సంతవీధులయందును చేయులాగు నీయెదుట శంఖు ఊదించవద్దు. వారలు తమకు రాతగినసంభావన మనుష్యులవల్లనే పొందిరని నిశ్చయముగా మీకు చెప్పుచున్నాను. నీవ్రాయవిన ధర్మముచేయునపుడు నీ ధర్మము రహస్యముగా నుండునట్లు నీ కుడిచేయి చేసినదానిని ఎడమచేతికి తెలియకుండవలెను; అప్పుడు అంతరంగమున చూచుచున్న నీపిత నీకు తగిన సంభావన దయచేయుదురు" అని జేసుక్రీస్తునాధుడు శలవిచ్చిరి.

మూడవది :—ఒకొకడు తన అంతస్తుకును స్థితికినితగినలాగు ధర్మముచేయవలసినది. ఈ విషయములో పెద్దతోబ్యాసనువారు తమకుమారునికి చెప్పిన సద్బుద్ధిని వినండి. "నాకుమారుడా ! నీవలన కూడినంతవరకు ధర్మము చేయగలవాడవు. నీకు ఆస్తిఅధికముగా నుండినట్టయితే అధికముగా నిమ్ము; కొంచెముగానుండినట్టయితే కొంచెముగా నిమ్ము; అయితే ఈకొంచెము ధర్మమునైనను సంతోషముతో నీయగలవాడవు" అనిరి. క్రీస్తువ్రులారా ! మీరును మీవారల ఆత్మలనుగురించి ధర్మముచేయునపుడు అలాగే చేయవలసినది. మీకు సర్వేశ్వరుడు విస్తారముగా ఆస్తిని దయచేసియున్నట్టయితే అధికముగా చేయుండి; మీఆస్తి కొంచెముగా నున్నట్టయితే మంచిమనసుతో కొంచెముగానే యివ్వండి. ఏమిలేనిదరిద్రులు మంచిమనసుతో యిచ్చేడు ఒక దమ్మిడీ ధర్మమైనది, గొప్ప ఆస్తిమంతులు లక్షరూపాయలు ధర్మము నిచ్చుదానికంటె స్వామి సముఖముతో అధిక ప్రియముగలదని, ఒక బీదవిధవరాలి అల్పధర్మమును జేసునాధుడు మెచ్చివచసించియున్నారు.

నాలుగవది :—భిక్షగాండ్రకును దారిద్రులకును చేయ

బడిన ధర్మముగాక, ఉత్తరించు ఆత్మలనుగురించి గుడిదీపముల
కు చమురు, మైనపువత్తులు, సాంబ్రాణి, పీఠమువస్త్రములు,
పూలచెండ్లు, వత్తిస్థంభములు స్వరూపములు, పఠములు మొ
దలగునవి గుడికి కాణుకగా కొనియిచ్చుట, తిరుసభలో ఏర్పా
టైన వాడుకయును, ఆత్మలకు ప్రయోజనముగల సత్క్రియ
యునగును.

ఐదవది :—అనేక క్రీస్తు ఆడవారలైనను, మొగవార
లైనను చనిపోవుటకుముందే మరణసాధనము చేసియైనను,
నోటిమూలముగా నైనను తమ యభిప్రాయమును తెలియ
పరచియైనను, తాము చనిపోయిన పిమ్మట తమ ఆత్మ
కొరకు కొన్ని పూజలను చేయించను, లేక కొన్ని ధర్మములను
చేయను, తమ స్వంత ఆస్తినుంచి ఇంతపైకమును, లేక పెట్టు
కొనియుండే సొమ్ములను, లేక ఫలాని ఆస్తిని యివ్వవలయు
నని తమవారలకు చెప్పిపోదురు. చచ్చినవారల ఈ కోరికలను
మహాజాగ్రతతో నెరవేర్చవలయునని దేవకట్టడగలదు, తిరుసభ
కట్టడయును గలదు, సర్కారువారి చట్టమునుగలదు. సకల
జన బుద్ధిన్యాయమునుగలదు. చచ్చినవారలు ఆసించిన కోరిక
ను నెరవేర్చకను, వారల ఆత్మకు పూజలుచేయించకను, ఇతర
ధర్మముచేయకను, వారలు తమవశములో యిచ్చిపోయిన
సొత్తును అన్యాయముగా అపహరించుకునేవారలు, లేక, దిన
ము మొదలయిన వ్యర్థఖర్చులకు ఉపయోగించేవారలు,
సర్వేశ్వరునికిని తిరుసభకును పొందని గొప్ప పాపములనుకట్టు
కునేదిగాక, తమవారల ఆత్మయెడల మహా క్రూరత్వముగల
వారలని కనుపడుచున్నారు. అదివేలాగనగా, ఆలాగు చేయు
వారలు ముందుచెప్పిన పూజలవల్లను ధర్మములవల్లను ఆయా

త్మలకు రావలసిన ఉపకార సహాయమేలులను రాకుండా చేయుచున్నారుగనుక, చచ్చినవారల ఉత్తరింపుకు భాగస్తుల గుచున్నారు. మరియు ఇటువంటివారలు చచ్చినవారల తలంపుకు విరోధముగా పూజాధర్మములను చేయనందువలన తమకు ఆయాస్తివల్లను, సొమ్మువల్లను ప్రయోజనము కలుగునని తలంచకూడదు. అందుచేత వారలకు నష్టము, చెరుపు, దరిద్రము, వ్యాధిమొదలగు అనేక దండనలు వచ్చుచున్నవియని చూపించ పలు దృష్టాంతరములును చరిత్రములును ఉన్నవి. ఇట్లుండగా మీరు చచ్చినవారల తలంపులను ఏదాక కొరతయును ఆలస్యమును లేక తక్షణమే నెరవేర్చవలయునని ఎరుగ గల వారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య-మరియమ్మగారి మధురమైన హృదయమా ! మా కాదరువుగా నుండండి. (300 దినముల ఫలము)

## జ ప ము .

సర్వవల్లభముగల సర్వేశ్వరా! దేవరవారిని ప్రార్థించు వారలకు ఎప్పుడును దయచేయుదురనుటచేత మా నీచ మనవులను కృపతో చేకొనండి. మీ ఊడిగస్తులైన మా బంధుజనులు బ్రతికియుండునపుడు మిమ్ము విశ్వసించి నమ్మి మరణము పొందినారని తలంచి, వారలు కట్టుకొనిన తప్పితములన్నిటిని మన్నించి, మీ పరమ రాజ్యములో వారలను చేర్చుకొన వలయునని దేవరవారిని ప్రార్థించు చున్నాము స్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఆత్మలనుగురించి అంగహీనులకు ధర్మమునిచ్చుట.

# అద్భుతము.

జర్మానియా దేశములోగల వ్రూల్దాంధ్ర మఠమునకు రాబార్ మోరుస్ అనువారు అతి శ్రేష్ఠులుగా నుండిరి. దానికి తరువాత మాయాంజు పట్టణమునకు అతి మేత్రాణులైరి. వారు మఠమునకు శ్రేష్ఠులుగా నుండునపుడు, భిక్షుగాండ్లకు హేరాళముగా ధర్మము చేయవలసినదని మఠపెద్దకు ఆజ్ఞాపించి యుండిరి. ఏదేలారనెడు ఈ విచారణకర్త, తనకు స్వాభావికమైన పిసినారి తనముచేత, ఇవ్వవలసిన ధర్మములను తగ్గించి యిచ్చును. మరియు మఠ శ్రేష్ఠులు మఠసన్యాసులలో ఏదొకరు చనిపోవునపుడు, ముప్పది దినములవరకు చచ్చినవారల పాలి భోజనము నెత్తి, భిక్షుగాండ్లకు వేయుమని కట్టడ చేసి యుండిరి. దానినికూడా లోభితనముగల ఈ విచారణకర్త నిలిపివేయును. 830 వ సంవత్సలములో, ఒక సన్యాసివారు చనిపోగానే, శ్రేష్ఠులు వారి ఆత్మనుగురించి వాడుకప్రకారము ముప్పది దినములు వారి భోజనమును భిక్షుగాండ్లకు పెట్టవలయునని ఖండితముగా విచారణకర్తకు కట్టడ చేసిరి. ఆలాగు శ్రేష్ఠులు కల్పించియున్నను, బిజినితనముగల విచారణకర్త ఏమిని చేసినవాడుకాడు. ఈలాగువాడు భిక్షుగాండ్లకు యివ్వవలసిన ధర్మమునును, ఆ ధర్మముచేత ఆత్మలకు రావలసిన సహాయమునును అన్యాయముగా నిలిపివేసి యుండెను.

ఒక రాత్రియందు ఈ విచారణకర్త, సన్యాసులందరు కూటముగా చేరు ఒక పెద్దఅరలోకి, చేతలాంతరు దీపమును పట్టుకొని పోవునపుడు, ఆ యరలోనే క్రొత్తగా చనిపోయి యున్న సన్యాసివారును, వారికి ముందుగా చనిపోయియున్న

వేరే కొందరు సన్యాసులును కూడి కూర్చుండి ఆలోచన చేయుచుండుటను చూచెను. దానినిగని భయపడి వెంట్రుకలు జల్దరించి నడువ కాళ్లాడకను, మాటలాడ నోరురాకను స్తంభాకారముగా నిలుచునపుడు, కనుపడిన సన్యాసులలో కొందరు వానియొద్దకువచ్చి వానిమీద తొడుగుకొనియున్న వస్త్రములను పీకివేసి, వానిని కొరడాలతో అఘోరముగా కొట్టి, "క్రూరాత్ముడా, కఠినచిత్తుడా, నీ పిసినారితనమునకు ఇదే బహుమానము. ఇదిగో మూడు నాళ్ళుగడువగా నీవును క్రమించి ఇంతకధికముగా ఉత్తరించు స్థలములో ఉపాధింపబడెదవు. మాకు రావలసిన ఉపకార సహాయములను నీ పిసినితనముచేత అడ్డగించితివే, నీయాత్మకును అలాగేచేయబడును, అని చెప్పి కనుపడినవారలు అదృశ్యమైపోయిరి. విచారణకర్తయాయనిన పడినదెబ్బలచేత ఘనమైన గాయుపడి, సర్వాంగమునునొచ్చి, మూర్ఛగా క్రిందపడిపోయెను.

నడురఘామునందు తక్కినసన్యాసులు దేవసంగీతములుపాడ ఆయరయందే కూడునపుడు, విచారణకర్త ప్రేతము వలె పడియుండుటనుచూచి, మిగుల అతిశయపడిరి. కొంతసేపటికి పిమ్మట వానికి బుద్ధితేరి మాటలాడగలిగి, కస్తితో చెప్పినదేమనిన: "నా శరీర నొప్పికి ఏదొక పరిహారము చేయనక్కరలేదు; నాయాత్మకుమాత్రమే పరిహారము కావలసినది. అతిశ్రేష్ఠులను శీఘ్రముగా పిలువండి" యనెను. శ్రేష్ఠులురాగానే విచారణకర్త తాను పిసినారితనముచేత చేసినపాపము ఎంతయునియు, తాను దెబ్బలుపడినది ఏలాగనియు, తాను మూడురోజులలో చావబోవునదియు వివరించిన పిమ్మట, తనకు పాప సంకీర్తనమును, అవస్తాభ్యాంగమునును, మరణ సత్ర్పసా

దముమును ఇవ్వవలయునని అడిగెను. వీటినన్నిటిని పొందిన పిమ్మట, మూడవదినము మహాభక్తి మనస్తాపముతో చని పోయెను.

వీని ఆత్మనుగురించి మఠములో పూజలు జరిగినదిగాక, వాడుకప్రకారమే ముప్పది దినములును వీనిపాలి భోజనమును భిక్షుగాండ్లకు పెట్టిరి. ముప్పదియవ దినములో, చనిపోయిన విచారణకర్తయొక్క ఆత్మము అవలక్షణరూపముతో బహుకష్ట పడుచున్న విధముగా అతిశ్రేష్ఠులకు దర్శనమై చెప్పినదేమనిన: "నాతండ్రిగారా, నానిమిత్తము మఠములో చేయబడిన జప ధర్మములవల్ల నాకు కొంచెము ఆరుదలకలిగినది యదార్థమే. అయితే నాపిసిని తనముచేత ఆఉత్తరించు స్థలములో నిలుప బడియున్న ఆత్మలన్ని మోక్షమునకు పోయినవెనుకమాత్రము నేనుపోదును. దానికిలోగా నన్నుగురించి చేయబడు జపదాన ధర్మము దేవనీతిప్రకారము వారలకు ప్రయోగించు చున్నదే గాని, నాకుప్రయోగించుటలేదు. నాకంత పక్షమునుచూపించి న తండ్రిగారా! నన్ను చేవిడువకండి; నన్నుగురించి అధికమధి కముగా ధర్మముచేయవలసినది. ఈలాగు చేయుదురేని నానుం డి నిలుపబడిన ఆత్మలును నేనును రక్షింపబడుదుము, అని చెప్పి మరుగైపోయెను. అలాగే శ్రేష్ఠులు మరల ముప్పదిరోజులు హెరాళముగా ధర్మముచేయించిరి. అప్పుడు విచారణకర్తయొ క్క ఆత్మము అత్యంత సంతోషము తోనును మహాప్రతాప ము తోనును శ్రేష్ఠులకు కనిపించి మేలెరిగినమనసుతో స్తోత్ర ముచేసి, "మీకొరకు వేడుకొనుదును" అనిచెప్పి మోక్షము నకు పేంచేసిపోయెను.

క్రీస్తువులారా! ఈ సుకృతాద్భుతమును యోచించి

చూచినట్లయితే మీ కధికజ్ఞాన ప్రయోజనమువచ్చునే. 1 ది-ఆత్మలను గురించి చేయవలసినవాటిని చేయకనుండునది గొప్ప పాపమని కనిపించుటయేగాక, అది ఆత్మల ఎడల అధికక్రూరత్వముగనున్నది. 2 ది-ఆత్మలమీద దయలేనివాడు తానును దయకు అప్రాప్తుడై, తన అప్పుయావత్తు చెల్లించునంతవరకు ఉత్తరించును. 3 ది-ముందు చెప్పిన మఠము సన్యాసులు ఆత్మలకు ఊరటగా హేరాళమైన ధర్మము చేసినలాగు మీరును పిసినితనము లేకుండా మీవల్ల కూడినమట్టుకు ధర్మము చేయవలయునని ఎరుగ గలవారలు.

5-జ్యో-5-ప్రి-5-త్రీత్వ-లను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము.....

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని (13 పుటచూడు)

---

## 24 వ-తేది.

ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయు మూడవమార్గము తపకృత్యములగును.

---

## ధ్యానము.

సర్వవల్లభముగల సర్వేశ్వరుని నీతిప్రకారమే ఏ పాపమును పరిహారము కావలసినది. పాపమునకు చేయతగు పరిహారము రెండు విధములనుండును. ఎట్లనగా: తపసువల్ల చేయబడిన పరిహారమును, దండనచేత చేయబడిన పరిహారమును అగు ఈ రెండు విధములగును. అదెట్టిధమం టే; మనుష్యుడు మనసుతిరిగి తాను చేసిన పాపములకు తపసు చేసినట్లయితే,

ఆ తపస్సే వాని పాపమునకు పరిహారమగును. తన పాపము లకు తపసుచేయని పాపాత్ముడు నరకములోనైనను ఉత్తరించు స్థలములోనైనను దండన యనుభవించ తీర్పు విధించబడును. ఈదండనయే వాడు చేసిన పాపములకు తగిన ప్రాయశ్చిత్త మగును. తపసును, దండనయును, పాపపరిహారమునకు చెల్లు ననుటచేత, దపసును దండనయును సంబంధపడియున్నవియని ఎంచవచ్చును. అదివేలాగనగా: దండనయేదియు కష్టతరముగా నుండులాగు తపక్రియయును కష్టతరమైనదిగా నుండును. ఈ కష్టముచేతనే పాపమునకు పరిహారము కలుగుచున్నదని శా స్త్రిలు చెప్పుచున్నారు. అందుచేత పాపాత్ముడు తనకు అజ్ఞా పించబడిన దండనను తపసుచేత తీర్చునని, అనేక మారులు వేదపుస్తకములో వ్రాయబడియున్నది.

ఆలాగే మునుపటి కాలములో మహా పాపిష్టులుగానుం డిన నినివె పట్టణస్థులు తమ పట్టణమునకు రానుండినసర్వ సంహారమును తాముచేసిన తపసువలన తప్పించుకొనినారు గదా? అందుచేతనే మన ఏలినవారైన జేసుక్రీస్తునాధుడు, కూడిన జనులనుచూచి, "మీరుచేసిన పాపములకు తపసు చేయక పోయినట్లయితే, అందరు నాశనమైపోదురనిరి" జీవిం చియుండగానే తపసు చేయవలసినదిగాని, చచ్చిన పిమ్మట తపసుకు కాలములేదు. చచ్చినపిమ్మట దండనకు లోపడవల సినది. తపసుచేత పాపమునకు పరిహారము మిగుల కష్టముగ లదిగానుండును. ఇది ఇట్లుండగా, ఉత్తరించు ఆత్మలు దండన యనుభవించే, తమ పాపములకు పరిహారము చేయుదురు. అయితే జీవించియుండే మనుష్యులు తపక్రియలనుచేసి, ఆ తప స్సుచేత కలుగు పరిహారమును ఉత్తరించు ఆత్మలకు మనస్ఫూ

ర్తిగా ఒప్పగించినట్టయితే ఆపరిహారమును ఆ యాత్మలకు ప్రయోగించుననుటకు సందేహము లేదు. అందుచేత ఉత్తరించు ఆత్మలు పడెడు దండనను మనతపసు వలన నివారణము చేయవచ్చును; తగ్గింపవచ్చును; ముగియ చేయనచ్చును. కాబట్టి ఉత్తరించు ఆత్మల మీద భక్తిగలవారలు, ఆయాత్మల కొరకు నానావిధ తపక్రియలనుచేయుచుందురు.

క్రీస్తువులారా! మీవారల ఆత్మలు ఉత్తరించు స్థలము నుండి శీఘ్రముగా రక్షింపబడి మోక్షమునకు పోవలయునని మీరు ఆశించినట్టయితే, వారలనిమిత్తము తపసుచేయండి. తపసనేమాట వినినట్టయితే, అనేకమంది అది గొప్పకష్టమని యు, మహా ఋషులకును సన్యాసులకును మాత్రమే చెల్లు కార్యమనియు, భయపడి వెనుకు దీయుచున్నారు. తపసును గురించి కలుగు ఈభయము, పిశాచివల్ల కలుగుచున్న దేగాని వేరుకాదు. అదేలాగనగా, మంచిమనసు మంచికోరిక యుం డునేని, బహు సులభముగా తపసు చేయనచ్చును. ఎట్లనిన: తపకృత్యములు పలువిధములు గలవు; వాటినన్నిటిని ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముగా ఒప్పగించ వచ్చును.

1 ది—పిశాచి శోధనలను నిషేధించి, పాపము చేయకుండునట్టు పడెడు ప్రయాసయును, పుణ్యామార్గములో సుస్థిరముగా నడచునట్టు పడెడుప్రయాసయును మంచి తపక్రియలకు సమానముగా నుండేటందువలన వీటినన్నిటిని ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించ వచ్చును.

2 ది—తిరుసభ కట్టడచేసిన అప్పు ఒక్కప్రొద్దుయును, శుద్ధభోజనమును, ఈ మొదలగు అప్పుగల కార్యములు నిజమైన తపక్రియలుగా నుండుటవలన వీటినన్నిటిని ఉత్తరించు

ఆత్మలకు ఒప్పగించినట్టయితే వారలకు ప్రయోగించు ననుటకు సందియము లేదు.

3 ది.—ఈ లోకములో సంచరించు మనుష్యునికి ఎడతెగని పలుదుఃఖ దురితములును కష్టిసంకటములును ఆపత్తు విపత్తులును కలుగుచున్నవనుట అందరికి తెలిసిన విషయమే కదా? శరీరమును ఉపద్రవపరిచెడు వ్యాధులును, నొప్పులును, లెక్కలేనివైయుండగా ఈశరీరము ఎప్పుడును నొచ్చినలిగి బాధపడుచున్నదనుటకు సందేహము లేదు. మనసులో కలిగెడు భయభీతి, కష్టిదుఃఖము, చింతక్లేశము, మనుష్యుని ఎడతెగక వేధించి బాధించుచున్నది. బుద్ధియందు కలుగు చీకటి అంధకారమును, బుద్ధిహీనము, తమలోగా తగని యోచనలును ఎన్నియని ఎంచెడువారలు లేరు. ఆత్మలో లేయు పలుతంత్రములనును కాని విచారములనును, కూడని శోధనలనును ఎరుగని వారలు గలరా? పరులమూలముగావచ్చు విరోధములును విఘ్నములును, ఫిర్యాదు వ్యాజ్యములును, జగడకలాపములును, కష్టనష్టములును మనుష్యునిమిగుల బాధపరచుచున్నవిగదా? మరియు కాలవ్యత్యాసములవల్లను, గాలి, చలి, మంచు, ఉష్ణము, ఎండ వానవల్లను, కరువు మొదలగు యుపహతులవల్లను సమస్తులకు కలిగే కష్టము ఎంతయని చెప్పకూడదే, ఇవియన్ని సహించడము మిగుల కష్టమేగనుక, వీటిని ఓర్పుతో చేకొనినట్టయిన ఉత్తమ తపక్రియలవలె మనుష్యుని పాపపరిహారమునకు ప్రయోగించును. వీటినన్నిటిని ఉత్తరించు ఆత్మలు చేయవలసిన పరిహారమునకు ఒప్పగించినట్టయితే అందుచేత వారల ఉత్తరింపు తగ్గునదిగాక బహుశీఘ్రముగా ముగియుననుట మహానమ్మికముగును.

అయితే ఎంతోమంది వీటినన్నిటిని ఓర్పులేక, మంచి మనసులేక మొరపడి,నల్లముఖముతో అనుభవించుకొని వచ్చుటచేత, అల్పప్రయోజనము సహా పొందకనుంటున్నారు. ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయముచేయుటకు దొరకిన అంత మంచి యుపాయములను ఇటువంటివారలు వ్యర్థముగా విడిచిపెట్టుటచేత, ఆయాత్మలకు ఏదొకయూరట కలుగుటలేదు. సహోదరులారా! మీరాలాగు అసడ్డగా నుండవద్దు. మీకును ఉత్తరించు ఆత్మలకును ఫలమును పొంద ఇదే కష్టములేని సులభమైనమార్గమని ఎరిగి ఓర్పుతోను, దేవచిత్తమునకు లోపడుటతోను, వీటినన్నిటిని సంహించుకొని సర్వేశ్వరునికి ఒప్పగించుకొని రాగలవారలు.

4 ది:-ఒకొకడు మనసొప్పిచేయు సత్క్రియలునుగలవు. ఎట్లనగా: తిరుసభకట్టడకు అధికముగా ఉపవాసము శుద్ధభోజనమును, ముండ్లయొడ్డాణము, పంచత్రాడును, నిదురగాచి జపముచేయుటయును, ఈ మొదలగు ప్రయాసగల ప్రయత్నములగును. ఇటువంటి తపక్రియలను తపోధనులును, గురువులును, సన్యాసులును, కన్యాస్త్రీలును మాత్రమే చేసుకొని వచ్చుచున్నారని తలంచకండి. ఈ లోకములోని పలు ఉద్యోగములు చేయువారలును, గొప్పవంశములో పుట్టినవారలును, సేవకులు, సేనాధిపతులును, రాజులు, ప్రభువులు, చక్రవర్తులును, మృదుశరీరముగల స్త్రీలలో అనేకులును ముందుచెప్పిన తపక్రియలను అనుసరించుకొని వచ్చుచున్నారనుట నిశ్చయము. ఈ తపక్రియలవల్ల అనేక జ్ఞాన ప్రయోజనము వచ్చుచున్నదనుటకు సందేహములేదు. వీటివల్ల పిశాచి శోధనలను సులభముగా జయించవచ్చును, తన గుర్గుణములను అణచవచ్చు

ను, దేవవరములను పొందవచ్చును, తనపాపములకు పరిహార ము చేయవచ్చును. మోక్షములో అధిక బహుమానము పొందవచ్చును. మరియు ఇటువంటి తపక్రియలను ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించినట్లయితే ఆ యాత్మలకు ఎంత ఉపకార సహాయము కలుగునని చెప్పనలవికాదు.

క్రీస్తువులారా! ఇన్ని తపక్రియలనన్నిటిని అనుసరించు నది మీవల్ల కూడని కార్యమనుటనిజమే. అయితే వీటిలో కొన్నిటినైనను తెలుసుకొని చేసినట్లయితే అందుచేత చనిపో దురని తలంచకండి. ఎంతోమంది గొప్ప తపోధనులు కఠిన తపసంతయు చేసి, ఎనుబది, తొంబది నూరు, నూటయిరువది వయసులో మాత్రము చనిపోయిరి. "చిన్నవారలును, మృదు వైనస్త్రీలును అనుసరించుకొని వచ్చెడుదానిని పెద్ద మొగవా రలమైన మనము అనుసరించక నుండవచ్చునా యని" అర్చ్య అగుస్తీన్ చెప్పియున్నారు. కాబట్టి సహోదరులారా! ప్ర యాస లేక, కష్టము లేక, నిగ్రహము లేక మోక్షమునకు పోవు వారలు ఒకరును లేరని యెరిగి ఏలాగైనను తపసు చేయవలయు నని ఎరుగగలవారలు.

అనుగమునకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య-మరియమ్మ గారి మధురమైన హృదయమా! నాకాదరువుగానుండండి. (300 దినములఫలము)

## జపము.

సర్వకృపగలవారైన సర్వేశ్వరా! దేవరవారి ప్రకా శముగల సన్నిధానములో మేముచేయు తాళ్లిగల జపములను కృపాకటాక్షముతో చూచి, ఏడ్చెడువారలకు ఉపశమనము

నును, కష్టపడువారలకు సంతోషమునును, చనిపోయే వార లకు మంచి మరణమునును ఉత్తరించు ఆత్మలకు నిత్యవిశ్రాంతి నిని కట్టడచేయవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీ ! ఆమెన్ జేసు.

ఉత్తరించు ఆత్మలను గురించి ఏదొక తపక్రియచేయుట.

## అద్భుతము.

హుంగరిదేశపు రాజకుమార్తెయైన అర్చ్య-ఎలిశబేతమ్మ ఉత్తరించు ఆత్మలమీద మహా భక్తిగా నుండేదిగాక, చచ్చిన వారల ప్రేతములను మంచి భూస్థాపితముచేయించును. ఆమె రాజకుమార్తెగానుండినను, బీదజనుల ప్రేతములకు చేయవలసిన కార్యములను, ఆమె తనచేతులతో అనేకమార్లు చేయుచు వచ్చును. వారలకుమర్యాదగా ఆమెయును ప్రేతమువెంట సమాధికి పోవును. వారల ఆత్మకొరకు మహాభక్తి శ్రద్ధతో జపముచేయును. హుంగరిదేశపు రాజ్ఞియైన ఆమెతల్లి చనిపో యినపిమ్మట అర్చ్య - ఎలిశబేతమ్మ ఆమెయాత్మనుగురించి రాత్రింబగలు జపించుటయేగాక, హేరాళమైన భిక్షాధర్మము నిచ్చి, ప్రతిదినమును కఠినతపకృత్యములను నడిపించుకొని వచ్చును. ఆమె వీటినన్నిటిని విసుగులేకుండా చేసుకొనివచ్చిన ప్పటికిని, బహునాళ్ళకుపిమ్మట ఆమెతల్లి, మహాకష్టకనిపించెడు ముఖముతోనును, సహించరాని వేదన యనుభవించెడు విధ ముగా, ఆమెకుదర్శనమై ఆమెయెదుట మోకాళ్ళమీద నుండి నిట్టూర్పువిడిచి చెప్పినదేమనిన: " నా ప్రియముగలకుమార్తే! నీతల్లినినేనే. నేను అనుభవించెడు వేదన సహించరాని వేదన గనుక, నామీద దయగానుండి; నాకొరకు ఎడతెగకుండా

దేవకృపను నీవు ప్రార్థించవలయునని నీయొద్ద అడుగవచ్చితిని. నిన్ను కని పెంచుటలో నేనుపడిన ప్రయాసలను జ్ఞాపకపరచుకొని, అఘోరముగా నన్ను కాల్చిదహించు ఈ అగ్నినుండి నన్ను కాపాడ ప్రయాసపడు నా కుమార్తే! నీ సముఖమున సాష్టాంగముగా పడియుండు. నీ తల్లినైన నా మీద దయగా నుండు" అనిచెప్పి మరుగై పోయినది. అర్చ్యా- ఎలిశ జేతమ్మ యోయనిన మనసుకరిగి బహుగా దుఃఖించి, ముందుకంటె అధిక తపకృత్యములనును చేసుకొని వచ్చినది. ఉత్తరించు స్థలనిప్పులో అఘోరముగా బాధపడెడు తన తల్లియొక్క రూపము తనయొద్ద ఎప్పుడున్నట్టుచూచి, ఏదొక విశ్రమము లేక రాత్రినిద్రించను, పగలుభుజించను విశ్రమము లేక సదా జపములుసలిపి ఒకేరీతిగా తపసుచేసుకొని యుండినది. ఆలాగు అనేకదినములు చేసినపిమ్మట, తల్లిఆమెకు కనుపడి, తనవేదన తీరి, తాను మోక్షమునకు పోవుచున్నట్టుగా ఆమెకు మేలెరిగి నతనముతో నెరిగించి, మహా సంతోష ప్రతాపముతో మోక్షపేరింప గృహమున కేగినది.

క్రీస్తునారా! ఈ యద్భుతమును తలంచి మీరును చనిపోయిన మీతలిదండ్రులు, స్వంతమైన వారలను గురించి జపతప దానధర్మాది మొదలగు సత్కృత్యములను ఎడతెగకుండాచేసి ఒప్పగించవలయునని యెరుగ గలవారలు.

5-జ్యో-5-ప్రి-5-త్రీత్వ-లను చెప్పుట.

స్వామీ పాతాళమునుంశి మిమ్ము.........

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని (13 పుటచూడు)

# 23-వ తేది.

## ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయము చేయు నాలుగవ మార్గము తిరుసభయొక్క జ్ఞాన ఫలములు పొందుటయగును.

## ధ్యానము.

అప్పుపడిన మనుష్యుడొకడు తనబాకీని చెల్లించ ఒక ధర్మిష్టుని బొక్కసమునుండి కావలసిన ద్రవ్యమును ఎత్తుకొనకూడునేని, తనయప్పును తీర్చివేయక నుండునో? వాడు అపుడు తన అప్పును చెల్లించక యుండినట్లయితే వాడు మతిహీనుడనియు, బుద్ధిలేనివాడనియు, పిచ్చివాడనియు పేరుకలుగునుగదా? మనుష్యుడు తాను చేసినపాపములవల్ల, దేవనీతికిఋణస్థుడైయున్నాడనుట నిశ్చయము. ఈ ఋణమును తీర్పునది మహాకఠినమును ప్రయాసగానుండుటచేత, అది చాలామట్టుకు వానివల్ల తీర్చకూడని కార్యముగా నుంటున్నది. అయితే ఈఋణమును తీర్చ తిరుసభయొక్క జ్ఞానఫలములణగిన, తరగని బొక్కసమునుండి ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయము చేయతగినట్లు, అవసరమైనఫలములను ఎత్తుకొనవచ్చుననుట విశ్వాససత్యమగును.

అది ఏలాగనగా, అర్చ్య-తిరుసభ, ఏలినవారు తనకు దయచేసిన అధికారమునుగొని, జేసునాధుని వెలలేని పుణ్యఫలములును, అర్చ్య శిష్టవారలయొక్క మిగత ఫలములును, మనుష్యులకు బహుమానముగా పంచియిచ్చుచున్నది. దాని మూలముగా మనుష్యుడు తన అప్పును తీర్చవచ్చును. ఉత్తరిం

చు ఆత్మలకును ఉపకార సహాయము చేయవచ్చును. నిజమైన సర్వేశ్వరుడైన జేసుక్రీస్తునాథుడు, సకలలోకములను రక్షింప తమ దివ్యరక్తముయొక్క ఒక బొట్టుమాత్రమే చాలుననుట తప్పని సత్యమగును. అయితే మన పరమనాథుడు పడరాని పాట్లుపడి, నింద బాధలన్ని అనుభవించి, తమ ప్రాణమును సహా బలిగానిచ్చి, తమ దివ్యరక్తమును కడపటి బొట్టువరకు చిందచిత్తమైనందుచేత, ఈలోకరక్షింపు సంపూర్తిగా నెరవేరి నదిగాక, వారిపుణ్యఫలములు మితిలేని విధముగా పెరిగిపోయి నవనుట తప్పదు. మరియు కళంకములేని దేవమాతచేసిన పుణ్యములకు లెక్కామితములేదు. ఇంకా పితాపితృులైన అర్చ్య-జోజప్పగారును, అపోస్తులును, వేదసాక్షులును, కన్యలు తపోధనులు మొదలైన లెక్కలేని అర్చ్యశిష్టులును, తాముచేసిన జప తపము దానధర్మము మొదలగు సత్కృత్యములచేత తాము చెల్లించవలసిన పరిహార అప్పులను తీర్చుకొనినదిగాక, ఈ సత్క్రియలవల్ల వచ్చినఫలములును మించియున్నవియని చెప్పవలసినది.

ఈలాగే జేసునాథుని వెలలేని పుణ్యఫలములును, అర్చ్య-దేవమాతయొక్క ఎన్నికలేని పుణ్యఫలములును, తక్కిన అర్చ్యశిష్టవారల మిగత పరిహారఫలములును దేవకృపవల్ల తిరుసభకు స్వాంతబొక్కసమైనవి. మన ఏలినవారైన జేసుక్రీస్తునాథుడు తాముస్థాపించిన ఏడు దేవద్రవ్యఅనుమానముల మూలముగా, తమ మితిలేనిఫలములను మనకు దయచేసిన లాగే, తిరుసభయనునది తనకు ఏలినవారు దయచేసిన అధికారమునుగొని, ముందుచెప్పిన బొక్కసమునుంచు జ్ఞానద్రవ్యములను మనకు ఇచ్చుకొని వచ్చుచున్నది. ఈ ఫలముల మూ

లముగా సుక్రుతవిధి ఎవ్విధ బలమైన న్యాయముల యందును ఊసియుండుట చేతను, సత్య తిరుసభలో ఏ కాలమునందును వాడుకపడివచ్చుట చేతను దీనికి విరోధముగా పతితులు వద రెడు దూషణములన్నియు పూర్ణ అన్యాయమును, శుద్ధ అబద్ధ ముగానున్నవని అందరికి తెలియును. భక్తిగల క్రీస్తువులో యనిన ఏలినవారైన స్వామి మనకు చేయనవధరించిన ఉపకారములలో నిది గొప్పయుపకారమని ఎంచి, దానికొరకు వారికి స్తోత్ర ము చేయుటయేగాక పలుఫలములను పొందనును ప్రయాస పడుదురు.

క్రీస్తువులారా! తిరుసభదయచేసిన ఫలములవల్ల మీకు అధికాధికముగా జ్ఞానప్రయోజనము రాతగినట్టు ఇప్పుడు చెప్ప బోవుదానిని గవనించి వినండి.

1 ది:-పరిపూర్ణ ఫలమనియు ప్రత్యేక ఫలమనియు రెండు విధములయిన ఫలములుగలవు. పరిపూర్ణ ఫలము లే వనగా, పాపమునిమిత్తము రాతగు అనిత్యదండనను పూర్ణ ముగా నివారణచేయు ఫలమగును. ఏదొకడు ఆ పూర్ణ ఫలము నుసంపూర్తిగా పొందునేని, పరిశుద్ధుడై మోక్షమును పొందు టకు పాత్రుడుగానుండును. అయితే పరిపూర్ణ ఫలమును సం పూర్తిగా పొందునది కష్టమును, అపూర్వమునగును. ఎందు కంటే అందుకుతగిన దేవస్నేహమును, నిజమైన మనస్తాప మును, స్వల్పపాపములమీద సహితము సరియైన అసహ్య మును కావలయుననుటచేత; ఇవియన్నియు కలిగియుండునది సులభమైన కార్యముకాదు. అయినను దానిని సంపూర్ణ ముగా పొందకపోయినను దానిలో ఒకభాగమైనను పొందు నదితప్పదు.

ప్రత్యేక ఫలములోయనిన పాపమునకు రాతగిన అని త్యశిక్షలో కొన్నిరోజులను, లేక కొంతకాలమును మాత్రము నివారణముచేయు ఫలమగును. కాబట్టి నలుబదినాళ్లు, నూరు దినములు, ఏకసంవత్సరములు, పదిసంవత్సరములు మొదలగు నవి ప్రత్యేకఫలము లనబడును. ఈ ప్రత్యేకఫలములవల్ల పూర్వీకతిరుసభలో ఆయాపాపమునకు విధించబడు శిక్షలో, ఇన్ని రోజులు, లేక ఇంతకాలము ఉత్తరించుస్థలములో చేయవలసిన పరిహారము మాత్రము తగ్గును.

2 ది.-పరిపూర్ణఫలమునైనను, ప్రత్యేకఫలమునైనను, తనకే పొందచేయ వలసినట్టయితే చావైన పాపములేక, యిష్టప్రసాదముతో నుండవలయుననుట నిశ్చయము. పరిపూర్ణఫలములను పొంది ఇతరులకు ఒప్పగించవలయునని కోరినను, అప్పుడుకూడా చావైనపాపములేక యిష్టప్రసాదముతో నుండవలసినది. వీరలకు ప్రత్యేకఫలములను ఒప్పగించుటకు యిష్టప్రసాదము అవసరములేకుండినను అదియునుఉండి నట్టయితే బహుమంచిది.

3 .-ఏయేఫలములను పొందవలయునన్నను, దానిదానికి కట్టడచేయబడిన దానినంతా తప్పక అనుసరించవలసినది. పరిపూర్ణఫలమును పొందుటకు పాపసంకీర్తనము చేయను, సత్ప్రసాదము లోకొనను, అర్చ్య. పాపుగారి సుకృత తలంపు కొరకు వేడుకొనను ఉత్తరువుచేయుట వాడుక.

4 .-ఏయేఫలమును పొందవలయునంటే దానిని పొంద వలయునను అభిప్రాయము ఉండవలసినదిగాక, దానికి ఆజ్ఞాపించిన సుకృతవిధులనును నెరవేర్చునది అవసరము. అభిప్రాయము మట్టుకు ఉండినట్టయితే భక్తిగల క్రీస్తువుడు ప్రతిదిన

ము చేయు జపములవల్లను, సత్కృత్యములవల్లను అనేక ఫల ములను పొందవచ్చునే. అనేకమంది వీటినితలంచనందుచేత, తమచేతదొరకిన అనేక జ్ఞానప్రయోజనములను వ్యర్థముగా పోగొట్టుకొనుచున్నారు. కాబట్టి ఆయా జపమును, లేక సత్క్రియను చేయునపుడు వాటికి గురించబడిన ఫలమును పొందవలయుననను తలంపులేకపోయినను ప్రతిదినము ప్రొద్దున ఆతలంపుకొంచెమైనను నూతన పరచవలసినది. అది ఎలాగ నగా: "నేను ఈదినము పొందకూడినఫలములన్నిటిని పొందవ లయునని ఆశించుచున్నాను; వీటినన్నిటిని నా పాపపరిహార ముకొరకు, లేక ఉత్తరించు ఆత్మలకొరకు ఒప్పగించుచున్నా ను" అని నోటిచేతగాని మనసుచేతగాని వేడుకోవలసినది. అలాగుచేయుటచేత ఫలములనుపొందవచ్చునని శాస్త్రిలుచెప్పు చున్నారు.

5 ది :—మొత్తముమీద ఫలములనన్నిటినీ, ఉత్తరిం చు ఆత్మలకు ఒప్పగించ వచ్చుననుట తిరుసభయొక్క యుత్త రువగును. అయితే ఆయాఫలములను సాధారణముగా సకల ఆత్మలకు, లేక గురింపుగా ఆయా ఆత్మకు చెల్లించవలసినట్ట యితే ఆతలంపే యుండవలసినది.

6 ది :—తిరుసభలో లెక్కలేనిఫలములు గలవనుట సత్యమే. అయితే, ఒకొకరు తమభక్తికిని అంతస్థుకును తగిన లాగు కొన్నిటిని తెలుసుకొని వాటిని సుముద్రముగా పొంద ప్రయాస పడగలవారలు. ఇట్లుండినను దేవకృపవల్ల ఆత్మరక్ష ణమునకును ఉత్తరించు ఆత్మల విడుదలకును అంతగొప్పదిని సులభమైనదినైన ఈ సహాయమును అశ్రద్ధచేయక, మహాచురు కుతో కూడినఫలములను పొందవలసినది. మహా మహిమతో

ఫ్రాంసు దేశమును పరిపాలించినవారును, అనేక యుద్ధములలో జయముపొందినవారును, ఎన్విధపుణ్యములనును అనుసరించు కొని వచ్చినవారుగా నుండిన అర్చ్య-జ్ఞానప్రకాశ రాజు, తమ మరణసాధనములో, తమకు బదులుగా రాజ్య భారము చేయ బోవు తమ కుమారునికి చెప్పినదేమనిన: "నాకుమారుడా! తిరుసభయొక్క ఫలములను పొందతలంచుదువుగాక" అని వ్రాసిరి. క్రీస్తువులారా! మీరును ఈసుకృత వాక్యమును తలంచి తిరుసభయొక్క ఫలములను ఆశతో పొందవలయునని ఎరుగ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య-మరియమ్మగారి మధురమైన హృదయమా! నాకాధరువుగానుండండి. (300 దినములఫలము)

## జ ప ము .

మధురమైన జేసువా! ఉత్తరించుస్థలములో ఉపాధింపబడెడు ఆత్మలను రక్షింప దేవరవారు మనుష్యుడుగా జన్మించి, పడరానిపాట్లుబడి, కఠినమరణమును పొందినారని కృపతో తలంచ నవధరించండి. ప్రియ జేసువా, ఆయాత్మలయొక్క అభయ శబ్దములను విననవధరించండి, వారలు చిందు కన్నీళ్ళను చూడనవధరించండి. మీతిరుమరణముయొక్క ఫలములను చూచి వారలు చెల్లించవలసిన పరిహార అప్పును మన్నించ నవధరించండి. ఇంపమునిండిన జేసువా, దేవరవారి తిరురక్తము ఆయాత్మలమీదపడి, వారల అఘోర వేదనలను చల్లార్చవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాముస్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి ఏదొక ఫలముగల జపము
ను జపించుట.

## అద్భుతము.

అర్ఛ్యి-ఐదుగాయ ఫ్రాన్సీస్కు-వారి సభలోచేరిన
ముక్తిభాగ్యము పొందిన పేర్త్రోల్దూసనువారు ఒక సమయము
న ధర్మముచేయవలయుననియు, అందువలన మహా ప్రయోజ
నము కలుగుననియు ఒక మంచిప్రసంగమునుచేసిరి. అర్ఛ్యి-
పాపుగారు తమకుచేసిన ఉత్తరువుప్రకారము ఈప్రసంగమును
వినినవారలకు పదిదినముల జ్ఞానఫలమును పాలించియుండిరి.
ప్రసంగమునకుపిమ్మట, దరిద్రురాలైన ఒకస్త్రీ, తన నిర్భాగ్య
మును వారికి తెలియపరచి "నాకుకొంచెముధర్మము దయచే
యవలయును" అని ప్రార్థించినది. దరిద్రముగా జీవించెదనని
వాగ్దత్తముచేసియున్న ఈస్వాములవారియొద్ద పైకములేను,
అందుచేత ఆమెను చూచి సహోదరీ! ఫ్రాన్సీస్కు-సభలో
చేరియుండు నాయొద్ద ఏమియు నుండకూడదను సంగతి నీకు
తెలియునే. అయితే నాప్రసంగమును వినినవారలకు పది దిన
ములఫలమును ఇచ్చియున్నాను. ఆ స్తిమంతుడైన ఫలానివాని
యొద్దకుపోయి నీవుపొందిన పదిదినములఫలమును వానికిచ్చి,
దానికి బహుమానముగా భిక్షము అడుగుకొమ్మని ఆమెను
పంపించిరి.

ఈ ఆ స్తిమంతుడు దేవకార్యములలో మహాసోమరి
అసడ్డతనము గలవాడుగానుండినను, దరిద్రురాలైన ఈస్త్రీ
తెగువచేసి వానియొద్దకుపోయినది. ఈ పది దినముల ఫలము
నకు బదులుగా నాకు ఏమి యిచ్చెదరని, ఈమె వానియొద్ద

నడుగగా, ఆ స్త్రీమంతుడు నీకు ఏమి కావలయునని విచారించె ను. స్వామిని నమ్మి ఈపుణ్యావతి మరు త్తరముగా ఈ పది దిన ముల ఫలమునును త్రాసులో పెట్టి తూంచినట్లయితే ఎంత బరు వుగానుండునో దానియొత్తు పైకము నాకు దయచేయుదురుగాక యనినది. ఆమాటకు ఆ స్త్రీమంతుడునవ్వి, అలాగే కానిమ్ము; నీ పదిదినముల ఫలమును ఒక చీటీలో వ్రాయుమనెను.

ఆమె అలాగే వ్రాసి, ఆచీటిని ఒక తట్టున నుంచగా, ఆ స్త్రీమంతుడు మరియొకతట్టునందు రెండురూకను పెట్టెను. అట్లు పెట్టినను ఇంకా చీటి అధిక భారముగా నున్నందుచేత, అయి దురూకలను, పదిరూకలను, ఇరువదిరూకలను, ఏబదిరూకల వరకు వేసి తూంచినను ఇంకా ఆచీటికి సరితూగనందుచేత బహుగా భ్రమించి, ఆశ్చర్యపడెను. అందుచేతవాడు ఆస్త్రీకి అవసరమైనదంతా సంతోషముగా నిచ్చినదిగాక, తిరుసభదయ చేయు జ్ఞానఫలముల వెలనువాడు కనిపట్టి మనసుతిరిగి, మంచి క్రీస్తుపుడుగా నడచుకొనెను.

అమెరికా దేశమునందుగల కీత్తోయనెడు పట్టణములో, అర్చ్య - మరియన్నమ్మ ప్రఖ్యాతివహించి యుండినది. ఆమె పవిధపుణ్యములవల్లను, అలంకరింపబడి, నిర్మల కన్యాస్త్రీగా నడచుకొనినందుచేత ఆమెకు "లీల్యాపుష్పము" అనేపేరు పెట్ట బడినది. ఆమె ఒకనాడు ధ్యానములో నుండునపుడు పరవశమై, ఒకగొప్ప విస్తారమైన స్థలములో, వెడల్పుగల ఒక మేజా స్థాపించియుండుటనును, దానిమీద వెండి బంగారముచేత చేయబడిన పలు నగలును, ముత్యమాణిక్యములును, వజ్రవై డూర్యములు మొదలగు మణులు పరచియుండుటనును చూచి నది. వీటినన్నిటిని అతిశయముతో ఈమెచూచునపుడు, అందరి

కొరకును ఉంచబడిన బొక్కసము ఇదే. కావలసిన వారలు దీనినుండి ఇష్టమైనట్లు ఎత్తుకొనవచ్చును. ఇందలి పలుద్రవ్యములు తిరుసభయొక్క పలుపలు ఫలములను చూపించుచున్నదను శబ్దము ఆమెకు వినబడినది.

క్రీస్తవులారా! మీకిన్ని గొప్పద్రవ్యములుగల బొక్కసము తెరచిపెట్టియుండగా, మీకును ఉత్తరించు ఆత్మలకును కావలసినవానినన్నిటిని దానినుండి ఎత్తుకొనకనుండుటదెట్లు? మీరు జ్ఞానసంపన్నులుగానుండి, ఆత్మలకు కావలసిన సహాయము చేయకనుండినట్టయితే అది మీతప్పితమేనని ఎరుగగలవారలు.

5 జ్యో. 5 ప్రియ. 5 త్రిత్వ. ను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని...(13 పుట చూడు)

---

## 26 వ-తేది.

ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయము చేయు నాలుగవమార్గము తిరుసభయొక్క ఫలములను పొందవచ్చునని మరల చూపించెడు వర్తమానము.

---

### ధ్యానము.

తిరుసభయొక్క ఫలములను పొందునది ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయముచేయ సులభమును, నిశ్చయమును, విశేషమునైయుండెడు మార్గమైనందున ఈ ఫలముల

నుగురించి ఈ దినము నురల ఇంకను ధ్యానించ గలవారలము. ఫలముగలజపములు లెక్కలేనివిగా నున్నందుచేత వాటినన్నిటిని వివరించి చూపసాధ్యముకాదు. అటువంటిజపములను తగినవిధముగా జపించినట్టయితే వాటికిగల ఫలములను పొందవచ్చుననుట సత్యము

ఆ ఫలముగల పలు జపములేకాకుండా, ఫలముగల విధులును అనేకముగలవు; ఫలముగల ఉత్తరియములును అనేకముగలవు; ఫలముగల సత్క్రియలును అనేకముగలవు. ఇవియన్ని మహామంచివైనను, మహా ప్రయోజనము గలవైనను, వీటి నిచట సరిగా వివరించుటకు కూడనందుచేత, విశేషమైన వాటినిమాత్రము చూపించెదము.

1 వ.-ఫలముగల జ్ఞానవిధులు అనేకముగలవని యెరుగుదుము. ఎట్లనగా: ధ్యానముచేయుట, జ్ఞానఏకాంతముగానుండుట, నవదిన జపములనుచేయుట, దేవమాతయొక్కయు, జోజప్పగారి యొక్కయు వూజితమాసములను కొనియాడుట, స్లీవమార్గమును సంధించుట, ఈమొదలగునవియగును. ఈసుకృతవిధులలోగా స్లీవమార్గమనునది అధిక ఫలముగలది గనుక, ఉత్తరించు ఆత్మలకు దీనిచేత అధిక సహాయమేలు దొరకుననుటకు సందేహము లేదు. స్లీవమార్గమును సంధించునది దేవభక్తియును, దేవస్నేహమును, పాపము మీాద నిజమైన మనస్తాపమును, జేసునాధుని దివ్యహృదయము మీాద కాంతిగల పట్టుదలయును, ఈమొదలగు సుకృతమేలులను రప్పించుటకు ఎంతటిమేలైన మార్గమని ఇపుడు చూపించ అగత్యములేదు. అయితే స్లీవమార్గమూలముగా పొందకూడిన జ్ఞానఫలములనును, ఉన్నతమేలులనును సులభముగా గెకొన

వచ్చునని ఒప్పించవలసిన కార్యమగును. స్లీవమార్గమును మూడువిధములుగా జపించవచ్చును. మొదటిది- స్లీవమార్గమునయొక్క 14-స్థలములు క్రమముగా స్థాపించబడిన గుళ్లలో ప్రసిద్ధముగా ఆనుకృతవిధిని నడపించునప్పుడు 14-స్థలములలోను చెప్పబడు ధ్యానములనును జపములనును కూడాయుండిజపించునది మొదటివిధమగును. రెండవది-ముందు చెప్పబడినగుళ్లలో: ఒకొకడు వేరువేరుగానైనను, ఇద్దరు ముగ్గురు కూడియైనను 14 స్థలములనును క్రమముగా సంధించి, కర్తపాటుబడిన వర్తమానములను కొంచెము ధ్యానించి, కొన్నిజపములను జపించునది రెండవ విధమగును. మూడవది- స్లీవమార్గము స్థాపించబడిన స్థలములయందును, లేక స్థాపించబడిన స్థలములలో ఏదొక వ్యాధి ఆటంకమువల్ల గుడికి రాకూడని సమయమునందును, అధికారముపొందిన గురువువల్ల విశేషవిధముగా మంత్రింపబడిన స్లీవస్వరూపమును చేతపట్టుకొని, 14 జ్యోతిశ్చక్రమంత్రములను, 14 ప్రియదత్తమంత్రములను, 14 త్రిత్వస్తోత్రములను చెప్పుకొని, జేసుక్రీస్తునాధుని ఐదుగాయములను గురించి 5 జ్యోతిశ్చక్ర మంత్రములను 5 ప్రియదత్తమంత్రములను 5 త్రిత్వస్తోత్రములను వేసుకొని, కడసారి అర్చ్య. పాపుగారి సుకృతతలంపు నెరవేరేటట్టు 1 జ్యోతిశ్చక్ర, 1 ప్రియదత్త, 1 త్రిత్వస్తోత్రమును జపించి ప్రార్థించుకొనునదే మూడవవిధమగును. స్లీవమార్గ ఫలములను పొంద మంత్రించబడిన స్లీవస్వరూపమును, యితరులకు అమ్మను, యివ్వను కూడదుగనుక, ముందుచెప్పబడిన ఫలములను పొంద ఆస్వరూపము కలవానికి మాత్రము ప్రయోగించునుగాని వేరుకాదు.

ఈ ఫలములను సులభముగా పొందను, కర్తపాటు బడిన వర్తమానములను ధ్యానించను, కొన్ని పుస్తకములలో ఆ జపములు అణగియుండుటచేత, వాటిని క్రమముగా అనుసరించునది అధికయుత్తమమగును. అయితే ఫలములను పొంద అంత విస్తారమైన జపములను చేయఅవసరము లేనందువ ముందుచెప్పబడిన సంగ్రహమైన మూడువిధములలో ఏవిధముగానైనను ఆ ఫలములను పొందవచ్చును.

ముందుచెప్పబడిన జ్ఞానమేలులనును పలుఫలములనును పొందుటను శ్లీవమార్గమును జపించువాడు చావైనపాపము లేక, యిష్టప్రసాద అంతస్తులో నుండవలసినదిగాక, పాపసంకీర్తనముచేయను, సత్ప్రసాదముతీయను, ఇతర జపములను జపించను అవసరములేదని ఎరుగగలవారలు. మరియు శ్లీవ మార్గఫలములను సులభముగా పొందతగినట్లు ఇపుడు చెప్పినలాగే భక్తికలవారలందరు విశేషవిధముగా మంత్రించబడిన శ్లీవస్వరూపములను తనయొద్ద ఉంచుకోవలసినది,

2 వ.-ఫలముగల సభలును అనేకముకలవు. జేసునాథుని తిరుహృదయసభయును, దేవమాతసభయును, దేవమాతయొక్క తిరుహృదయ శ్రేష్ఠసభయును, వ్యాకులమాతసభయును, ఉత్తరియసభయును, మంచి మరణాయత్తసభయును ఈ మొదలగు పలుసభలుగలవు. అర్స్య. ప్రాన్సీస్కు సలేసుగారు చెప్పినదేమనిన: నేను అన్నిసభలలో ప్రవేసించుచున్నాను; ఎందుకంటే, ఏప్రక్కయందును ఏదైనజ్ఞాన ప్రయోజనమునాకు చిక్కును" అనిరి. అలాగుచెప్పియుండినను సాధారణముగా అన్నిసభలలో ప్రవేశించునది అంత మంచిది కాదు. ఒకొకడు తనకుఇష్టమైన ఒకటి రెండు సభలలో ప్రవే

శించి వాని కట్టడలను అనుసరించినట్టయితే అదిచాలునని ఎంచకూడదు. ఆ సభలో అనేక జ్ఞానప్రయోజన ముండుటే గాక, సభవారలలోగా అన్యోన్య స్నేహమును అన్యోన్య సహాయమును అన్యోన్య ఆదరువును ఈ మొదలగు సామాన్య పుణ్యఫలములును కలుగుచున్నవి. అనేకసభలలో ప్రవేశించి యుండుటది మంచిదికాదనినను, అందరికీ మంచిమరణము కావలసినది అగత్యమైనందున, మంచి మరణమును రక్షించు మరణాయత్తసభలో అందరు ప్రవేశించినట్టయితే ఉత్తమముగా నుండును. మంచి మరణాయత్త సభవారలకు అనేక ఫలములును జ్ఞానమేలులును ఉండుటయేగాక, చనిపోయిన సభవారల ఆత్మనిమిత్తము పూజలు చేయించను, జపములు సలుపను, ధర్మమునొసగను వలయుననుట ఈసభయొక్క కట్టడయగును.

3 వ :-ఫలముగల ఉత్తరీయములును అనేకము గలవు కర్మేలనెడు దేవమాత ఉత్తరీయమును, వ్యాకులమాత ఉత్తరీయమును, జన్మరాజ్ఞి నీల ఉత్తరీయమును, జేసుక్రీస్తునాధుని తిరుపాటుల ఎర్రఉత్తరీయమును ఈ మొదలగునవి యగును. ఇపుడు మేము సభలను గురించి చెప్పినది ఉత్తరీయములకును చెల్లుననుటచేత, ప్రతివాడును అనేకయుత్తరీయములను ధరించుకొనక, ఒకటి రెండు ధరించుకొనినట్టయితే చాలునని ఎంచతగును. కర్మేలనెడు దేవమాత తిరు ఉత్తరీయమును ధరించి, దానితో చచ్చినవారలు నరకములో పడుటలేదనియు, ఆ ఉత్తరీయమును ధరించి కొన్నివిశేషకార్యములను నెరవేర్చు వారలు అనేకదినములు ఉత్తరించు స్థలములో పాటుపడుటలేదనియు, దేవమాతయొక్క నిశ్చయమైన వార్తగనుక అంద

రును ఈ ఉత్తరీయమును ధరించి భక్తితో ఉంచుకొనియుండ వలసినదే సరి. తక్కిన ఉత్తరీయములలో జన్మపాపము లేక జన్మించిన దేవమాత నీల ఉత్తరీయము అధికఫలముగలది. ఈ ఉత్తరీయమును ధరించుకొని యుండేవారలు అర్చ్య. త్రిత్వ మునకు స్తోత్రముగాను, జన్మపాపము లేక జన్మించిన దేవమా తకు స్తోత్రముగాను, అర్చ్య. పాపుగారి తలంపు నెరవేరు కొర కును 6 జ్యో. 6 ప్రి. 6 త్రి. లను చెప్పునప్పుడెల్లా అనేక పరి పూర్ణ ఫలములను పొందుదురనుట నిశ్చయము. అందుకు చాలైనపాపము లేక ఇష్టప్రసాదముతో నుండవలసినదిగాక, పాపసంకీర్తనముచేయును, దివ్యసత్ప్రసాదముతీయును, తక్కిన జపములను జపించను అవసరము లేదు. ఈ ఫలములన్నిటిని ఉత్తరించుఆత్మలకు ఒప్పగించ వచ్చును. కాబట్టి ఆయాత్మలు ఎంతటిఉపకార సహాయ మేలులను పొందుదురని కనిపట్టి, ఉత్త రించుఆత్మలమీద భక్తిగలవారలు, ఈ ఉత్తరీయమును ధరిం చుకొనక నుండవచ్చునో ?

4 ది :—ఫలముగల జపమాలలును అనేకముగలవు. 153 పూసలు లేక 53 పూసల జపదండయును, వ్యాకుల మాత జపదండయును, జేసుక్రీస్తునాథుని తిరురక్త జపదండ యును ఈ మొదలగునవి యగును. ఈ జపదండలన్ని ఫల మును ప్రయోజనమును గలవిగానున్నను, వాటిని ఏకముగా జపించునది కష్టమేసరి. కాబట్టి ఈ జపదండలను ఆయా విశే షసమయములలో చెప్పుకొనవలయునేగాని, 53 పూసల జప దండను మాత్రము కూడినమట్టుకు ప్రతిరోజు చెప్పుకోవలసి నది. ఈ జపదండకు పలువిధములైన ఫలములు ఉండవచ్చును. అర్చ్య. ప్రిజీతమ్మ పేరుగొనిన ఫలములు విశేషముగా విస్తార

ఫలములు గనుక, అందుకు తగ్గ అధికారముపొందిన గురువు యొద్దనుండి 53 పూసల జపదండను జపించువారలు దానిలో వచ్చు అపోస్తులయొక్క మంత్రమునకును, ఆమూజ్యోతిశ్చక్ర మంత్రమునకును, ఆయూప్రియదత్త మంత్రమునకును నూరు దినముల ఫలమును పొందుదురు. అదియునుగాక సంవత్సరము కడవ అనేక పరిపూర్ణఫలములను పొందవచ్చును. ఇంత ఫలముగల జపదండను చెప్పకొనునదే మనకుఎంతో ప్రయోజనమును, ఉత్తరించు ఆత్మలకు ఎంతో ఉపకార సహాయమును రప్పించుననీ ఎరిగి, ఆ జప దండను అడుగడుగుకు జపించునది మంచిదని ఎరుగ గలవారలు.

5 ది:-ఫలముగల సత్క్రియలును అనేకముగలవు. జ్ఞానోపదేశమును బోధించుటయును, వినుటయును, వ్యాధిగానుండువారలనును చెరబడిన వారలనును సంధించుటయును, జేసుమరియజోజప్పయను తిరు కుటుంబమును గురించి ముగ్గురుభిక్షుకులకు భోజనము పెట్టుటయును, అన్యదేశములలో సత్యవేదమును వ్యాపించచేయు సభయొక్క ప్రయత్నములును, తిరు బాలత్వసభయొక్క ప్రయత్నములును ఈ మొదలగునవి యేయగును, ఈసత్క్రియలకు తగిన ఫలములను పొందవలయునని ఆశించినట్టయితే, ఈసత్కృత్యములను చేయునపుడు చేకొనవచ్చును. ఈఫలములన్ని ఉత్తరించు ఆత్మలకు చెల్లునని ఎరుగ గలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య-మరియమ్మగారి మధురమైన హృదయమా! నాకాదరువుగా నుండండి. (300 దినముల ఫలము.)

## జపము.

కరుణాంబరసర్వేశ్వరా ! మా పూర్వీకులును, మా సహోదరులును ఈలోకములోనుండునపుడు సత్యవిశ్వాసములో నిలకడగానున్నారని కృపతో తలంచి, వారల ఆత్మలమీాద దయగానుండండి. వారల కట్లను విప్పి, అప్పులనుమన్నించి, పాపములను పరిహారించి ప్రతాపముగల మీారాజ్యమునకు వారలను చేరదీయువలయునని దేవరవారిని ప్రార్థించుచున్నా ముస్వామీా. ఆమేన్ జేసు.

చేయువలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలను గురించి ఫలముగల ఏదొకసత్క్రియను చేయుట.

## అద్భుతము.

నెయాపోలియ నెడు రాజ్యములో మంచి గోత్రములో పుట్టిన ఒక దొరసానియుండినది. కర్మేలనెడుసభ స్వాములవారొకరు, ఉత్తరీయమునుగురించి చేసినప్రసంగమునువిని, ఆదొరసాని ఉత్తరియమును పుచ్చుకొనినదిగాక, దానికిపిమ్మట దేవ మాతమీాద అధికభక్తిగా నుండినది. తనకు మంచి మరణము రానును, ఉత్తరించుస్థలమునుండి అతిశీఘ్రముగా రక్షింప బడనును కోరి, ఉత్తరీయమునకుతగిన విశేష అప్పులన్నిటిని అనుసరించుకొనివచ్చినది. తగిన విధముగా ఉత్తరీయమును ధరించుకొనిన వారల ఆత్మలను పరలోకరాజ్ఞియైన దేవమాత ప్రతి శనివారమునందును ఉత్తరించు స్థలమునుండి రక్షించుననినమ్మి తానే ఒక శనివారములో మరణముపొంద సహాయము దయ చేయువలయునని వేడుకొనియుండినది. కొన్ని సంవత్సరములకు

పిమ్మట ఆమె వ్యాధిగాపడి, ఆవ్యాధిచేతతాను చావబోవునట్టు గాను, రాబోవు శనివారము తాను చనిపోయెదనని ముందుగా నెరిగించినది. ఆప్రకారమే ఆమెపడిన కష్టమంతా మహా ఓర్పుతో సహించినపిమ్మట, శనివారమునందే చనిపోయినది. చచ్చిన దొరసానియొక్క కుమార్తె, తనతల్లి చనిపోయినందునిమిత్తము అధిక కష్టిపడుచుండునపుడు, మహాత్ములైన గురుస్వాములవారొకరు చచ్చినయామెయాత్మము మోక్షమునకు పోయినట్టుగా, దైవానుగ్రహముచేత కనిపట్టి, ఆమె కుమార్తెయొద్దకునచ్చి చెప్పినదేమనిన: " భక్తిగల కుమార్తె! నీతల్లి నిమిత్తము ఏడువవద్దు, నీకష్టిసంతోషముగా మారవలసినది. ఈలోకములో నీతల్లి చచ్చియుండినను ఆమెయేనీకు పరలోకములో ఆధరువైయుండును. ఎందుచేతననగా, ఈ దినమునందే దేవమాత కృపచేత ఆమెఆత్మ ఉత్తరించుస్థలమునుండి బయలు వెడలి, మోక్షపేరింప రాజ్యములో ప్రవేసించినదని నీకునిశ్చయముగా చెప్పుచున్నాను. కాబట్ట సంతోషపడి ప్రతాపముగల కన్యకయైన దేవమాతకు స్తోత్రము చెల్లించుచునుపుగాక " యనిరి.

క్రీస్తువులారా! ఇపుడు చెప్పిన అద్భుతముచేత భక్తితో ధరించియుండిన తిరు ఉత్తరీయములవలన వచ్చే జ్ఞానప్రయోజనములను కని భక్తివిశ్వాసముతో తిరుఉత్తరీయమును ధరించుకొనవలయునని ఎరుగగలవారలు.

5 జ్యో. 5 ప్రియ, 5 త్రిత్వ లను చెప్పుట...

స్వామీ పాతాళమునుండి మిమ్ము.........

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని...(13 పుటచూడు)

# 27 వ-త్రేది.

ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచేయు ఐదవమార్గము దివ్యపూజయగును.

## ధ్యానము.

ముందుచేసిన ధ్యానములో జపవేడుదలయును, భిక్షాధర్మమును, తపక్రియలును, తిరుసభయొక్క ఫలములును ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయముచేయు మంచి మార్గములగునని కనుకరచినట్టయినది. ఇవియున్న ప్రయోజనము గలవిగానుండినను, ఇవి మనుష్యునివల్లచేయఁబడు సత్కృత్యములు గనుక వీటికి మట్టు ప్రమాణముగలదు. ఉన్నత దివ్యపూజ అలాగుకాదు. దివ్యపూజ యగునది మట్టు ప్రమాణములేని, కొరతలేని, సర్వవల్లభముగల దేవకృత్యమగును. అది ఏలాగనగా, తిరుసభలో నడచివచ్చే దివ్యపూజయును, జేసుక్రీస్తునాధస్వామి స్లీవలో సమర్పించిన దివ్యబలియును ఒకటేయని చెప్పవలయును గాని వేరుకాదు. స్లీవలో నెరవేరిన దివ్యబలి జేసునాధుడే. దివ్యపూజలో దేవబలిగా నిలిచేవారు వారే. స్లీవబలిని నిత్యపితకు ఒప్పగించిన దివ్యగురువు జేసునాధుడే. దీనిలోనును దానిలోనును ప్రధానగురువుగా దివ్యపూజను ముగించేవారువారే. స్లీవలో వారుతమ్ముతామే బలిగా ఒప్పగించిరి. దివ్యపూజలో తమ్మును గురువులచేతివల్ల ఒప్పగించుచున్నారు. స్లీవలో నిజముగానే చనిపోయిరి. దివ్యపూజలో జ్ఞానవిధముగా వారు చనిపోవుచున్నారు. అయితే దానిలోను దీనిలోను ఒప్పగించబడేబలి ఒకటే. దానిలోను దీనిలోను ఆదే

వబలిని ఒప్పగించేవారు ఒకరే. కాబట్టి జేసునాథస్వామితమ్ము
ను స్లీవలో ఒప్పగించిన బలియగునది మితిలేని ఫలముగలదిగను
క, అలాగే దివ్యపూజయును మితిలేని ఫలముగలదనుట సత్య
విశ్వాసమగును.

దివ్యపూజయొక్క ఫలము సకలలోక పాపమును పరి
హరించ శక్తిగలదిగా నుండునదిగాక, ఇంకా అనేక కోటాన
కోటి లోకముల పాపములను పోగొట్టను వల్లభము గలదిగా
నున్నది. ఇంతవల్లభముగలపూజను. ఒక దినమునందును, ఒక
చోటునందును ఒకసమయమునందును మాత్రము ఒప్పగించబ
డక, ఎల్లప్పుడును, ఎచ్చోటను, ఏసమయమునందును చెల్లించ
బడ సర్వేశ్వరుడు చిత్తమైరి. ఇటువంటిపూజ లోకములో నడ
వకుండినట్టయితే, ఇపుడు లోకములో జరుగుచున్నను అక్రమ
ములవల్ల లోకమంతయు కాలి సర్వ సంహారముగా నాశనమై
పోవునని చెప్పవలసియున్నది. అనీతమునిండిన ఈ లోకము
మీద సర్వేశ్వరునికి వచ్చే కోపమును ఈపూజ బలియొకచే
శాంతపరచి దయ రప్పించుచున్నది.

మట్టులేని ఫలముగల ఈదివ్యపూజ ఉత్తరించు ఆత్మ
లకు ఒప్పగించ వచ్చుననుట, సత్యముతప్పని తిరుసభయొక్క
పూర్వీకకాలమునుండి ఈరోజువరకు ఎడతెగని వాడుకయైనం
దున, దివ్యపూజవల్ల ఆయాత్మలకు ఎంతసహాయము కలుగు
నని చెప్ప సాధ్యముకాదు. తగ్గవిధముగా యోచించినట్టయితే
వేదసాక్షులుపడిన సకలవేదనలయందును, గొప్ప తపోధనులు
చేసిన ఘోర తపసులయందును, ఉదారత్వకులు ఒసగిన ధర్మ
ముల యందును దివ్యపూజ అధికహెచ్చైనదిన్ని, అధిక ఫల
ముగలదిన్ని, అధిక ప్రయోజనము గలదిగా నున్నదనుటచేత,

వాని యన్నిటికంటె ఒకపూజవల్ల ఉత్తరించు ఆత్మలకు అధిక సహాయమును అధిక యూరటయును వచ్చుననుటే సత్యము.

ఇదియునుగాక, జేసుక్రీస్తునాథుడే ప్రధానగురువుగా దివ్యపూజను ఒప్పగించు చున్నారనుటనుబట్టి దానిఫలము వారిచేతనే వచ్చుటగాక, పూజచేయు గురువుచేతనయినను, పూజచేయించు వానిచేతనయినను రాదు. అందుచేత ఆఫలము ఎప్పుడును మట్టులేక, కొరతలేక అప్రమాణముగా నున్నదని చెప్పవలసినది.

ఇది ఇట్లులనుండగా, తమవారల ఆత్మలకు పూర్ణ ఆరుదలయును, సరియైన విశ్రాంతియును, నిత్య పేరింపమును అతిశీఘ్రముగారప్పించ ఆశించువారలు, ఆ యాత్మల కొరకు అప్పటప్పటికి దివ్యపూజలు చేపించుదురు. ఏదొకడు చనిపోయిన దినమునందే వాని ఆత్మనిమిత్తము దివ్యపూజలు చేయించుటెగాక, పిమ్మట వాడు చనిపోయిన మూడవ దినమునందును, ఏడవ దినమునగును, ముప్పదియవ దినమునందును మరల పూజలు చేపించునది తిరుసభయొక్క సుక్రుత వాడుకయగును. మరియు ప్రతిసంవత్సరము చనిపోయిన తారీఖున ఆలాగుచేయునది భక్తిగలవారలు అనుసరించెడు క్రమమగును. క్రీస్తువులారా! మీవారల ఆత్మలను నిజముగానే స్నేహించు దురేని, తిరుసభయొక్క ఈగౌరవ ఆచారముచొప్పున చేయుదురుగాక. అయ్యో! ఎంతోమందిజనులు ఒకసారి దివ్యపూజ చేయించినపిమ్మట, చచ్చినవారలఎడల తమకుగల అప్పంతయు తీరిపోయినట్టు వారలను బొత్తిగా మరచిపోయి ఏమిన్ని చేయక నుంటున్నారు.

దివ్యపూజయొక్క విశేషఫలము, ఉత్తరించు ఆత్మలకు

లభించునట్టు దివ్యపూజ చేయించునది, అంత మేలుగలదిగా నుండినను సాధారణముగా అందుకు చేయవలసిన ఖర్చు నూల భమైనదికాదు. అయితే దివ్యపూజను భక్తితో చూచువార లకు ఒక మహాఫలము వచ్చుటయేగాక, అడుగడుగుకు దివ్య పూజ చూచునది గొప్ప పుణ్యముగా నుండుటవలన అందుచేత వచ్చుఫలమును ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించినట్టయితే, ఆ యాత్మలకు మహా ఆదరుదలగా నుండును.

కడసారి దివ్యసత్ప్రసాదమును అడుగడుగుకు భక్తివి శ్వాసముతో లోకొనినట్టయితే, దానిచేతవచ్చు జ్ఞాన ప్రయో జనమునును, ఫలమునును ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించవచ్చు ను. ఆయాత్మలకు ఉపకార సహాయము చేయుటకు అదేయొక యుత్తమ మార్గమగును. సద్గురువైన జేసునాథుడు పాటుబడి మరణముపొంది, తమదివ్యరక్తముచేతపొందినపుణ్యఫలములను ఏడు దేవద్రవ్యానుమానముల మూలముగా మనకు దయచేయ చిత్తమైరి. అయితే తక్కిన దేవద్రవ్యనుమానములన్ని ఆపు ణ్యఫలములను ఒకొక భాగముగానిచ్చి దివ్యసత్ప్రసాదము మాత్రమే సకల మేలులకు ఊటయును కారణముగా నున్న జేసునాథుని పూర్ణముగా మనకిచ్చి వారితో జ్ఞానమేలులన్ని టిని పొందచేయుచున్నది. బొట్టు బొట్టుగా నీళ్ళనుచల్లి వరి పైరును పెంచుటకంటె, మడిని తెరచి సంపూర్ణముగా నీళ్లు పారచేయునది ఉత్తమ మనులాగుననును, కాసు కాసుగా ద్రవ్యము సంపాదించుటకంటె గొప్ప బొక్కసమును చేరుట్టు నది మేలను లాగుననును, జ్ఞానపైరుకు సమానమైనపుణ్యము లను పెంచనును, మోక్షద్రవ్యములైన ప్రసాదములను పొంద నును, తపదాన ధర్మదుశను సుకృతక్రియలను చేయుటయందు

ను తగిన భక్తితో దివ్యసత్ప్రసాదమును తీసికొనుటది మేలైన మార్గమగును. జీవముతో నుండువారలు అడుగకుండు దివ్య సత్ప్రసాదము తీయునది అంతప్రయోజనముగలదై యుండగా, ఉత్తరించు ఆత్మలకు ఆరుదల రప్పించు అభిప్రాయముతో తీసి నట్టయితే, ఆయాత్మలకు లభించు సహాయమేలు ఎంతని చెప్ప తరమగునా? ఇందుచేత సహోదరులారా! మీకు జ్ఞానప్రయోజనముగాను ఉత్తరించు ఆత్మలకు ఆరుదలగాను అడుగకుండుకు తగిన భక్తివిశ్వాసముతో దివ్యసత్ప్రసాదముతీయ ప్రియపడుదురుగాక.

అడుగకుండుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య-మరియమ్మగారి మధురమైన హృదయమా! నాకాదరువుగానుండండి. (300 దినముల ఫలము)

## జ ప ము.

మాజీవమును ఉత్థానమునైన జేసువా! దేవరవారు ఈలోకమునువిడిచి ఎడబాయునప్పుడు, మీ తిరుశరీరమును, తిరురక్తమునును మాకు పానభోజనముగా నిచ్చితిరే. ఇటువంటి మీయామితిలేని దయను జూచి మృతి పొందిన సకల క్రీస్తువుల యొక్క ఆత్మలమీద కృపగానుండండి. విశేషముగా ఆధరువులేనివారలమీద అధిక కటాక్షముంచి, సమస్తులనును నిత్యజీవితయూటగానుండెడు మీరాజ్యమునకు గొనిపోయి మీతో కూడా ఒకే పంక్తియందుంచి దివ్యామృతమును అనుభవించునట్టు కృపచేయ మిమ్ము ప్రార్థించుచున్నాముస్వామీ, ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి ఒక పూజచేయించుట. లేక పూజచూచుట.

## అద్భుతము.

కొలోన్యాయనెడు మహా నగరములో అర్చ్య-సామి నాథులు కలిగించిన సభకుచేరిన భక్తిగలయిద్దరు యానసన్యాసులు మేలైనవిద్యాశాస్త్రములను చదువుకొనుచుండిరి. ఇద్దరియొద్దను మంచిగుణమును సాంగోపాంగము ఎడల ఆశయును, చదువునందు చురుచురుకును ఉన్నందుచేత, వీరలిద్దరికిని ఉత్తమస్నేహము కుదిరిపోయినది. తమలోగా ఎవరు మొదటచనిపోవునో అతని ఆత్మమునిమిత్తము మరియొకరు ఒక సంవత్సరముదాకా ప్రతిసోమవారము ఒక పూజనును, ప్రతి శుక్రవారము ఒక పూజనును చేయవలయునని తమలోఒప్పందము చేసుకొనియుండిరి. చదివితేరినపిమ్మట గురుపట్టముతీసి, ఇద్దరును ఒకరినొకరుఎడబాసి దేవయూజిగమునిమిత్తము వెవ్వేరుస్థలములకు ఉద్యమించపోయిరి. ఇరువరును అనేకసంవత్సరములవరకు ఎటువంటి పుణ్యములనును అనుసరించుకొని మహాకృత్యములనును చేసుకొనివచ్చినపిమ్మట ఇద్దరిలో నొకరు చనిపోయిరి. మరియొకరు ఈ సమాచారమునువిని చనిపోయినవారి ఆత్మమునిమిత్తము అనేక జపములను సల్పి, తపములనుచేసి, విస్తార కన్నీళ్ళను రాల్చినదేగాక, దివ్యపూజలను చేయ తాము చేసుకొనిన ఒప్పందమును మరచి పోయిరి. ఒకనాడు వీరు ధ్యానములో నుండునపుడు, చచ్చినవారియొక్క ఆత్మము వీరికి కనుపడి: "నన్ను మరచి పోతిరా? మీ మాట పట్టు ప్రకారము నానిమిత్తము చేయవలసిన పూజలు చేయక నుం

మునదియేమి ? ” యనినది. అందుకువారు ప్రత్యుత్తరముగా: పూజలుచేయ లేదనుట నిజమే. అయితే మీ నిమిత్తము నా చేతనైనంతవరకు జపమును తపమును చేయుచున్నానే యనిరి. కనుపడిన ఆత్మము అందుకు ప్రతియుత్తరముగా: “ నాప్రియ ముగల సహోదరుడా, అలాగుచెప్పకండి, జపమును తపమును నేను అనుభవించు అవధికిచాలదే, నన్ను దహించు నిప్పులను చల్లార్చ జేసుక్రీస్తునాథుని దివ్యరక్తము మాత్రము కావలసి నది, నేను అనుభవించు అఘోరమైన వేదనలలోనుండి దివ్య పూజమాత్రమే నన్ను రక్షించ శక్తిగలదిగానున్నది. అందు చేత మంచే మన మిరువరులమును ఒప్పందపడినలాగు, నా నిమిత్తము మీరు దివ్యపూజలుచేసి ఒప్పగించుదురుగాక ” యనినది. చేయుదునని వీరు చెప్పగానే కనుపడిన ఆత్మము మరుగై పోయినది.

మరునాటి పొద్దున ఈ సన్యాసివారును, మఠములో గల తక్కిన గురువులును ఆయాత్మనిమిత్తము దివ్యపూజలు చేసిరి. అలాగు కొన్నిరోజులు దివ్యపూజలు చేసినపిమ్మట, ముందుచెప్పబడిన ఆత్మము మహామహిమతోనును, సంతో షముతోనును, మరల ఈ సన్యాసివారికి కనిపించి: “ నాప్ర మాణిక్యముగల స్నేహితుడా, నా నిమిత్తముచేయబడిన దివ్య పూజల శక్తివలన నేటితో నాయుత్తరింపు తీరి పోయినది. ఇపుడు పరమకర్తయైన సర్వేశ్వరుని మోక్షములో ప్రత్యక్ష ముగా దర్శింప పోవుచున్నాను. దానిలో మిమ్ము మరువక మీ నిమిత్తము వేడుకొనుచును” అని చెప్పి మరుగై పోయినది.

1793 సంవత్సరములో ప్రాంసుదేశమునందు ఒక బల మైన కలాపము జరిగినది. ఆస్తిగల ఒకమనుష్యుడు పారీస్

నగరమునకువచ్చి అచట ఎటువంటి అక్రమములనుచేసి,
తక్కిన కలహాకారులతో చేరుకొని, ఏతప్పితమును లేని విస్తార
జనులను నరికి చంప ఉత్తరువుచేసెను. ఒకరాత్రి ఒకఏటివం
తెనమీదుగా వాడుపోవునపుడు కలహాకారు లిద్దరు వానికి
ఎదురుగావచ్చి, మహాశోకమునుచూపి ఇపుడునిన్ను పొడిచి
చంపేమా? లేక ఏటిలో పడత్రోసేమా? ఈ రెంటిలో ఏది
నీకు మేలుగా నుండునో తెలుసుకొమ్మనిరి. అపుడు ఎవరు
ను లేని నడు ఝాము రాత్రిగానున్నందుచేత, తప్పించుకొను
టకు సమయము లేనిదిచూచి, మంచిది ఏటిలోనే పడవేయండి
యనెను. అనగానే వానిని వెల్లువగాపారుచున్న ఏటిలో
త్రోసివేసిరి. వాడు అలలలో మునిగి చావబోవు సమయ
ములో, సర్వేశ్వరుని మితిలేని కృపవలన మనసుతిరిగి, తనహృ
దయములో ప్రార్థించుకొనినదేమనిన: ఓ సర్వేశ్వరా! నా
దుర్నడతలకు తగినట్టు నరకమే నాకుగతిగాని వేరుకాదు;
అయితే నామీద దయగానుండండి, కర్తా నామీద దయగా
నుండండి" యనిన తోడనేవాడు అలలలో చుట్టుకొనిచచ్చెను.
గట్టుగానని కరుణా సముద్రమైన కృపసిండిన సర్వేశ్వరుడు,
ఆద్రోహి తప్పితములను మన్నించి, వాని ఆత్మను ఉత్తరించు
స్థలమునకు పోను తీర్పువిధించిరి.

ఆ మనుష్యునికి భక్తి విశ్వాసముగల ఒక కుమార్తె
మాత్ర ముండినది. తనతండ్రి నిశ్చయముగా నరకమునకు
పోయి యుండునని ఆమెతలంచి, కిస్తి మిక్కుటమువలన పారీ
సు పట్టణమునువిడిచి వేరేదేశమునకుపోయి అక్కడ ఎడతెగక
ఏడ్చుచుండినది. అనేక సంవత్సరములకు పిమ్మట దేవ ఉత్తరు
వుదొప్పుననే ఆ మనుష్యునియొక్క ఆత్మము తన కుమార్తెకు

దర్శనమై, తనకు మరణసమయములో సంభవించినదంతా ఎరిగించి, నేను ఉత్తరించు స్థలములో సహించరాని వేదనలను అనుభవించు చున్నాను, కాబట్టి నా నిమిత్తము అనేక మనేక పూజలను చేయించ వలయునని చెప్పి మరుగై పోయినది. ఆ భక్తిగల కుమార్తె ఏదొక తామసము లేక, గురుస్వాముల వారి యొద్దకువచ్చి, మీరును చుట్టుప్రక్కలగల గురువులందరును, నా తలంపుకొరకు నేను చాలునని చెప్పేవరకు, ప్రతి దినమును దివ్యపూజ చేయవలయునని అడిగినది. ఆమె అడిగిన లాగు, ఒక నెల కధికముగా, అనేక గురువులు దివ్యపూజలు చేసిన పిమ్మట మాత్రము ఆ మనుష్యుని ఆత్మము తన కుమార్తెకు తిరుగా కనుపడి: “నా కుమార్తే! నా ఉత్తరింపు కాలము ముగిసిపోయినది, ఇదిగో మోక్షమునకు పోవుచున్నాను” అని చెప్పి అదృశ్యమై పోయినది. అపుడు ఆభక్తిగల కుమార్తె సంతోషపడి గురువుయొద్ద తనకు సంబాధించిన సంగతివంతా విశధ పరచినది.

క్రీస్తువులారా! ఈ రెండు సుకృతాద్భుతములచేత, దివ్యపూజ యగునది ఉత్తరించు ఆత్మలకు ఎంత ఆదరువలగా నున్నదని కనిపట్ట వలసినదిగాక, మనుష్యుడు ఎంత నిర్భాగ్యమైనచావు చచ్చినట్టుగా కనుపడి నప్పటికిని వాని రక్షణము మీద అపనమ్మకము పడకూడదు. అందువలన మీవల్ల కూడినంతవరకు ఉత్తరించు ఆత్మలకొరకు అడుగడుగుకు దివ్యపూజ ఒప్పగించ చేయవలయునని ఎరుగ గలవారలు.

5 ఓ్య- 5 ప్రియ- 5 త్రిత్వ- లను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము......

* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని... (13 పుటచూడుము

# 28 వ-త్రేది.

ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముగా చేయతగు ఉచిత
మైన ప్రొక్కుబడి కానుకలను కనుపరచే వర్తమానము.

## ధ్యానము

ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయతగి
నట్టు ముందుచెప్పిన మార్గములన్ని మంచిమార్గములని చెప్ప
వలయునేగాని వేరుకాదు. అయితే ఆ మార్గములన్ని, ఇపుడు
చూపించబోవు ప్రొక్కుబడి కానుకలలో అణగియుండుట
చేత, ఆ మొక్కుబడి కానుకలు ఉచితమును, ఉన్నతమును
గౌరవమును గలవియని చెప్పగల వారలము.

ఆ మొక్కుబడికానుకలు ఏవియనియు, ఏలాగుచేయ
వచ్చుననియు, అందుచేత లభించు జ్ఞానమేలులు ఎన్నియనియు,
ఇపుడుచూపించ ప్రయత్నించుదుము. ముందు వివరించినలాగే
ఆయా పుణ్యమునకును, ఆయా సత్కృత్యమునకును పుణ్య
ఫలము, వేడుదలఫలము, పరిహారఫలమునైన ఈ మూడుఫల
ములుగలవు. మరియుదివ్యపూజయైనది దేవారాధనకును, మే
లెరిగిన స్తోత్రమునకును, కావలసిన వరములను పొందుటకు
ప్రయోగించునదిగాక, పాప పరిహారమునకును ప్రయోగించు
ననుట నిశ్చయము. ఆయా పుణ్యములవల్లను, దివ్యపూజల
వల్లను, సహా మనకు స్వాంతముగా వచ్చెడు ఆ పరిహార ఫల
మును పూర్ణముగా ఉత్తరించు ఆత్మలకు మొక్కుబడి కాను
కగా ఒప్పగించునదే ముందుచెప్పిన ఉచితకానుక యగును.
మరియు మనము చని పోయిన పిమ్మట, ఉత్తరించు స్థలములో

ఉత్తరించునప్పుడు మన ఆత్మకొరకు ఏమిజపము, దానధర్మము
చేయుదురో, ఎన్ని పూజలు చేయించుదురో, వాటివల్ల మన
ఆత్మకు రాబోవు పరిహారఫలమును యావత్తు ముందుగానే
ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించడమగును. ఆ మొక్కుబడికా
నుక అధికమధికముగా ఫలించులాగునను, మనము ఒప్పగించు
ఆ పరిహార ఫలమంతయు ఆత్మలకు అధికముగా ప్రయోగిం
చులాగునను ఉత్తరించుస్థమునకు రాజ్ఞియైన దేవమాత కరము
లలో యావత్తును ఒప్పగించి వేయవలసినది. అలాగే ఉత్త
రించు ఆత్మల నిమిత్తము మన పుణ్యామువల్లను, సత్కృత్యము
లవల్లను మనకు వచ్చు పరిహార ఫలమునను, ఇకమీదట మన
కొరకు చేయబడు సత్కృత్యములవల్లను దివ్యపూజలవల్లను మన
కు రాబోవు పరిహార ఫలమునను జేర్చి, దేవమాత కరములలో
కానుకగా ఒప్పగించునదే, ఈయుచిత మొక్కుబడి కానుక
యగును. ఈ మొక్కుబడి కానుకను నోటిచేతనైనను, మన
సుచేతనైనను చేయతగును. దానిని అడుగడుగుకు నూతనపర
చునది మంచిదయినను, అవసరములేదు. అందుచేత అల్పపాప
మునకైనను చావైనపాపమునకైనను హేతువైన ఒక అప్పును
లేదు. దానిని చేసినపిమ్మట మనసు లేకుండినను విడిచి పెట్ట
వచ్చును. అలాగు విడిచి పెట్టినందుచేత దాని నుండి రాతగిన
జ్ఞానప్రయోజనమును పోగొట్టుకొనడముతప్ప, ఏదొక పాప
మును ఉండదు.

ఈ యుచిత మొక్కుబడి కానుకను అర్చ్య-పాపు
గారు అంగీకరించినదిగాక, దానిని భక్తిగల అందరును చేయు
నటుల ప్రేరేపించుచు, చేయువారలకు తిరుసభయొక్క బొక్క
సములను తెరచి హెరాళమైన జ్ఞానమేలులఫలములను దయచే

యుచు వచ్చుచున్నారు. కాబట్టి తిరుసభయంతట లెక్కలేని గురువులును, సన్యాసులును, కన్యాస్త్రీలును, స్త్రీపురుషులైన క్రీస్తువులును ఈ సుకృత ప్రమొక్కుబడి కానుకను చేసి యున్నారు. ఈసింధుదేశములో సహితము అనేకమంది అటువంటి మొక్కుబడి చేసుకొనుచున్నారని ఎరిగి యున్నాము. క్రీస్తువులారా! మీరును అలాగు చేయుదురేని, సర్వేశ్వరునికి స్తోత్రమును, దేవమాతకు ఎంత సంతోషమును, ఆత్మలకు ఎంత ఆరుదలయును, మీకెంత ప్రయోజనమును వచ్చుననుట, మాటలయందును తలంపునందును అణగినవిషయముకాదు. అందుచేత మీకు ఏదొక కొరతకలుగుననియు, మీరు ఉత్తరించు స్థలములో నుండునపుడు, మీ పరిహార ఫలమంతయు ముందుగానే ఒప్పగించి యుండుటను గూర్చి, సహాయములేక అధిక కష్టపడవలసి యుంగుననియు తలంచవద్దు. ఈయుచిత మొక్కుబడి కానుకను మేలైన దేవస్నేహమువల్లను, ఉత్తమపరస్నేహమువల్లను చేయుచున్నారనుటచేత సర్వేశ్వరుని సన్నిధిలో మీకు అధిక పుణ్యఫలమును, అధిక పరిహార ఫలమును కలుగు ననుటకు సందేహము లేదు. అందుచేత మీరు ఉత్తరించవలసిన వేదనలు శీఘ్రముగా ముగిసిపోవునదిగాక, మోక్షపేరింపములో మీకు అధిక మహిమయును, అధిక సంభావనయును దొరకును. అర్చ్య-అమృతనాథులు "ఉత్తరించు ఆత్మలకు మనము ఇచ్చునదంతయు మనకీలోకములో దేవ వరముల ను రప్పించుననియు, మనముచచ్చిన పిమ్మట అది ఒకటికి నూరుగామనకు ఇవ్వబడుననియు" చెప్పియున్నారు.

ఈ యుచిత ప్రమొక్కుబడి కానుకనుచేయు
వగ యుసంగాను.

ఏకత్రీత్వమైన సర్వేశ్వరా! మీకు అధికస్తోత్రము చెల్లించనున్ను, మారక్షకులైన జేసుక్రీస్తునాథునికని భావించనున్ను, దేవమాతకు ప్రియపడనున్ను, నేనుమనసొప్పి ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముగా, ఇపుడు నాకు స్వాంతమైన పరిహారఫలముల నన్నిటిని, ఇకనాకు రాతగు పరిహారఫలములనన్నిటిని, నా మరణమునకు పిమ్మట నానిమిత్తము చేయబడు ధర్మపుణ్యములవల్లను, దివ్యపూజలవల్లను కలుగు పరిహారఫలము నంతటిని, దేవమాతహస్తములగుండా దేవరవారికి పూర్ణముగా ఒప్పగించుచున్నాను. ఏలినవారైన సర్వేశ్వరా! ఈ నా మ్రొక్కుబడికానుకను నా యాత్మకుప్రయోజనముగా, కృపతో చేకొనవలయునని ప్రార్థించుచున్నాను.

ఆమెన్ జేసు.

వివరము:—1 ది మేముచెప్పినలాగు ఈమ్రొక్కుబడికానుకకు ఏదొక అప్పులేదు. దానిని చెల్లించినట్లయితే పుణ్యమును ఫలమును సంభావనయునైయుండును. దానిని చేసినపిమ్మట నిలిపివేసినను ఆపుణ్యఫలము లేక పోవునేగాని పాపమైయుండదు.

2 ది:—అటువంటి సుకృత మ్రొక్కుబడి కానుకను చేసియుండినను, చేయ అప్పుపడియుండు ఋణముఖాంతరముగానైనను, న్యాయముననైనను, ఏదొక జనములకును ధర్మములకును విఘ్నముండ నేరదు. అనగా: మనవారల ఆత్మలకును, స్నేహితులు, ఉపకారులు, సభవారలు మొదలగు వారల ఆత్మలకును, మనము విశేషముగా వేడుకొనవలయునని మనకు అప్పుకలిగియుండుటచేత, మేము ముందుచెప్పినలాగు మ్రొక్కుబడిచేసిన మన పరిహారఫలము వారలకొరకే ముందుప్ర

యోగించుననుట నిశ్చయము.

ఇటువంటి యుచిత కానుక మ్రొక్కుబడిని చేయువార లకు అర్చ్య-పాపుగారు దయచేసిన విశేష ఫలము లేవనిన:—

మొదటిది:—ఈ కానుక మ్రొక్కుబడిని చేయుగురు వులు వారలు ప్రతిరోజు చేయు దివ్యపూజలో పరిపూర్ణ ఫల మును పొందుదురు.

రెండవది:—తక్కిన విశ్వాసులు దివ్య సత్ప్రసాదము తీయునపుడంతా పరిపూర్ణ ఫలమును పొందుటయేగాక, ప్రతి సోమవారమునందును, చావైన పాపము లేని ఆత్మను, ఆత్మల నుగురించి దివ్యపూజచూచునపుడంతా, పరిపూర్ణ ఫలమును పొందుదురు. ఈ ఫలములనుపొంద ఏదొక గుడిని సంధించి, అర్చ్య-పాపుగారి సుకృతతలంపులు నెరవేరునట్లు వేడుకోవలసి నదిగాక, ఆఫలములను ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించవలసినది.

మూడవది:—తాము పొందకూడిన తక్కిన ఫలముల న్నిటినిని ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించవచ్చును.

నాలుగవది:—వ్యాధిచేతనయినను, గుడిలేని స్థలము లలో చేయవలసిన పని నిమిత్తమైనను, వేరే విఘ్నముచేత నయినను, సోమవారము పూజకు రాకూడని వారలు ఆదివార ము పూజకని పై చెప్పిన ఫలములను పొందవచ్చునని ఎరుగ గల వారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య-మరియమ్మగారి మధురమైన హృదయమా! నా కాదరువుగా నుండండి. (300 దినముల ఫలము.)

## జపము.

మా శరణమును, ఆరోగ్యమునై యుండెడు జేసునా

ధుడా! దేవరవారు మానిమిత్తము శృంగార తోపులో, నేలమీద పారులాగు సర్వాంగములందును రక్తచెమట చెమర్చి, మహాకష్టి చంచెలమును అనుభవించితిరే. ఈ మీ వెల లేని తిరురక్తమునుచూచి మృతిపొందిన సకల క్రీస్తువుల ఆత్మలకు కృపచేయవలయునని దేవరవారిని ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ముందు చెప్పిన మొక్కుబడి కానుకను, మనసుండినట్టయితే చేయుట; లేనట్టయితే ఆత్మలను గురించి 10 జ్యో. 10 ప్రి. లను వేసుకొనుట.

## అద్భుతము.

కర్తూసియాన్ సభలో చేరియున్న, దియోనిసియుసను వారు వ్రాసిన సుకృత చరిత్రమైనది: ఆ కాలములో పుణ్యము నిండిన జెర్త్రుర్తమ్మయనబడిన ఒక కన్యాస్త్రీ ప్రసిద్ధికెక్కియుండినది. ఆమె ఉత్తరించు ఆత్మలమీద మిగుల భక్తిగలదిగా నుండినందుచేత, ఆయాత్మలకు సహాయముగా తాను చేయు జపతప దాన ధర్మములనన్నిటిని, జేసుక్రీస్తునాధుని హాస్తములలో, వారలకొరకు ఒప్పగించును. అందుచేత జేసుక్రీస్తునాధస్వామి, ఫలాని ఫలాని ఆత్మలనిమిత్తము విశేషముగా ప్రయాసపడవలయునని, ఆమెకు అద్భుతముగా ఎరిగించుకొని వచ్చుచుండును. అప్పుడా భక్తిగల కన్యక, అధిక జపమును అధిక తపమునుచేయును.

ఆత్మలోయనిన, ఆమెకు అనేక సారులు కనిపించి, ఆమె తమ నిమిత్తము పడినప్రయాసలకు మేలెరిగిన మనసుతో స్తో

త్రము చేయుచుండెను. ఆలాగునామె ప్రతిదినమును చేసుకొనుచువచ్చినది. కడసారి వయసుచెల్లి వ్యాధిగాపడి అవస్థయైనది. ఆసమయములో దుర్మనపిశాచి ఆమెకు కనుపడి ఆమెనుచూచినవ్వి "ఇపుడునీకు ఉత్తరించుస్థలములో సరియైన వేదన రాబోవుచున్నది; నీవుచేసిన ధర్మపుణ్యమంతయు ఇతర ఆత్మలకు ఒప్పజెప్పి నీకులేకుండా చేసుకొనినందుచేత, నీవు ఊరికనే చావబోవుచున్నావు. నీవుచేసిన తప్పితము లన్నిటికిని ఏదొకసహాయములేక ఉపాధింపబడెదవు" అనినది. ఈ పుణ్యవతి ఆ శోధనవల్ల కలతజెంది "అయ్యయ్యో! నాకేమి తటస్థించునో? ఇతరులకు నా సత్కృత్య ఫలములన్నిటిని ఒప్పగించిన పిమ్మట నాకేమిని లేకపోయెనే. అయ్యయ్యో, నాకు రాబోయెడు ఉత్తరింపులో ఏదొక ఆదుదల లేక పోయినట్టయితే ఏలాగు దానిని సహించ నోపుదును? నా ఏలినవారా! ఆలాగు నాకు తటస్థించునో" యని అంగలార్చి చెప్పినది. ఆక్షణమందే జేసునాధస్వామి కృపగలముఖముతో ఆమెకుదర్శనమై, దుష్టపిశాచిని దూరముగా పారదోలి, ఆమెకలకమును తీర్చి ఆమెకుచెప్పినది: "జెర్త్రుర్తనుదానా! నీవు కలంగి కష్టపడుటకు కారణమేమి?" యనిరి. అందుకామె 'ఏలినవారా, మీకు తెలియని దేమున్నది? నేనుచేసిన ధర్మ పుణ్యమంతటిని ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించివేసితినే. ఇపుడు నాచేతిలో ఏమిని లేక చావబోవు చున్నానుగదా" యనినది. అందుకు ఏలినవారైనస్వామి నవ్వుముఖముతో: 'నాకుమార్తెయైన జర్త్రుర్తనుదానా, ఏలక స్తిపడుచున్నావు? నీవు ఆత్మలమీద నుంచిన భక్తియైనది నాకు మిగుల ప్రియముగా నున్నందుచేత, నీతప్పితములకు రాతగిన వేదనలనంతయు ఈక్షణమే మన్నించి

తొలగించుచున్నాము. మమ్మునుగురించి ధర్మము చేయువార లకు ఒకటికినూరుగా నిత్యమని మేము వాగ్దత్తము చేసియు న్నామనుటచేత, ఆమాత్రమునకు మోక్షములో నీ సంభావన అధికరించును. నీ చేత ఉత్తరించు స్థలమునుండి రక్షింపబడిన ఆత్మలన్నియు, నిన్ను పరమరాజ్యమునకు మహా అడంబర వైభవముతో వెంటబెట్టుకొని రాను ఎదురుగావచ్చుదురు " అని చెప్పి మరుగైపోయిరి. జెర్త్రుద్దమ్మ యోయనిన, తాము కనిన దిని వినినదిని దగ్గిరనుండిన ఇతర కన్యాస్త్రీలకు తెలియపరచి, ఆనందసంతోష ప్రవాహములో మునిగి, భాగ్యవతిగా మరణ మొందినది.

క్రీస్తువులారా! ఉత్తరించు ఆత్మలకు ఉపకారముగా దేనినిచేసియుండెదరో దానికి నూరంతలు అధికముగా స్వామి మీకు దయచేయుదురని ఎరిగి, భయము సందేహము లేక, మీ పుణ్యధర్మము లన్నిటినిని ఆ యాత్మలకు ఒప్పగించ గల వారలు.

5-జో-5-ప్రి-5-త్రీ-లను చెప్పుట.
స్వామీ పాతాళమునుండి మిమ్ము.........
* నిత్యపితా జేసుక్రీస్తునాధుని వెలలేని (13 పుటచూడు)

## 23-వ తేది.

### ఉత్తరించు ఆత్మలమీద నుంచవలసిన విశేష భక్తిని వ్యాపింప చేయువలయునని చూపించేడు వర్తమానము.

# అప్పెండిక్సు.

ఇంతవరకు చేసిన ధ్యానములవల్లను, వినిన అద్భుతములవల్లను, ఉత్తరించు ఆత్మలమీద మీకు అధిక భక్తిన్ని కనికరమును కలిగియుండుటయేగాక, ఆయాత్మలకు మీవల్ల కూడినమట్టుకు ఉపకార సహాయముచేయ దృఢమైన ప్రతిజ్ఞ చేసియుంకురని నమ్ముచున్నాము. అయితే మీరు మాత్రమే, ఆయాత్మలమీద భక్తిగానుండి వారలకొరకు ప్రయాస పడు నదిచాలునని యెంచక, ఇతరులయొద్దను ఈసుకృతభక్తి వెలిగి ప్రకాశించునట్టు తగిన మార్గోపాయములను వెతుకవలసినది. ఆలాగు మీచేత ప్రేరేపించబడిన ఇతరులు చేయు మేలులన్ని మీ స్వంతమైనవిగా నున్నవనుటచేత, అందుకు తగిన సంభావన పొందుదురనుట తప్పను.

భక్తి నిప్పుకు సమానమనుదురు. నిప్పు ఒక క్షణములో నిలువక తానుగా మండుటయేగాక, తనకు ఎదురువడిన వస్తువునును తన స్వభావముగా మార్చి, ఎండిన దానిని దహించి, తేమగా నున్న దానిని ఎండించి రగిలించును గదా? ఉత్తరించు ఆత్మల మీద నుంచిన భక్తియును ఆ లాగుననే ఉండవలసినది. ఈ భక్తి గలవాడు ఒక క్షణమైనను ఊరకుండక, సకల మనుష్యుల యొద్దను ఆ భక్తి రగులుకొనవలయునని ఆసించి, అందు నిమిత్తము ఎడతెగక సర్వేశ్వరుని మనవిచేయును, అందుకు తగినమార్గములను ఆశతో వెతకును, తగిన సమయములలో కావలసిన బుద్ధిమతులను చెప్పును, ఆభక్తిచేతరానగు పవిధప్రయోజనములనును బయలుపరచును, ఆభక్తిని వివరించిచూపు పుస్తకములను చదువ

చేయును. వ్యర్థముగా పొగ లేయు నిప్పు దేనికుపయోగించును? అది నిజమైన మంచినిప్పగునా ? నిప్పు, మంచి కణుగులను వేసి నట్లయితే నానావిధపనులకు పనికివచ్చునదిగాక, ఇనుము మొదలగు లోహములను కరుగ చేయును. ఆవిధముగానే, పరుల యొద్ద వ్యాపించక తనయొద్దనే నిలిచియుండు భక్తిని గురించి అర్చ్యశ్రీ గ్రెగోరివారు వచనించినలాగు, వ్యర్థభక్తియనియు, పనికిమాలిన భక్తియనియు చెప్పవలసినది. కాబట్టి ఉత్తరించు ఆత్మలమీద నిజమైన భక్తిగలవాడు దానిని వ్యాపించచేయ ఎప్పుడును ప్రయాసపడును.

అర్చ్యశ్రీ-అగుస్తీన్, అర్చ్యశ్రీ- క్రిసొస్తోముస్, అర్చ్యశ్రీ- అమృతనాధులు, అర్చ్యశ్రీ - గ్రెగోరివారు, అర్చ్యశ్రీ - బెర్నర్దుస్, అర్చ్యశ్రీ - ఫ్రాంసీసుసలేసుగారు, అర్చ్యశ్రీ - లిగోరివారు, అర్చ్యశ్రీ- లెయోనార్దుస్ మొదలగుగొప్ప అర్చ్యశిష్టవారలు, ఈ సుకృతభక్తిని పరులయొద్ద రగిలించ తామువ్రాసిన పుస్తకములవల్ల బహుప్రయాసపడి నారనుట నిశ్చయము. అర్చ్యశ్రీలుయిగాత్కర్తమ్మ, అర్చ్యశ్రీ- జెర్త్రుత్తమ్మ, అర్చ్యశ్రీ- తెరేసమ్మ, అర్చ్యశ్రీ- పాజి మరియ మగ్దలేనమ్మ, అర్చ్యశ్రీ-జెసువాకత్తెరీనమ్మ ముక్తిభాగ్యముపొందిన మరియ మగ్దలేనమ్మ మొదలగు పేరు పోయిన కన్యాస్త్రీలు ఆడవారలుగానుండినను, ముందు చెప్పిన భక్తిని ఘనపరచి, ఎచ్చటను వ్యాపించచేయ ప్రయాసపడిరి. మరియు సత్యతిరుసభకు తలగానున్న అర్చ్యశ్రీ - పాపుగార్లు ఆ యుత్తమవిధిని అధికమధికముగా వాడుకకు తెచ్చునట్టు తమ నిరూపములవల్ల సకలక్రీస్తుప్రులను ప్రేరేపించునదిగాక, అందుకనేకజ్ఞానమేలులనును ఫలములనునుదయచేసిరి. అదియునుగాక దైవిక శాస్త్రులైన జెరోన్సని యనునువారును, స్వారేసియనుస

నువారును ఇంకామరికొందరు శాస్త్రిలును, భక్తిగల గురువు లును, తామువ్రాసిన పుస్తకములవల్లనైనను, చేసిన ప్రసంగ ములవల్లనైనను, ఉత్తరించు ఆత్మలమీదనుంచిన భక్తియైనది ఫలముగలదనిన్ని, ప్రయోజనముగలదనిన్ని నానావిధ మేలుల నిచ్చు యుచితవిధియనిన్ని ఒప్పించినదిగాక, దానిని అందరును ఆశతో అనుసరించవలయునని చెప్పుకొనుచువచ్చిరి. ఆదినము లలో సహితము ఈసుకృతభక్తినిగురించి వ్రాయబడిన పుస్తక ములు ఎన్నియనియు, అందానిమిత్తము స్థాపించినవిశేషసభలు ఎన్నియనియు, దానిని వ్యాపించచేయ ప్రయాసపడు వారలు ఎంతమందియనియు చెప్పసాధ్యముకాదు.

క్రీస్తువులారా! ఉత్తరించు ఆత్మలమీద నుంచవలసిన ఈ విశేష భక్తియనునది వ్యాపించునట్టు ఏదయినను చేసితిరో లేదోయని చూడండి. ఇపుడుదేనిని చేసుకొనివచ్చుచున్నారు? ఇకమీదట దేనినిచేయవలయునని చక్కగా యోచించి తీర్మా నముచేయవలసినది? ఈసుకృతభక్తి అధికాధికముగా మనదేశ ములో వ్యాపించునట్టు మీజపమువల్లను, మీనడతవల్లను, మీప్రయాసవల్లను పాటుపడుదురేని, ఈ లోకమునందును, మరులోకమునందును, మీకధిక ప్రయోజనమును, సంభావన యును దొరకుననుటకు సందేహములేదు.

ఇపుడు చెప్పబోవు అయిదు కార్యములనును విశేష ముగా అనుసరించవలసినది,

1 ది :—ఉత్తరించుఆత్మలకు ఉపకారసహాయముచే యునట్టు తిరుసభలోవాడుకయగు మోక్షదీపము, ఆత్మలనిమి త్తము భిక్షాధర్మము, చనిపోయినవారల కొరకు పూజలుచే యించుట, గుడిలోవేదుదల ఈమొదలగు సుకృతవిధులను మం

చిదని విశ్వసించి, అంగీకరించునదిగాక, వాటిని విరోధించువా రలను నిషేధించవలసినది.

2 ది :—ఉత్తరించు ఆత్మలపండుగనును, ఉత్తరించు ఆత్మల స్మరణమాసమునును, ఉత్తరించు ఆత్మలకు తిరుసభలో ఒప్పగించబడిన సంవత్సరములోని ఏబదిరెండు సోమవారముల నును అనుసరించుటయేగాక, ప్రతిదినము కూడినమట్టుకు కొన్ని జపములను చేయును, కొంతధర్మముచేయను ప్రియపడ గల వారలు.

3 ది :—ఉత్తరించు ఆత్మలనుగురించి అడుగడుగుకు సంభాషింపవలసినదిగాక, ఈసుకృతభక్తిని పుట్టించుటకు ఏబది రెండు సోమవార ప్రసంగముల పుస్తకమునును, ఉత్తరించు ఆత్మలస్మరణమాసమనెడు ఈపుస్తకమునును, ఇటువంటి వేరే సుకృత పుస్తకములనును చదువచేయవలసినది.

4 ది :—మీ బంధువులును, స్నేహితులును, మీతో పరిచయము గలవారలును తమవారల ఆత్మలనిమిత్తము ఉప కారసహాయము చేయుచున్నారో లేదోయని వారలను విచా రించ వలసినది.

5 ది :—పోయిన ధ్యానములో వివరింపబడిన ఉచిత మ్రొక్కుబడి కానుకను చేయునట్టు భక్తిగలవారలను ప్రేరే పించవలసినది.

క్రీస్తువులారా! మంచిక్రీస్తువుడు ఎవడో వాడు, ఉత్తరిం చు ఆత్మలమీాద భక్తిగానుండుననియు, ఉత్తరించు ఆత్మలమీాద భక్తిగలవాడు ఎవడో, వాడు ఈ సుకృతభక్తి నెచటను వ్యాపించచేయ ప్రయాసపడుననియు ఈ ధ్యానమువల్ల మీారు

ఎఱిగియున్నారనుట నిశ్చయము. కాబట్టి మీరును అలాగే చేయవలయునని ఎరుగగలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య - మరియమ్మగారి మధురమైన హృదయమా! నాకాదరువుగానుండండి. (300 దినములఫలము.)

## జపము.

మాహృదయమునకు ఆనందమైన జేసువా! మోక్షవాసులు చూడ నాసించెడు మీతిరుముఖము, నాస్తులవల్ల మూసి మరుగుచేయబడను, ఉమినీటిచేత అశుద్ధపడను, చేతితో కొట్టబడను చిత్తమైతిరే; ఇటువంటి మనోవాకుకుందని వేదన యనుభవించిన మీ తిరుముఖమునుజూచి, మృతిపొందిన సకల క్రీస్తువులయొక్క ఆత్మలకు కృపచేయవలయునని దేవరి వారిని ప్రార్థించుచున్నాము స్వామీ. ఆమేన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఈదినము, లేక వచ్చేశనివారము మంచి పాపసంకీర్తనము చేయుట.

## అభిప్రాతము.

ఒక నందావనములో మంచిపుష్పములును, కాయలును పండ్లును ఫలించులాగు సత్యతిరుసభలో పవిధ పుణ్యములును, ధర్మములును, కలిగియున్నవనుట సరియే. రాజులు ధరించు బంగారు కిరీటములో వజ్రపురాళ్లును, మత్యరత్నములును జ్వలించులాగు, జేసునాధునికి కిరీటమైన తిరుసభలో పలుసభలు ప్రకాసించుచున్నవి. వ్యాధిగ్రస్థులను మహాపత్తుగవనములో విచారించు పలుసభలు గలవు. తలిదండ్రిలేని అనాద

బిడ్డలను చేర్చి కాపాడి పెంచు పలుసభలునుగలవు. లేవలేని ముసలి వారలనును విసుగులేని మనసుతోను, మారని ప్రియముతోను పరామర్శించు పలుసభలుగలవు. అజ్ఞానులలోనును, తురకలలోనును చెరబడిన క్రీస్తువులను రక్షింప పలుసభలునున్నవి. ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయము చేయ వలయునని అన్ని సభలయందును ఒక సాధారణ ప్రమాణ కట్టడయుండునదేగాక, వేరువిధముగా ఈ సుకృత తలంపుకొరకు ముందుకాలములలో ఏదొక విశేషసభ స్థాపించియుండుట నెరుగము.

అయితే ఎచ్చుతక్కువ కొన్ని సంవత్సరములకుముందు ఫ్రాంసుదేశముయొక్క ప్రధాన పట్టణమైన పారీసు మహానగరములో, విశేష దేవకృపచేత ఉపసభయనబడు ఒక కన్యాస్త్రీలసభ ఏర్పరచబడినది. ఈ సభలో చేరిన భక్తిగల కన్యాస్త్రీలు, తాము జపించు జపములును, చేయుతపక్రియలును, అనుభవించు కష్టములును, అనుసరించు సత్కృత్యములును యావత్తు ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించుచున్నారు. వీరలుతక్కిన కన్యాస్త్రీలవలె, దరిద్రము, విధేయత్వము, విరక్తత్వము ఈ మూడు వాగ్దత్తముల నిచ్చుటయేగాక, నాలుగవ వాగ్దత్తముగా తమ జప తప దానధర్మములవల్ల తమకు ఈ లోకములో రాకూడిన పరిహార ఫలములన్నిటిని, చనిపోయిన పిమ్మట తమనిమిత్తము చేయబడు జపతప దానధర్మములు, దివ్యపూజలవల్ల తమకురాతగిన పరిహార ఫలము లన్నిటిని, ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించ మొక్కుబడిచేయుచున్నారు. మరియు ఈ భక్తిగల కన్యాస్త్రీలు ఉత్తరించు ఆత్మలకొరకు అనేక విశేషజపములను చేయుటయేగాక, కొన్నిమంచి ధర్మక్రియల

నును నడపించుకొని వచ్చుచున్నారు. వారలు ప్రతిరోజు రాత్రిపగలు ఆయాత్మలయెడ తమ ప్రేమ భక్తికి నికరమంతటిని ఉంచియున్నందుచేత, తీరిక లేక, విశ్రమము లేక, వీరలకు ఉపకార సహాయముచేయునట్లు కావలసిన మార్గోపాయములన్నిటిని వెదకుకొని వచ్చుచున్నారు. ఇదియునుగాక స్త్రీపురుషులైన భక్తిగల ఇతర క్రీస్తువులను తమలోచేర్చుకొని, ఒకొకరి అంతస్తుకు తగినలాగు ఉత్తరించు ఆత్మలకు సహాయముచేయునటుల చేయుదురు. ఈ సుకృతసభను అనేక మేత్రాణులు అంగీకరించినదియేగాక, అపుడు తిరుసభను మహిమతో పరిపాలించుచువచ్చిన 9 వ- భక్తనాథులనెడు అర్చ్యపాపుగారు ఈ సభకు ఒకవిశేష ఆశీర్వాదమును దయచేయచిత్తమైరి.

క్రీస్తువులారా! దీనివంతయువినిన మీరును ఉత్తరించు ఆత్మలమీద విశేషభక్తినుంచ వలయునని ఎరుగ గలవారలు.

5 జో్య. 5 ప్రి. 5 త్రి. లను చెప్పుట.

స్వామీ పాతాళమునుండి మిమ్ము............

* సత్యపితా జేసుక్రీస్తునాథుని వెలలేని... (13 పుటచూడు)

---

## 30 వ- త్రేది.

ఉత్తరించు స్థలమునుగురించి ధ్యానించునది ఎంత మంచిదని చూపించెడు వర్తమానము.

---

# ధ్యానము.

ఈ కడపటి ధ్యానములో మన తలంపునుమూలముగా ఉత్తరించుస్థలములో దిగి, మనవిశ్వాసమైన జ్ఞానకంటిలో దానిలో అఘోరముగా మండునిప్పునుచూచి, ఆనిప్పులో బహుగా బాధపడుచున్న ఆత్మలను దర్శించి, అందుచేతమనకేదాక సుకృతప్రయోజనమును వెతుకవలసినది. ఈ ధ్యానమువల్ల అనేకగొప్పపాపాత్ములు మనసు తిరిగినదిగాక, దేవయూడిగమున కు అసడ్డగానుండినవారలు అనేకులు జ్ఞానచురుకుపొంది ఉత్తమ క్రీస్తుప్రులైనారనుట నిశ్చయము. క్రీస్తువులారా! మీకును మునుపటిధ్యానములలో చెప్పినదానిని సంగ్రహముగా ధ్యానించుటకుగానును, మీ భక్తినెప్పుడును ప్రేరేపించుటకుగానును కొన్ని బుద్ధిమతులను ఈ క్రిందచెప్పులాగు తెలుసుకొనవలసినది.

1 ది:—సర్వేశ్వరునిచేత కలిగించబడి, మనపలినవారైనజేసునాథుని దివ్యరక్తముచేత రక్షింపబడిన ఆ యాత్మలు, అంత కఠినవేదనలచేత ఉపాధింపబడుటకు కారణమేమి? వారలు భూలోకములో బ్రతికియుండగా కట్టుకొనిన స్వల్పపాపములకును, మన్నింపుపొందిన చావైన పాపములకును చేయవలసిన పరిహారమే ఈ వేదనలకు కారణముగాని వేరుకాదు. ఇదియిట్లుండగా ఇటువంటివేదనలను రప్పించు పాపములను స్వల్పమనియెంచి వాటిని భయములేక చేయతగునో?

2 ది:—ఎటివంటి పాపమునకును దేవనీతిప్రకారమే పరిహారముచేయ వలయుననుట సత్యవిశ్వాసముగగా? ఈ లోకములోనే ఆపరిహారమును జప తప దానధర్మములవల్లను,

తిరుసభ ఫలములవల్లను, సంభవించెడు పలువిధ కష్టనష్ట దుఃఖ దురితములను ఓర్పుతో అనుభవించుటవల్లను బహుసులభము గా చేయవచ్చును. ఆలాగు చేయనట్టయితే. ఉత్తరించుస్థల ములో మనోవాకుకందని వేదనలు అనుభవించి ఆ పరిహా రము తీర్చవలసియుండుననుట తప్పదు. ఇది తప్పని సత్యమని తెలుసుకొని, మీరు అధికాధికముగా విశేషభక్తిచురుకుతో మీచేతనయిన సత్క్రియలన్నిటిని చేయుటయేగాక, వచ్చెడు పటువంటి కీడులయందును మారని ఓర్పును అనుస రించ వలయునుగదా ?

3 ది :—ఏ మనుష్యునికైనను ప్రియపడవలసినట్టయి తేవాని బిడ్డలను చక్కగా విచారించ వలయుననుదురే. ఆ విధముగానే అంతకఠిన ఆజ్ఞలను అనుభవించుచున్న ఆ యా త్మలు, సర్వేశ్వరునికిని, జేసుక్రీస్తునాధునికిని మిగుల యోగ్య మైన ఆత్మలయినందున, వారలను కాచిరక్షించి ప్రయాసపడు నది ఉత్తమదేవస్నేహమగును. ఆ యాత్మలను తలంచక మర చి, వారలకు ఉపకారసహాయము చేయని మనుష్యుడు తాను సర్వేశ్వరుని స్నేహించు చున్నాననినట్టయితే తన్ను తాను మోసపరచుకొను చున్నాడేగాని వేరుకాదు. కుమారుని నిప్పులో కాలవిడుచునేని వానితండ్రిని స్నేహించినట్టగునా ? మరియు సర్వేశ్వరుడు నీకుచేసిన యుపకారములను మరచితి వా ? నీవు కట్టుకొనిన పాపములు ఎన్నియని ఎరుగవా ? పొం దిన యుపకారములకు మేలెరిగిన తనము చూపించను, చేసిన ద్రోహములకు ఓర్పుపొందను ఉత్తరించు ఆత్మలమీద భక్తి గానుండుటదే యుత్తమమార్గమగునుగదా ?

4 ది :—అంతటి వేదనలను అనుభవించు ఆత్మలనుగని

వారలు ప్రళాపించు ప్రళాపములనును, విడిచెడు అభయశ బ్దములనును విని పులిమొదలుగా పరితపించునే! మీకుమాత్ర ము పరితాపము లేకపోవునో? ఈ ఆత్మలు అఘోర నిప్పులో కాలునపుడు మీరు నోటికి రుచిగాతిని, ఉల్లాసముగా ధరించి సంతోషమును కొనియాడవచ్చునా? ఈ ఆత్మలు ఇంత కస్తి పడునపుడు మీరు క్షేమముగా నుండవచ్చునా?

5 వ- ఉత్తరించు ఆత్మలమీద భక్తిగలవారలకు నానా విధమేలు ప్రయోజనములు కలుగుననుట నిశ్చయమైనందున మీస్వంతలాభమును గురించియైనను ఆయాత్మలకొరకు కావ లసినప్రయత్నము చేయుడి. మీరులోకములో అనుభవించెడు శోధనలయందు మోసపోకుండాను, వచ్చెడు కస్తి దుఃఖముల యందు కలతజెందకుండాను, తటస్థించెడు కీడులయందు మైకము జెందకుండాను సన్మార్గములో తప్పకనడచి, మంచి మరణము పొంది, మోక్షపేరింప రాజ్యమునకు చేరవలయుననెడు దృఢ మైననమ్మకము మీకు కలుగవలసినట్టయితే ఆ యాత్మలమీద యావశ్చక్తితో భక్తికలిగి యుండండి.

6 వ- ఉత్తరించు ఆత్మలకు ఉపకార సహాయముచేయ అనేకమంచి మార్గములుండుటచేత, కష్టములేక, దుఃఖములేక, వారలవేదనలను తగ్గించ, తప్పించ, ముగియ చేయవచ్చునే. మీరు ప్రతిరోజు వాడుకగా జపించు జపములనును, చేయు సత్కృత్యములనును తగిన తలంపుతో చేయువార లగుదురేని, ఎన్నోఫలములనును జ్ఞానమేలులనును పొందవచ్చును. అట్లుండగా వాటిని మీ అసడ్డతనమువల్ల పోగొట్టుకొని, ఆత్మలకు రాకూడిన ఉపకారసహాయమును అడ్డపరచుచున్నారే. ఇది గొప్ప అన్యాయముగదా?

7 వ- ఈ యాత్మలకు మీవల్లనైన ఉపకారసహాయ మంతయు చేయవలయునని మీకు అధిక అపేక్ష యుండినట్లయితే, ముందు చెప్పినలాగే మీరుపొందకూడిన పరిహారఫలము లన్నిటిని వారలకు ఒప్పగించ మొక్కుబడి చేసుకొనండి. అలాగు చేయువారలకు ఈ లోకమునందును మరులోకమునందును తాము ఇచ్చినదానికి ఒకటికి నూరంతలుగా ఇవ్వబడునను మాటను ఒకనాటికి మరువకండి.

8 వ- కడసారి ఏప్రకారముగా ఆయాత్మలకు ఉపకారసహాయము చేసియుందురో, ఆప్రకారముగానే మీరును, ఈలోకమును విడిచి ఉత్తరించు స్థలములో వేదన యనుభవించునపుడు మీకును చేయబడును. ఉత్తరించు ఆత్మలకు కొంచెము ఉపకార సహాయము మాత్రము రప్పించ ప్రయాసపడుదురేని, మీకునుకొంచెము ఉపకార సహాయముమాత్రమే వచ్చుననుట నిశ్చయమైనందున, ఇకమీదట మీకు కావలసిన దానిని ఇప్పుడే సేకరించుకొనండి.

క్రీస్తునులారా! నిప్పులో కట్టెలు వేయక పోయినట్లయితే నిప్పు ఆరిపోవునే. అవిధముగా ఈ మాసములో ఉత్తరించు ఆత్మలమీద మీయొద్ద రగిలించిన భక్తియగునది తగ్గి ఆరిపోకుండా, సంవత్సరములో వచ్చు ప్రతి సోమవారమునందును, ఇపుడు చెప్పబడిన ధ్యానములలో ఒకొకదానిని చదువుకొనుచు రావలయునని ఎరుగగలవారలు.

అడుగడుగుకు చెప్పవలసిన సుకృతజపము.

అర్చ్య - మరియమ్మగారి మధురమైన హృదయమా! నాకాదరువుగానుడండి. (300 దినములఫలము.)

## జపము.

మా యుత్తమమేలైన జేసువా! దేవరవారు మా పాపములను మీ యిరు భుజముమీద స్లీవతో మోసుకొంటిరే. ఈ మట్టులేని యుపకారములను చూచి, చనిపోయిన మా సహోదరులగు సకలక్రీస్తువుల ఆత్మలకు కృపచేయ నవధరించండి. విశేషముగా ఆధరువులేని నిర్భాగ్య ఆత్మలమీద అధికముగా కనికరముంచి, వారలకు వెంటనే మోక్షవాకిలి తెరువ అనుగ్రహము చేయవలయునని దేవరవారిని ప్రార్థించుకొనుచున్నాము స్వామీ ఆమెన్ జేసు.

చేయవలసిన సత్క్రియ.

ఉత్తరించు ఆత్మలనుగురించి భక్తితో దివ్య సత్ప్రసాదము తీయుట.

## అద్భుతము.

1867- సంవత్సరములో పారీసుపట్టణమునందు ఒక బీద స్త్రీ ఒకయజమానునియొద్ద పనిచేయుచువచ్చినది. ఆమె నెలనెలకు తాను పుచ్చుకొనెడు జీతములోనుండి, ఉత్తరించు ఆత్మలనుగురించి, ఒకపూజకు కావలసిన కొన్ని అణాలను యిచ్చి, పూజచేయించెడు వాడుకగా నుండినది. ఏయాత్మము ఉత్తరింపులీడి మోక్షమునకుపోవు తరుణములో నుండునో, విశేషముగా ఆయాత్మకొరకే ఆపూజను ఒప్పగించవలయునని చెప్పును. ఆమెకు ఒక కఠినవ్యాధి సంభవించిన దానిమీదట, తానుపని చేయుచువచ్చినే యజమానుని కొలువు విడిచిపెట్టవలసి వచ్చినదిగాక, తాను సౌఖ్యమయ్యేటందుకు తన చేతిలోని డబ్బంతయు శెలవుచేయవలసివచ్చినది.

కొంచెము సౌఖ్యమై, తాను లేచి తిరుగ కూడిన దిన
ములో ఆమెయొద్ద అర్ధరూపాయి మాత్ర ముండినదేగాని,
అంతకుమించి వేరే ఆస్తిలేదు. మంచినమ్మకముతో సర్వేశ్వ
రుని ప్రార్థించుకొనిన పిమ్మట, వేరొకచోట పనివెదుక పోయి
నది. ఈమెపోవుచుండు దారిలో ఆర్చ్య- ఎవుస్తా కియుస్ గారి
గుడిని కని, దానిలో కొంచెము జపము చేయవలయునని లో
పల ప్రవేసించినది. ఆసమయమునో ఒక గురువు ఉత్తరించి
ఆత్మలనుగురించి దివ్యపూజ చేయుచుండిరి. దీనిని చూచిన ఆ
పుణ్యవతి: తాను ఆనెలలో ఉత్తరించు ఆత్మలను గురించిపూ
జచేయించని దానిని తలంచి కస్తి పడినది. అయితే తనయొద్ద
అర్ధరూపాయిమాత్ర ముండుటను గూర్చి దానిని పూజకుయి
చ్చివేసినట్టయితే, తాను ఆపూట అన్నానికి ఏమి చేయవలసిన
దని కొంతసేపు అంగలార్చినపిమ్మట, కొంచెము యోచించి:
"పూజచేయించెదను; సర్వేశ్వరుడునన్ను ఆకలిచే విడిపించె
దరా" అని మనసు దృఢపరచుకొని తన యావదాస్తిగానుం
డిన ఆ అర్ధరూపాయను అక్కడయుండిన మరియొకగురువుచేతి
కిచ్చి, వెంటనే ఉత్తరించు ఆత్మలనిమిత్తము పూజచేయవలయు
నని అడిగినది.

ఆలాగే ఆపూజలో తానునుయుండి, మహా భక్తితో
కనినపిమ్మట, గుడినుండి బయలుదేరి, తనకు ఏదైనా జీవనో
పాయము చిక్కునాయని దిగులుతో నడచి పోసాగినది. కొం
చెము దూరము పోయినపిమ్మట, ఒక యోగ్యమైన యువ్వ
నుడు ఆమెకు ఎదురుగావచ్చి, దుఃఖముఖముతోనున్ను, మహా
మేరమర్యాదతోనున్ను, ఆమెకు వందనముజెప్పి, "నీవుప్పుడయినా
పనిని వెదకుచున్నావుగదా" యని వాడు అడుగగా, 'ఆమె, ఔ

నయ్యా, పనికోసరమయ్యే వెదకుచున్నాను' అనినది. అపుడు వాడు "ఫలాని వీధిలో ఫలానియింటియందు ఫలాని దొరసాని యొద్దకుపో. అదొరసాని నిన్ను చేకొని పక్షముతో నడపించు ననియు,నీవు ఆమెయొద్దచక్కగా నిలిచియుండువనియు తలంచు చున్నాను" అని చెప్పినతోడనే, వీధిలో ఇటునటుపోవుచున్న జనములో మరుగైపోయెను,

ఆపుణ్యావతియోయునిన: ఆ యువ్వనుడు చెప్పిన వీధినని, ఇంటినిని విచారించుచు, గురింపబడిన యింటికి పోయిచేరినది, చేరగానే తలుపుతట్టి పిలిచినంతట, ఒకదొరసాని తలుపు తెరచి, ఆమెను లోపలరమ్మని పక్షముతో పిలిచినది. ఆమె లోపల ప్రవేసించినతోడనే "అమ్మా" మీకు పనిచేయ వదొక పని కత్తెను వెదకుచున్నారని నేను ఎరిగి నన్నుతమయొద్దఉంచు కొనుదురేమోనని అడుగవచ్చియున్నాను" అనినది. అందుకు ఆదొరసాని " నాప్రియముగల సహోదరీ,నీవుచెప్పునది మహా ఆశ్చర్యముగానున్నది. ఇదివరకు నాయొద్ద పనిచేయుచుం డిన పనిదానిని ఇప్పుడే వెళ్లగొట్టితిని, ఈ సంగతినాకు మా త్రము తెలియునేగాని మరిఎవరికిని తెలియదు. నిన్ను పంపినది ఎవరుచెప్పు? " మనినది. అందుకు ఆమె" నేను వీధిని వచ్చు చుండునప్పుడు ఒక మంచిప్రాయము గలదొర నన్ను ఈతావు కు పొమ్మని చెప్పినాడు. కాబట్టి నాచేతిలో ఒక కాసుకూడాగ తిలేనందున, ఈ దినమునందే ఎదైననొక పనిలో ప్రవేసింపవ లయునని చెప్పినది " దానిని దొరసానివిని అధికముగా భ్రమించి, ఆ ప్రాయపువాడు ఎవడని ఆలోచించుచుండునపు డు, ఆ బీదస్త్రీ కన్నులనుపైకెత్తి, ఆయరలో గోడకు తగిలించియున్న ఒకపతమునుచూచి, ఆ పతములోనున్న

రూపము, నన్ను పంపిన దొరయొక్క రూపముగా నున్నదనినది. దొరసాని ఆ వార్తవినగానే నిట్టూర్పు విడిచి, మూర్ఛపోయిన దానివలె అరచిచెప్పినదేమనిన: "నీవుఏమిచెప్పుచున్నావు? నీకు ఈదినము సంభవించినసంగతిని నాకు వివరముగా చెప్పు" మనినది. బీదస్త్రీ, జరిగినదంతయు వివరముగాచెప్పినపిమ్మట, దొరసాని ఆమెను కట్టి కౌగలించుకొని, "నీవునాకు పనికత్తెవుకాదు; కుమార్తెవైతివి; ఈదినము నీవుచూచిన యాత్మ నా కుమారుడేయౌను. వాడు రెండు సంవత్సరములకు ముందు చనిపోయి, నీవు ఈ దినముచేయించిన పూజవల్ల ఉత్తరించు స్థలమునుండి, మోక్షమునకు పోయి యుండునని నాకు నిశ్చయముగా తోచుచున్నది. కాబట్టిమనమిద్దరమును ఇకమీదట ఎడబాయక ఉత్తరించు ఆత్మలనిమిత్తము వేడుకొనుదము" అనిచెప్పి ఆమెను తనయింటిలో ఉంచుకొని, తనకుమార్తెవలెనెవిచారించుచు వచ్చినది.

క్రీస్తువులారా! ఉత్తరించు ఆత్మలనుగురించి ఆయాకార్యములను చేయుదుమని దృఢమైనప్రతిజ్ఞ చేయవలయునని ఎరుగగలవారలు.

5 జ్యో- 5 ప్రి- 5 త్రిత్వ- లను చెప్పుట.

స్వామీ పాతాళమునుండిమిమ్ము......

* నిత్య పితా జేసుక్రీస్తునాథుని వెలలేని. (13పుటచూడుము.)

## ఫలముగల సుకృత జపములు.

* నాదేవుడా! నా సర్వమా! (50 దినముల ఫలము.)

దేవరవారి నామము నిమిత్తము మాకు మేలుచేయు

సమస్తులకును నిత్యజీవ్యమును దయచేయండి స్వామీ ఆమెన్ (50-ది. ఫ.)

నా ఏలినవారా! నేను మిమ్ములను స్నేహించ చేయనవ ధరించండి; మిమ్ములను అధికాధికముగా స్నేహించునదే నా స్నేహముయొక్క సంభావనగా నుండునుగాక. ( 100 దినముల ఫలము. )

స్పిరితుసాంక్తువా ! వేంచేసిరాండి, దేవరవారు మీ విశ్వాసుల హృదయములనునింపి మీ స్నేహాగ్నిని వారల యొద్ద రగులుకొని మండచేయ నవధరించండి. ( 300 దినముల ఫలము. )

* మిగుల మధురముగల జేసువా! నాకు మధ్యస్తులుగా నుండక రక్షకులుగా నుండండి. ( 50 దినముల ఫలము. )

* నాదేవుడైన జేసువా ! అన్నిటికంటె అధికముగా నేను మిమ్ములను స్నేహించుచున్నాను. (50 దినముల ఫలము.)

* నా జేసువా ! దయగానుండండి. (100 దినముల ఫలము.)

దాసీమకుమారుడైన జేసువా ! నామీద దయగానుండండి. (100 దినములఫలము.)

లోక రక్షకుడా! మామీద దయగానుండండి (50-ది-ఫలము)

జేసునాధుని మహాపరిశుద్ధ హృదయము ఎచ్చటను స్నేహించబడునుగాక. (100 దిన. ఫల.)

---

* ఈగురుతుగల జపములను ఒకరోజులో ఎన్ని మారులు చెప్పినను అన్ని మారులు దానికిగలఫలమునుపొందవచ్చును.

* శాంతమును దైన్యమునుగల హృదయము నిండిన జేసువా! నాహృదయమును మీ తిరుహృదయమునకు పోలికగా నుండచేయండి. (300 ది. ఫ)

మా స్నేహము నిమిత్తము రగులుకొనిమండు జేసునాధుని తిరుహృదయమా! మీమీద స్నేహము చేత మాహృదయము జ్వలించచేయండి. (100 దిన. ఫల.)

* జేసునాధుని మధురమైన హృదయమా! నా స్నేహముగా నుండండి. (300 దిన. ఫల.)

* మామీదగల స్నేహముచేత రగులుకొని మండెడు జేసునాధుని సత్ప్రసాద హృదయమా! మీమీదగల స్నేహముచేత మాహృదయములు రగులుకొని మండచేయ నవధరించండి. (200 ది. ఫల.)

* జేసునాధుని మహాపరిశుద్ధ హృదయమా! మీ రాజ్యము వచ్చునుగాక. (300 దిన. ఫల.)

* జేసునాధుని దివ్యహృదయమా! నానమ్మికమునంతా మీమీదనుంచుచున్నాను. (300 దిన. ఫల.

* స్నేహబలియైన జేసునాధుని దివ్యహృదయమా! నన్ను సర్వేశ్వరునికి తగినదిన్ని, పరిశుద్ధమైనదిన్ని, జీవముగలదియునైన బలివస్తువుగా చేయనవధరించండి. (50 దిన. ఫల.)

* నా జేసువుయొక్క మహామధురమైన హృదయమా! నేను ఎప్పుడును అధికమధికముగా మిమ్ములను స్నేహించచేయండి. (300 ది. ఫల.)

మిగుల పరిశుద్ధ పరమదివ్య సత్ప్రసాదమునకు సదాకాలము స్తోత్రమును, స్తుతియును, ఆరాధనయును కలుగును గాక. (100 ది. ఫలము.)

* దేవరత తల్లియైన మిగులపరిశుద్ధ కన్యమరియమ్మ గారి అమలోద్భవము స్తుతింప బడునుగాక. (300 దిన. ఫ.)

కళంకము లేక యుద్భవించిన మరియమ్మగారా! మీ శరణమును కోరివచ్చు మాకొరకు ప్రార్థించండి.(100దిన.ఫల.)

* తిరుహృదయముయొక్క మా ఏలినవారాలా! మా కొరకు వేడుకొనండి. (100 దిన. ఫల.)

మా నమ్మికమైన మరియమ్మా! మా మీద దయగా నుండండి. (300 దిన. ఫల.)

మరియమ్మా! సర్వేశ్వరునియొక్కమాతా! కనికర ముయొక్కతల్లీ! మాకొరకును, మృతిపొందిన వారల కొర కును వేడుకొనండి. (100 దిన. ఫ.)

మహాపరిశుద్ధ దేవద్రవ్య అనుమానముయొక్క మా ఏలినవారాలా! మా కొరకు వేడుకొనండి. (300 దిన. ఫల.)

వ్యాకులమాతా! సకల క్రీస్తువులయొక్క మాతా! మా కొరకు వేడుకొనండి. (300 దిన. ఫల.)

మరియమ్మగారియొక్క మహామధురముగల హృదయ మా! నా రక్షణముగానుండండి. (300 దిన. ఫల.)

జోజప్పగారా! మేము పరిశుద్ధులముగా జీవించచే యండి; మా జీవ్యము మీ పరిపాలనముక్రింద క్షేమముగా నుండునుగాక. (300 దిన. ఫల.)

జేసునాధుని మహాపరిశుద్ధ హృదయమును స్నేహిం చువారలకు పాలకులును, ముందుమాత్రుకయునైన అర్చ్య. జోజప్పగారా! నా కొరకు వేడుకొనండి. (100 దిన. ఫల.)

* జేసు మరియమ్మా. (300 దిన. ఫల.)

* జేసు మరియమ్మా జోజప్పగారా! (7 సం॥ 7

మండలముల ఫల.) జేసు మరియమ్మా జోజప్పగారా, నాకు జ్ఞాన వెలుతురునిచ్చి, నాకు సహాయముచేసి, నన్ను రక్షించ నవధరించుడు. (200 దిన. ఫల.)

* జేసుమరియమ్మా జోజప్పగారా, నా హృదయమునును ఆత్మనును మీాకుఒప్పగించు చున్నాకు. (100 దిన. ఫల.)

* జేసుమరిమమ్మా జోజప్పగారా, నాకడపటిమరణ సమయములో నాకుసహాయముగా నుండండి. (100దిన. ఫల.)

* జేసుమరియమ్మా జోజప్పగారా, నా యాత్మము మీాతో సమాధాన ఐక్యముగా నాశరీరమునువిడిచి ఎడబాయునుగాక. (100 దిన. ఫ.)

* జేసుమరియమ్మా జోజప్పగారా, ఇప్పుడును మరణావస్థసమయములోను మమ్మును ఆశీర్వదించండి. (50దిన.ఫల.)

* నాకు కావలిగానుండే సర్వేశ్వరుని సన్మనస్కులైనవారా, దైవీక కృపచేత మీాయొద్ద ఒప్పగించబడిన నాకు జ్ఞాన వెలుగునిచ్చి, నన్ను కాచి నడపించి ఏలుకొనండి ఆమెన్.

* స్వామీా! వారలకు నిత్య విశ్రాంతినిదయచేయుండి, ముగింపులేని ప్రకాశము వారలకు ప్రకాసించునుగాక. (50 దినముల ఫలము)

---

# ఫలముగల భక్తి క్రియలు.

"పితయొక్కయు, సుతునియొక్కయు, స్పిరితుసాంక్తుయొక్కయు నామముచేత ఆమెన్" అని ఉచ్చరించుచు, శ్లీవ గురుతువేయు ఒకొకసారికిని (50 దిన. ఫల.)

తీర్థమును అద్దుకొని పైచెప్పిన భక్తి కృత్యమును చేసినట్లయితే (300 దిన. ఫల.)

జపమాల సభ ఫలమును, శ్లీవసభ ఫలమును పెట్టి, మంత్రింపబడిన జపమాలను పట్టుకొని ఒకసారి 53 పూసలజపము చెప్పి ముగించినట్లయితే 1, 42, 775 (ఒకలక్ష నలుబదిరెండు వేల ఏడు నూటడెబ్బదియైదు దినముల ఫలము.)

స్లీవ ఫలమును పెట్టి మంత్రించబడిన జపమాల పూసను పట్టుకొని, ఆఫలమునుపొందు తలంపుతో జ్యోతిశ్చక్ర మంత్రమునుగాని, ప్రియదత్త మంత్రమునుగాని చెప్పు ప్రతిసారికిని (500 ది. ఫ.)

మరియు ఆజపమాలను దేవమాతకు స్తోత్రముగా, మెడలో వేసుకొనిగాని, నడుమున దోపుకొనిగాని ఉత్తమ మనస్తాప పడువారలకు రోజు ఒకటింటికి (100 సం॥ 100 మండలముల ఫలము.)

అమలోద్భవ ఉత్తరీయము ధరించుకొనియుండువారలు రోజుకు ఎన్నిమారులు 6 జ్యో-6 ప్రి. 6 త్రిత్వ స్తోత్రములను చెప్పి అర్చ్య-పాపుగారితలంపుకొరకును వేడుకొనుదురో అన్ని మారులును పూర్ణ అసంపూర్ణ ఫలములను పొందవచ్చును.

దేవమాత, జోజప్పగారి పూజితమాసములను ఇంటిలోగాని, గుడిలోగాని, భక్తితోకొని యాడువారలకు రోజు ఒకటింటికి (. 300 దినముల ఫలము)

తిరుహృదయము యొక్కయు, ఉత్తరించు ఆత్మలయొక్కయు స్మరణమాసములను ముందు చెప్పినవిధముగా కొనియాడువారలకు (7 సం॥ 7మండలముల ఫలము.)

ఆయా పూజితమాస అంత్యములోగా తమకు ఇష్టమైనపరోజునందుగాని మంచి పాపసంకీర్తనముచేసి దివ్యసత్ప్రసా

దములోకొని అర్చ్య. పాపుగారి తలంపుకొరకు వేడుకొనినట్ట యితే పరిపూర్ణఫలము.

పైచెప్పిన ఫలములను కూడినమట్టుకు పొంది, వాటిని ఉత్తరించు ఆత్మలకు ఒప్పగించ ప్రయాసపడుదాముగాక.

### ఉత్తరించు ఆత్మలకొరకు చేయతగు యుచిత ప్రమొక్కుబడి కానుక వేడుదల.

ఏకత్రీత్వమైన సర్వేశ్వరా! మీకధిక స్తోత్రమును చెల్లించనును, మారక్షకుడైన జేసుక్రీస్తునాథుని కని భావించనును, దేవమాతకు ప్రియపడనును, మేము మనసొప్పి ఉత్తరించు ఆత్మలకు ఉపకారసహాయముగా ఇప్పుడునాకు స్వంతమైన పరిహారఫలమంతటిని ఇకమీదటనాకు రాతగు పరిహారఫలమంతటిని, నామరణమునకు పిమ్మట నానిమిత్తము చేయబడు పుణ్యధర్మములవల్లను, దివ్యపూజలవల్లను కలిగే పరిహారఫలములు యావత్తును దేవమాత హస్తములలోనుంచి దేవర వారికి పూర్ణముగా ఒప్పగించుచున్నాను ఏలినవారైన సర్వేశ్వరా! ఈ నా ప్రమొక్కుబడి కానుకనునాయాత్మకు ప్రయోజనముగా కృపతో చేకొనవలయునని ప్రార్థించుచున్నాను. ఆమేన్ జేసు.

వివరము :—ఈ యుచితము ప్రమొక్కుబడి కానుకను గురించి ఎరుగవలసిన విశేషములన్నిటిని 28 వ-తేది ధ్యానములో చదివి ఎరుగవచ్చును.

---

## ఉత్తరించు ఆత్మల జపసంగీతము.

స్వామీ! పాతాళమునుండి మిమ్ము ఎలుగెత్తి పిలుచుచున్నాను! స్వామీ! నాకంఠధ్వనిని ఆలకించ నవధరించండి:- నావిన్నపములయొక్క శబ్దమును మీచెవులిచ్చి విన నవధరించండి. ఏలినవారా! మాపాపములను గమనించితిరైనా, మీ ఎదుట నిర్వాకముచేయగలవాడెవడు:—అయితే దేవరవారియొద్ద దయాళమైన క్షమయుండుటవల్లనున్ను, మీవేద నియమము నిమిత్తమై, స్వామీ మిమ్మునమ్మి కాచుకొని యున్నాను:—నాయాత్మము వారిదివ్యవచనము మీద ఊనియున్నది. నాయాత్మము వారియందు నమ్మిక నుంచియున్నది:—ప్రాతఃకాల జాము మొదలుకొని రాత్రివరకు ఇస్రాయేల్ జనముఏలినవారిని నమ్మికాచుకొనియుండునుగాక:—ఏలనంటే, స్వామి దయగలవారు వారియొద్ద రక్షణము పరాళముగానున్నది:— వారే ఇస్రాయేల్ జనమును దాని సకలపాపములనుండి రక్షించుదురు.

వ.—ఏలినవారా! వారలకు నిత్యవిశ్రమమును దయచేయండి.

ఉ.—నిత్యప్రకాశము వారలకు ప్రకాశించునుగాక.

వ.—వారలు సమాధానమందు విశ్రమింతురుగాక.

ఆమెన్-జేసు.

## ప్రార్థించుదము.

సమస్తుల విశ్వాసుల సృష్టకుడును రక్షకుడునైన సర్వేశ్వరా, మీదాసుల ఆత్మలకు సమస్తపాప నివారణమును కరుణించండి. వారలెప్పుడును ఆశించిన మన్నింపును మాభక్తిగల

వేషుదలచేత పొందచేయ నవధరించండి. పితతో నున్న స్పిరితు సాంక్తుత నున్న సదాకాలము జీవితులున్న రాజ్యపరిపాలకులునైన ఏలినవారా! ఆమేన్ జేసు.

వ.—విశ్వాసుల ఆత్మలు సర్వేశ్వరునిదయచేత సమాధానమందు ఆశ్రమింతురుగాక. అం. ఆమేన్ జేసు.

సంపూర్ణము.

---

# అచ్చుపొరబాట్ల సవరణ.

| పేజీ. | పంక్తి. | తప్పులు. | ఒప్పులు. |
|---|---|---|---|
| iii | 6 | నకందు | నందు |
| 3 | 25 | ఒడ్డోలక | ఒడ్డోలగ |
| 5 | 10 | జ్వోతిశ్చ | జ్యోతిశ్చ |
| 10 | 16 | రక్షిణ | రక్షణ |
| 12 | 25 | విస్వాస | విశ్వాస |
| 25 | 1 | వ్వారల | వారలు |
| 25 | 16 | తగి | తగ్గి |
| 33 | 20 | అలడుగుకు | అడుగడుగుకు |
| 33 | 25 | వల్గను | వల్లను |
| 34 | 3 | శరీల | శరీర |
| 35 | 16 | రూతెరు | లూతెరు |
| 39 | 24 | సులువునై | సులువునైన |
| 41 | 10 | సహించమీరు | సహించమీకు |
| 42 | 19 | కంటకము | సంకటము |
| ,, | ,, | సంకటముల | సంకటములు |
| 43 | 11 | లోలోమై | తోలోమై |
| 43 | 15 | కలిగించిర | కలిగించిన |
| 58 | 8 | సెప్పిన | చెప్పిన |
| 49 | 13 | అడుగడుకు | అడుగడుగుకు |
| 55 | 16 | విషయమునను | విషయములను |

| | | | |
|---|---|---|---|
| 65 | 23 | స్థలములలో | స్థలములో |
| 69 | 13 | అంతర్యకుక్ | అంతర్యకుస్ |
| 72 | 4 | సర్వేస్వరా | సర్వేశ్వరా |
| 73 | 2 | నిండిల | నిండిన |
| 74 | 1 | తమలో | తమతో |
| 74 | 18 | చర్తమానము | వర్తమానము |
| 80 | 19 | రరీరము | శరీరము |
| 84 | 22 | శాస్తులు | శాస్త్రులు |
| 92 | 13 | సల్మార్గ | సన్మార్గ |
| 95 | 22 | నిష్పాతో | నిష్ఫలో |
| 96 | 11 | సర్వేశ్వనుకు | సర్వేశ్వరునకు |
| 105 | 8 | పొతు | పొత్తు |
| 110 | 25 | వలననీసుకృతి | వలసినసుకృత |
| 111 | 15 | అయన | ఆయన |
| 114 | 8 | వంటిదన | వంటి |
| 115 | 4 | ఘనము | ఫలము |
| 126 | 15 | క్రూరత్వము | కూ్రరత్వము |
| 138 | 11 | నెల్లించ | చెల్లించ |
| 146 | 7 | బటులు | భటులు |
| 148 | 5 | దనియు | దని |
| 148 | 19 | [illegible]లగ | తొలగ |
| 151 | 23 | మాద | మీద |
| 152 | 7 | రాజేయ | రాజేయ |
| 152 | 13 | పరోనియూస్ | పరోనియూస్ |
| 154 | 3 | నుండిన | నుంచిన |

| | | | |
|---|---|---|---|
| 155 | 25 | చేవనీతికి | దేవనీతికి |
| 156 | 16 | కొద్ధిగా | కొద్దిగా |
| 157 | 16 | పీరవే | పీరతే |
| 160 | 9 | రక్తకము | రక్తము |
| 161 | 4 | పిభజించి | విభజించి |
| 163 | 15 | చడ్చిన | చచ్చిన |
| 169 | 11 | నిత్మపితా | నిత్యపితా |
| 175 | 1 | మెస్ద్రీతమ్మ | మెస్బ్రీతమ్మ |
| ,, | 12 | మెన్బ్రీతమ్మా ! | మెస్బ్రీతమ్మా! |
| 177 | 8 | ప్రమోగించు | ప్రయోగించు |
| 193 | 11 | విశ్రమము లేక | మరచి |
| 205 | 23 | ఆలాగు | వారుఆలాగు |
| 207 | 9 | చాలైన | చావైన |
| 208 | 13 | చెరబడినచెబడిన | చెరబడిన |
| 209 | 16 | దేవమాత్రకు | దేవమాతకు |
| 211 | 14 | స్వాము | స్వామి |
| 212 | 15 | ఈవ్రూజ | ఈపూజ |
| 229 | 17 | అర్చ్యశ్రీ జెసువా | అర్చ్యశ్రీ జేసువా |
| 235 | 23 | విశ్వాసముగా | విశ్వాసముగదా! |
| 236 | 8 | వటువంటి | ఎటువంటి |
| 237 | 11 | వచ్చెసు | వచ్చెదు |
| 240 | 7 | ఉత్తరించి | ఉత్తరించు |
| 241 | 7 | ఆయవ్వనుకు | ఆయవ్వనుకు |
| ,, | 21 | ఎదెన | ఏదెన |